


## సాహిత్య మాసపత్రిక



తెనుగువారి
సంస్కృతికి
ప్రతిబింబం



## లోకంపోకడ — ఊమెన్













**ఆంధ్రసచిత్రవారపత్రిక**

వ్యవస్థాపకులు :
**దేశోద్ధారక కాశీనాథుని**
**నాగేశ్వరరావు పంతులుగారు**
స్థాపితం : 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
[1938 - 1972]
శుక్రవారం : 31-12-'82
దుందుభినామ సం. మార్గశిర బ. పాడ్యమి
**సంపుటము 75 సంచిక 18**
సంపాదకుడు :
**శివలెంక రాధాకృష్ణ**
*
విడి ప్రతి వెల రు 1-50
**ఆంధ్రపత్రిక కార్యాలయము**
గాంధీనగరం, విజయవాడ-520 003

## విషయానుక్రమణిక

# మనం అంటే మనకే చిన్నచూపు




అనుకున్నదే జరిగింది– పసుపు రంగు వారు ఎనుపు లోహం పతాకాలని పట్టుకు పోయారు ఆసియాడ్‌లో. చీనా, జపాన్, రెండు కొరియాలూ కలిసి 10 బంగారు పతాకాలలో 9 గెలుచుకున్నారు. వెండి, కాంశ్య పతాకాల సంగతి సరేసరి! చీనా సాధించిన విజయాలలో వింత ఏమీలేదు. వందకోట్ల మంది జనం ఉన్నారు కదా? అంటే ప్రపంచ జనాభాలో పావుభాగం అన్నమాట. ఏ విధంగా చూసినా చీనా పెద్ద దేశమే. అందుకనే తన పెద్దతనాన్ని గురించి ఎవరినీ మరిచిపోనివ్వరు చీనా వారు. ఆసియాడ్‌లో మరిచిపోనివ్వలేదు. కాని, జపాన్, కొరియాలు చిన్న దేశాలే కదా? జపాన్ జనాభా ఎంత? చీనా జనాభాలో ఆరవ వంతు కన్నా తక్కువ. కొరియాల జనాభాలు కలిపితే జపాన్ జనాభాలో సగం కూడా వుండరు. ఇంత చిన్న దేశాలు చీనాని మించి పతకాలు గెలుచుకున్నాయి ఆసియాడ్‌లో. వాళ్లే అసలు విజేతలు.

ఎలాగ సాధించారీ విజయాలని? జపాన్ వారు సాంకేతిక విజ్ఞానం విషయంలో అగ్రగణ్యులుగా వున్నారు. ఆటలలోనూ ప్రథమ స్థానంలో వుండటానికీ, దీనికీ సంబంధం ఏమయినా వుందా? వుందేమో. కాని వాళ్ళకి తమని చూస్తే తమకి తక్కువ భావంలేదు ఈ శతాబ్దం ప్రారంభంలో జపాన్ యుద్ధంలో రష్యాని ఓడించింది. అప్పటిలో బ్రిటన్, అమెరికా సంయుక్త రాష్ట్రాలు అగ్రదేశాలుగా చెలామణి అయ్యేవి రష్యా కన్నా, అమెరికా కన్నా, బ్రిటన్ కన్నా అగ్రరాజ్యం తమది అని జపాన్ వారు అనుకోవటానికి ఈ గెలుపు బాగా సహాయపడి వుండాలి. ఒక వ్యక్తికి అహంకారం ఉండటం మంచిది కాదేమో; ఒక దేశ ప్రజలు తాము అధికుల మనుకుంటే వాళ్ళు ఎంతో సాధించ గలరు. అహంకారం లేనిదే జపాన్ వారు పెర్ల్‌హార్బర్ మీదా, సింగపూర్ మీదా దాడి చేసేవారా? అసలు వాళ్ళకి తమ ఆధిక్యం మీద నమ్మకం వుంది కాబట్టే ఇవాళ వాళ్ళు ఈ స్థానంలో వున్నారు. జపాన్ నేడు ఆసియాలో కెల్లా సంపన్నమయిన దేశం; ప్రపంచంలోకెల్లా సంపన్నమయిన దేశాలలో రెండవ స్థానం ఆక్రమిస్తున్న దేశం.

ఒక దేశంగా, ఒక జాతిగా జపాన్ వారికి ఆత్మాభిమానం ఎక్కువ. ఒక్కొక్కప్పుడు ఈ ఆత్మాభిమానం ఇతరులతో మాటలాడ టానికి కూడా అడ్డు వస్తుంది. టోక్యోలో 'గింజా' అనే బజారు వుంది. ఇక్కడ ఎన్ని పెద్ద షాపులు వుంటాయో చెప్పలేము. [మన దేశంలో ఇన్ని క్షవరశాలలు వున్న బజారే లేదేమో.] దేనిలోకయినా వెళ్ళండి. ఏదయినా కొనాలనుకొని అంగళ్ళలో వాళ్ళని అడిగి చూడండి. ఇంగ్లీషులో అడిగి చూడండి. ఎంత మందికి అర్థం అవుతుందో మీకే తెలుస్తుంది! [అర్థమయ్యేవాళ్లే తక్కువ. ఇక మాట్లాడే వాళ్ళ సంగతేమిటి?] ప్రతి పెద్ద షాపులోని ముఖ్య విభాగంలోనూ ఇంగ్లీషు కొంత వచ్చిన వ్యక్తి ఎవరో వుంటారు. సాధారణంగా అమ్మాయిలే దుబాషిలుగా వుంటూ వుంటారు. సిగ్గుపడుతూ, ఇంగ్లీషు మాట్లాడుతూ వుంటారు వీళ్ళు. పెద్ద బాంకులలోకి వెళ్ళండి. కోట్ల బేరాలు జరుగుతూ వుంటాయి. వాటిలో పనిచేసే గుమాస్తాలని పలకరించి చూడండి. ఇంగ్లీషు రాదంటారు. టోక్యోలో ఇంగ్లీషు పత్రికలు దొరకటం కష్టం. పెద్ద హోటళ్లలో దొరుకు తాయేమో! అక్కడా వార, మాసపత్రికలు తప్ప దినపత్రికలు చాలా అరుదు. టోక్యోని వదిలి ఒక వంద కిలోమీటర్లు బయటికి వెళ్ళండి. ఇంగ్లీషు ఎవరికీ రాదు హిరోషిమా



డిసెంబరు 4 వ తేదీన జవహర్‌లాల్ నెహ్రూ స్టేడియం (న్యూఢిల్లీ)లో ఆసియా క్రీడోత్సవాల ముగింపు కార్యక్రమాన్ని రాష్ట్రపతి శ్రీ జైల్‌సింగ్, ఉప రాష్ట్రపతి శ్రీ హిదయతుల్లా, ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరాగాంధీ ప్రభృతులు తిలకిస్తున్న దృశ్యం.

# న్యూ ఢిల్లీ లేఖ

పెద్ద యాత్రా కేంద్రం; నేను అక్కడికి వెళ్లాను. తిరిగి నా హోటలుకి రావటం కష్టం అయింది. ఎందుకంటే, ఇంగ్లీషు మాటలాడగానే బిగుసుకుపోతారు జనం.

నేనొకసారి జపాన్ ప్రభుత్వం విదేశాంగ శాఖలో ఒక పెద్ద అధికారిని కలుసుకున్నాను. ఆయన భారతదేశంలో పని చేసిన మనిషే. ఆయనకి ఇంగ్లీషు వచ్చుననుకున్నాను. కాని, దుబాషీని పెట్టుకుని వున్నాడు. నేను ఆయనతో జరిపిన ఇంటర్వ్యూ నాలుగు గంటలు పట్టింది. ప్రతి వాక్యాన్నీ అనువాదం చెయ్యాలి కదా? అంతా అయిన తర్వాత నేను అడిగాను "మీ రెక్కడ చదువుకున్నారు?" అని.

"కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయంలో" అన్నాడు ఆయన. [పండిత నెహ్రూ చదువుకున్న విశ్వవిద్యాలయమే.]

"మరి ఇంగ్లీషు మాటలాడలేనేమిటి?" అని నేను అన్నాను. "దుబాషీ ఎందుకు?"

"మీరు భారతీయులు, నేను జపాన్ వాడిని. మనం ఇంగ్లీషులో ఎందుకు మాటలాడాలి?" ఆయన ఎదురు ప్రశ్న ఇది.

ఈయన సంగతి ఇలాగ వుంటే భారత దేశంలో కొన్ని కుటుంబాల వాళ్ళకి ఒక భారతీయ భాష మాటలాడటమే నామోషీ. (నౌకరులతో తప్ప.) కొత్తఢిల్లీ లోని కొన్ని పేటలలో కొందరు దొరబిడలు జీన్స్ వేసుకుంటారు. విదేశీయాసతో హిందీ మాటలాడుతారు [ఎవరితో? ఒకరితో ఒకరూ, పనివాళ్ళతోనూ కూడా.] కొత్తఢిల్లీ సంగతి ఇలాగ వుంటే బొంబాయి, కలకత్తాల సంగతి వేరే చెప్పాలా? ఈ బిడలు ఎవరు? మన పెద్ద అధికారుల, వ్యాపారుల సంతానం. ఈ దేశంలోని "పెద్దవాళ్ళ"కి తమ భాష అంటే సిగ్గు అంటే ఇంక మనమేమి పెరుగుతాము, ఏమి స్వాలంబనం సాధిస్తాము?

రాజకీయ వాదులూ ఇంతేకదా! ఈ మధ్య ఫ్రాన్సు అధ్యక్షుడు శ్రీ మిటరాండ్ భారతదేశం వచ్చి మన పార్లమెంటులో ప్రసంగించినప్పుడు ఆయన తమ మాతృభాషలో మాటలాడారు. ఇది సహజం కదా! మన ఉపరాష్ట్రపతి శ్రీ హిదయతుల్లా లేచి మాటాలాడినప్పుడు ఆయన ఫ్రాన్సు భాషలో ప్రసంగం చేశారు! ఈ ప్రసంగంలో ఏ దేశంలో నయినా ఆ దేశం శాసనసభలో ఆ దేశంలో అత్యున్నత పదవిలో వున్నవారు ఎవరయినా ఒక విదేశీ భాషలో మాటలాడుతారా? శ్రీ హిదయతుల్లాకి ఫ్రాన్సు భాష వచ్చు. బాగానే వుంది. కాని తాను ఈ భాషా విజ్ఞానాన్ని ప్రదర్శించు కొనటానికి ఇదేనా సందర్భం, స్థలం? శ్రీ మిటరాండ్‌కి ఇంగ్లీషు రాదనా? వచ్చు కాని మాటలాడే అలవాటు ఫ్రాన్సు దేశీయులకి తక్కువ. కే. శే. డిగాల్ ఇంగ్లీషులో బహిరంగ ప్రసంగం చెయ్యగా ఎవరయినా విన్నారా?

ఒక దేశం అభివృద్ధి చెందాలంటే ఆ దేశంలో వాళ్ళకి తమ మీద తమకి నమ్మకం వుండాలి మనకి ఎందుకో ఆత్మ విశ్వాసం తక్కువ అనిపిస్తుంది. మన భాషలని మనమే తిట్టుకుంటాము. మన సంస్థలని మనమే వేళాకోళం చేసుకుంటాము. మన మతం అంటే మనకే అవజ్ఞ. మన సంస్కృతి అంటే మనకి గౌరవం లేదు. మన దేశంలో సాంప్రదాయికంగా వచ్చిన వేషధారణ అంటే మనకి చిన్నచూపు. ఆసియాడ్‌లో ఒక విశేషం జరిగింది. దానిని ఎందరు గమనించారో తెలీదు. ప్రారంభోత్సవంలో వివిధ దేశాల జట్టులు ఎ బి సి డి ల ప్రకారం కాకుండా అ, ఆ, ఇ, ఈ ల ప్రకారం వరుసగా వెళ్లాయి. ప్రకటనలు ముందు హిందీలో, తర్వాత ఇంగ్లీషులో చేశారు. ఫలితాలు తెలిపే బోర్డుల మీద కూడా హిందీ ముందు, తర్వాత ఇంగ్లీషు. క్రీడాకారులని తీసుకువెళ్ళిన బస్‌లలో హిందీ వుంది. ఇంగ్లీషు రాని శ్రీ ఎమ్. జి. రామచంద్రన్ లాంటి రాజకీయ వాది తప్ప ఇంగ్లీష్ కావాలని ఎవరంటారు? అసలు మనకి తగిన రాజకీయ నాయకులు రాక ఇంకెవరొస్తారు?

జపాన్‌లో నేను గమనించిన మరొక విశేషం. వాళ్ళలో ఎవరూ టామియమమోటో అని కాని, మహమ్మద్ కరిషిమా అని కాని పేరు పెట్టుకోరు. అలాగని జాపాన్‌లో క్రైస్తవులూ, మహమ్మదీయులూ లేరని కాదు. మహమ్మదీయ దేశాలలో మహమ్మదీయేతర నామధేయాలని నిషేధించారు. మనది ప్రజాస్వామ్యం .... మహమ్మదీయ దేశాలలో నియంతల పరిపాలనే అధికంగా కనపడుతుంది. వాళ్ళలాగ మనకి నిషేధాలు అనవసరం. మనం ఇష్టం వచ్చిన పేరులు మనం పెట్టుకోవచ్చు! గులాబీ పువ్వు పేరు ఏదయినా దాని సౌరభం ఒకటే కాని మన భాషలో పేరు వింటే ఇంకా చక్కటి వాసన వేస్తోందని అనిపించదూ? ★



ఆసియా క్రీడోత్సవాలలో హెవీ వెయిట్ బాక్సింగ్‌లో విజయం సాధించిన భారతీయుడు కౌర్ సింగ్‌కు ప్రముఖ సినీ నటుడు శ్రీ అమితాబ్ బచన్ స్వర్ణపతకాన్ని బహూకరించినప్పుడు తీసిన ఫొటో.




# ఇల్లు

కొలను వెంకట దుర్గాప్రసాద్

రమణమూర్తి డబ్బు జేబులో వేసుకుని బ్యాంక్ నుండి బయటకు వచ్చాడు.

మధ్యాహ్నం ఎండ మండిపోతోంది. బ్యాంక్‌లో పట్టిన మొహం మీది చెమటను కండువాతో తుడుచుకున్నాడు. అప్పటివరకూ, చెమటకు ముక్కుమీద నుండి జారిపోతున్న కళ్ళజోడు కాస్త నిలకడగా వుంది.

సంవత్సరాల తరబడి నిజాయితీగా చేసిన సేవకు ప్రతిఫలంగా నెల నెలా పెన్షన్ ఇస్తోంది ప్రభుత్వం. ఈ పెన్షన్ లేకపోతే తనలాంటి వాళ్లకు చాలా ఇబ్బందే! జేబులో పెన్షన్ డబ్బును తడుముకుంటూ అనుకున్నాడు.

అతని మనసులో 'ఇల్లు' మెదిలింది. ఆ ఇంటివేదారి పట్టాడు. ఆ ఇంటిని తల్చుకుంటే రమణమూర్తికి చాలా ఉత్సాహంగా వుంటుంది. అతనెప్పుడూ నెమ్మదిగా ఆలోచిస్తూ నడుస్తాడు. కానీ ఆ ఇంటికి వెళదామని పించినప్పుడు తనకు తెలీకుండానే వడివడిగా అడుగులేస్తూ నడుస్తాడు.

రమణమూర్తి ఆ ఇంటి ముందు ఆగాడు. దాని చుట్టూ ప్రహరీగోడ వుంది. మధ్యలో మంచి కలపతో చేసిన చిన్న గేటు వుంది. చాలా పాతది అయినా చెప్పుకోతగినంత గట్టిగానే వుంది.

రమణమూర్తి గేటును తాకాడు. మనసు ఏదో ఆనందానుభూతికి లోనయింది. మెల్లగా గేటును తీసాడు చప్పుడయింది. లోపలికి అడుగు పెట్టి మళ్ళీ గేటు వేసేసాడు. మరి రెండడుగులు వేసి ఇంటికేసి చూసాడు.

ముందర పెంకు వసారా, వెనక డాబా గదులు. రెండు వాటాలున్న ఇల్లు అది. ఒక్కొక్క వాటా మూడు గదులు.

రమణమూర్తి వసారాలోకి అడుగు పెట్టాడు. అప్పుడే గుమ్మం తలుపు తీసి నిలబడింది ఆమె.

'ఏమ్మా! శంకరంగారు వున్నారా?' అడిగాడు.

'ఆయనింకా బ్యాంక్ నుండి రాలేదు. వచ్చేవేళయింది. వచ్చి కూర్చోండి' అంది ఆమె శంకరం భార్య సుశీల.

శంకరం పనిచేసే బ్యాంక్ ఉదయం, సాయంత్రం పని చేస్తుంది. శంకరం మధ్యాహ్నం వేళల్లో ఇంట్లోనే వుంటాడని తనకి తెలుసు. ఇవాళెందుకో ఇంకా రాలేదు. అతనొచ్చేవరకూ పదినిముషాలు కూర్చుంటాను. అయినా పదినిముషాలు కాదు, పది గంటలు కూర్చోమన్నా తను ఈ ఇంట్లో కూర్చోగలడు, అనుకున్నాడు రమణమూర్తి.

ఆమె కుర్చీ తెచ్చి వసారాలో వేసింది. రమణమూర్తి కూర్చున్నాడు కొద్దిగా కాళ్ళు చాపి, కుర్చీలో వెనక్కి వాలాడు ఒక్క క్షణం అతని మనసు ఎటో తేలిపోతోంది సంతోషంతో.

కళ్ళు తెరిచాడు. మంచినీళ్ళు కావాలా అని అడుగుతుందేమోనని ఎదురు చూసాడు. ఆమె అడగలేదు. ఆమె లోపలికి వెళ్ళిపోబోతున్నసమయంలో —

'కాస్త మంచినీళ్ళు ఇవ్వమ్మా!' అడిగాడు రమణమూర్తి.

సుశీల కాస్త కంగారుపడింది. 'ఇవాళ పంపులో నీళ్ళు రాలేదు బాబాయిగారు. బావినీళ్ళు వాడుతున్నాం ...' అంది.

'బావి నీళ్లకేం! అవంటే నాకు చాలా యిష్టం. తెచ్చివ్వమ్మా!' అడిగాడు రమణమూర్తి సంబరపడిపోతూ.

సుశీల బావినీళ్ళు తెచ్చి ఇచ్చింది — అవి ఆయన చేత తాగిస్తున్నందుకు బాధపడుతూ.

నీళ్ళు తాగి, గ్లాసు ఆమెకు తిరిగి ఇచ్చాడు. 'చూడమ్మా! ఈ ఇల్లు కట్టి

నప్పుడు ఇదంతా పెద్ద మైదానం. అరమైలు వరకు ఇళ్ళు కనపడేవి కావు. మోకాలి లోతు బురద వుండేది. అప్పుడు ఈ వీధికి పంపు లెక్కడివి? ఈ బావినీళ్లే వాడేవాళ్లం. ఇప్పుడు వూరు పదింతలయింది. ఈ వీధులు తారు రోడ్లయ్యాయి. పంపులు వేసారు. వీధిలైట్లు వేసారు.' అన్నాడు.

సుశీల గ్లాసు తీసుకుని లోపలికెళ్ళింది. గేటు చప్పుడయింది. శంకరం రాక గమనించి రమణమూర్తి కుర్చీలోంచి లేచాడు.

'కూర్చోండి! ఎంత సేపయిందీ వచ్చి?' అడిగాడు శంకరం, కాలి జోళ్ళు విడుస్తూ.

'అయిదు నిముషాలవుతుంది, అంతే!' అన్నాడు రమణమూర్తి మళ్ళీ కుర్చీలో కూర్చుంటూ.

శంకరం లోపలికెళ్ళి బట్టలు మార్చుకుని, బావిదగ్గరికెళ్ళివచ్చాడు. తుండులో మొహం తుడుచుకున్నాడు. కుర్చీ ఒకటి తెచ్చి వసారాలో వేసుకుని కూర్చున్నాడు

'భోజనం చేయలేదనుకుంటా, చేసిరండి. నేను కూర్చుంటాను'అన్నాడు రమణమూర్తి.

'ఫరవాలేదులెండి ఆకలిగా లేదు. తర్వాత తింటాను' అన్నాడు శంకరం

'అయ్యో! ఒంటిగంటి అవుతోంది. మీరు భోంచెయ్యండి. నేను కూర్చుంటాను. తర్వాత కాసేపు మాట్లాడుకోవచ్చు'అన్నాడు రమణమూర్తి, ఎక్కువసేపు కూర్చుని పోవచ్చుననే నెపంతో.

'మీరూ భోంచేద్దురు గాని రండి' అన్నాడు శంకరం.

రమణమూర్తి నవ్వాడు. 'నాకుప్రొద్దుటే భోజనం చెయ్యడం అలవాటు. ఉద్యోగం నుంచి రిటైరయినా భోజనం వేళలో మార్పులేదు' అన్నాడు.

'ఏదైనా పనిమీద వచ్చారా!' శంకరం అడిగాడు.

'వూర్కెనే, మిమ్మల్ని ఓసారి చూసి పోదామని...' రమణమూర్తి అన్నాడు.

'ఈయన ఇల్లు చూడడానికి వచ్చాడు, తనను చూడడానికి కాదు' అనుకుని శంకరం నవ్వుకున్నాడు.

'ప్రక్కవాటాలో ఆయనకు ట్రాన్సుఫరు అవుతోందని అన్నారు, అయిందా!' రమణమూర్తి ఆత్రంగా అడిగాడు.

'లేదు. దానికోసమే ఎదురు చూస్తూ వున్నాడాయన' అన్నాడు శంకరం.

రమణమూర్తిలో మొలకెత్తిన ఆశ పెద్దదయింది. అయితే ఆ వాటా తను అద్దెకు తీసుకోవచ్చు అనుకున్నాడు.

'కానీ, ఈ ఇల్లు అమ్మేస్తున్నాం. నా ఫ్రెండు కొంటున్నాడు. రాతకోతలు జరుగుతున్నాయి.' అన్నాడు. ఆ మాట వినగానే రమణమూర్తి కళ్ళల్లో నీళ్ళు నిలిచాయి. 'అమ్మేస్తున్నారా!' అతని నోటి వెంబడి మాట సరిగా రాలేదు. రమణమూర్తి దిగులును చూసి శంకరానికి జాలేసింది.

'అవును, మా చెల్లెలి పెళ్లి నిశ్చయమయింది. బాగా డబ్బు అవసరమయింది. పైగా నాకు ఈ వూర్నుండి ట్రాన్సుఫరు అయింది' అన్నాడు శంకరం.

రమణమూర్తి తల వంచుకుని నేలని చూస్తూ వుండిపోయాడు. అతనికి నేల మసక మసకగా కనిపిస్తోంది కళ్ళజోడు లోంచి. రెండు క్షణాలు గడిచాయి.

'మీ భోజనానికి ఆలస్యం అవుతోంది -- ఇక నేను వెళ్తాను!' అంటూ లేచాడు రమణమూర్తి

శంకరం మాట్లాడలేదు. రమణమూర్తి మెల్లగా నడుచుకుంటూ గేటు దగ్గర కొచ్చాడు. ఒక్కసారి వెనక్కి తిరిగి ఇంటిని చూసాడు. వస్తున్న దుఃఖానికి ముక్కు వణికింది. గభాల్న రోడ్డు వేపుకు తిరిగి, గేటు తీసి, బయటకొచ్చి మళ్ళీ గేటు వేసేసారు. మెల్లగా నడుస్తూ ఆలోచిస్తున్నారు.

మెయిన్‌రోడ్డు చేరుకున్నాడు. బస్సు కోసం చాలాసేపు నిలబడ్డాడు. ఇక నిలబడలేక అక్కడే బడ్డీదుకాణం దగ్గర వున్న చిన్న బెంచీమీద కూర్చున్నాడు. ఎండ మండుతోంది. గాలి లేదు చెమటకు లాల్చీ తడిసి పోయింది. కళ్ళజోడు తీసి కండువాతో మొహం తుడుచుకున్నారు ఒకసారి. తను అద్దెకున్న ఇంటికి వెళ్లే బస్సులు గంటకొకటి రావడం అదృష్టం. ఇలా ఎంతసేపు కూర్చోవాలో!

రమణమూర్తి ఎక్కవలసిన బస్సు వచ్చింది. బస్సు ఎక్కాడు. అయిదారుమైళ్ళ తర్వాత అతను దిగవలసిన చోటు వచ్చింది. బస్సు దిగి ఇంటిదారి పట్టాడు.

'అప్పుడే వచ్చేసారా! కబుర్లు చెపుతూ సాయంత్రంవరకు ఆ ఇంట్లోనే కాలక్షేపం

చేస్తారనుకున్నా' అంది జానకి తలుపు తీస్తూ.

రమణమూర్తి కాళ్ళు కడుక్కుని ఇంట్లోకి వచ్చాడు పడక కుర్చీలో వాలాడు. జానకి రమణమూర్తిని చూసి 'మజ్జిగ తీసుకురానా !' అడిగింది.

'వద్దులే !' అన్నాడు కళ్ళు మూసుకుని.

'ఏమిటలా వున్నారు ! ఒంట్లో బాగోలేదా !' కాస్త కంగారుగా అడిగింది.

'అదేంలేదు. బాగానే వుంది' అన్నాడు కళ్ళు మూసుకుని ఆలోచిస్తూ.

నలభై ఏళ్ళ పై మాట.

నాన్న స్థలం కొన్నాడు ఆ స్థలం ఒక పెద్ద మైదానంలో వుంది. నాలుగు ఫర్లాంగుల దూరంలో ఒక్క ఇల్లు కూడా లేదు. అటువంటి చోట నాన్న ఇల్లు కట్టించాడు. మరి అప్పుడు అందుబాటులో దొరికిన స్థలం అది. అప్పటికి తన హైస్కూలు చదువు అయింది ఎండాకాలం శెలవులు అప్పుడే ఇల్లు కట్టడం మొదలయింది.

ఆ ఇల్లు కట్టేనపుడు తను దగ్గర వున్నాడు రాత్రిళ్ళు ఒక మనిషితో పాటు తను కూడా కాపలా వుండేవాడు. వెన్నెల్లో ఇంటికోసం తెప్పించిన ఇసుక దిబ్బ మీద దుప్పటి పరచి పడుకునేవాడు. ఏవేవో వూహలు. ఇల్లు పూర్తి అయిన తర్వాత గదులు బాగా చక్కగా తీర్చిదిద్దాలనుకునేవాడు. ఎక్కడెక్కడ ఏ వస్తువు వుంచాలో గుర్తు పెట్టుకుంటూ వుండేవాడు. ఇల్లు కట్టేవాళతో తనూ ఒకడయి పని చేసాడు. గోడలు కొద్ది కొద్దిగా కట్టడం పూర్తి అయిన తర్వాత, తనే వాటికి స్వయంగా నీళ్ళు పోసేవాడు— బావిలో నీళ్ళు తోడి. సరదా కోసం మేస్త్రీ దగ్గర తాపి లాగి గోడమీద ఇటుకలు పేర్చి సిమెంటు కూర్చేవాడు. 'నువు కూర్చోవేశయ్యా. నీ కెందుకు చేతగాని పనులు. చూడు, గోడ ఎంత వంకరగా వచ్చిందో' అని కోప్పడేవాడు మేస్త్రీ.

రోజూ పనివాళ్ళకు, మేస్త్రీకి ఎంత అయిందో ఖర్చు రాయమనేవాడు నాన్న. సిమెంటు బస్తాల కోసం డబ్బు ఇచ్చేవాడు. తనే దగ్గర వుండి వాటిని కొని బండిమీద వేయించి తీసుకొచ్చేవాడు.

ఇల్లు కట్టడం చాలా పొదుపుగా జరిగింది. నాన్న చేస్తున్నది చిన్న ఉద్యోగం. పైగా ఇల్లు అప్పుతో కడుతున్నది. అందుకని ఏ వస్తువూ నిరుపయోగం కాకుండా చూసుకునేవాడు నాన్న.

ఇల్లు పూర్తయింది. గృహ ప్రవేశం జరిగింది. కానీ ఇంటిపని చాలా వుండి పోయింది. ఇంటాబయటా, లోపల సిమెంటు పూత కాలేదు. ప్రహరీ లేదు. అప్పుతో కట్టడంవల్ల జీతంలోంచి కొంత తీసి అప్పు తీర్చవలసి వచ్చేది. దానితో ఆర్థికంగా ఇబ్బందులు పెరిగాయి. నా కాలేజి చదువు ఆర్నెల్లతో ఆగిపోయింది. రెండేళ్ళు గడిచాయి అలా. తర్వాత తనకు ఉద్యోగం వచ్చి వేరే వూరు వెళ్ళాడు. శలవలు వచ్చినప్పుడల్లా తను ఈ వూరు వచ్చేవాడు. తను నెలనెలా పంపిన డబ్బుతో కొంత ఇంటి పనులు జరుగుతూ వుండేవి. అప్పు తీర్చడం కూడా సుఖంగానే జరిగిపోయింది. తన వూరికి బదిలీకోసం ఎంతో ప్రయత్నించాడు. కానీ రాలేదు. వేరే వూళ్ళు తిరిగాడు. అయినా నెలనెలా డబ్బు పంపుతూనే వున్నాడు. ఇంటి లోపలా బయటా సిమెంటు పూత జరిగింది. చుట్టూ కాస్త కాస్తగా గోడ లేచింది.

మరో అయిదేళ్ళు గడిచాయి. తనకి మాత్రం తన వూరికి ట్రాన్స్‌ఫర్ కాలేదు. సొంత ఇంట్లో వుందామన్న కోర్కె, అలాగే వుండిపోయింది. చాలా కాలం తర్వాత తనకు ట్రాన్స్‌ఫరు అయింది ఈ వూరుకి. అంత కాలం వూరూరా తిరుగుతూ ఇరుకు అద్దె కొంపలో గడిపిన తనకు, సొంత ఇంట్లో పాదం మోపగానే, పునర్జన్మ ఎత్తినట్టు అనిపించింది.

కానీ ఆ సంతోషం ఎంతోకాలం నిలువలేదు. ఇద్దరు చెల్లెళ్ళు పెళ్ళికి ఎదిగారు. సంబంధాలు కుదిరాయి. డబ్బులేదు. తండ్రితో తను చర్చించాడు. చివరకు, ఎంతో బాధగా, ఇల్లు అమ్మాలనే నిర్ణయం తీసుకోవాల్సి వచ్చింది.

ఇల్లు పోయింది. చెల్లెళ్ళ పెళ్ళి జరిగిపోయింది.

అంతే ! ఈ వూళ్ళో అద్దె ఇంట్లో వుండలేక బదిలీ చేయించుకుని వేరే వూరు వెళ్ళిపోయాడు తను, తల్లిదండ్రులతో.

పెళ్ళయింది. ఇద్దరు పిల్లలు.

కాలం గడిచింది. తనూ, జానకి ఇద్దరు పిల్లలతో మిగిలాం. ఎన్నో వూళ్ళు ఉద్యోగ నిర్వహణలో తిరిగాడు. పిల్లలు చదువుకున్నారు. ఇద్దరూ గుమస్తా ఉద్యోగాలు సంపాదించుకున్నారు. పెళ్ళిళ్ళు అయినాయి. చెరొక వూళ్ళో ఉద్యోగాలు చేస్తున్నారు.

తను ఈ సంవత్సరమే రిటైరయ్యాడు. తన వూళ్ళోనే వుండాలనిపించింది. కొడుకుల దగ్గరకు వెళ్ళాలనిపించలేదు. తన వూళ్ళో ఇల్లు లేకపోయినా, ఆ 'ఇంట్లో' కనీసం అద్దెకుండాలన్న కోరిక జనించింది. కానీ అది ఖాళీగాలేదు. వున్నా, అద్దె భరించలేనిది అవుతుంది. అందుకే నెలనెలా పెన్షన్‌కోసం బ్యాంక్‌కు వెళ్ళినప్పుడు, ఆ 'ఇంట్లో' కాసేపు కూర్చుని వెళ్ళడం అలవాటు అయింది. శంకరం తనని అర్థం చేసుకున్న మనిషి. కానీ అతను ఇల్లు అమ్మేస్తున్నాడు. తనకి








బులుసు వేంకటరమణయ్య

# నిర్వ్యాపారత

ప్రతి ప్రాణీ ఏదో ఒక పని చేస్తూనే వుంటుంది. కీటకాల దగ్గర నుండి మానవుల దాకా అంతా ఏదో పనిలో నిమగ్నులయి వుండడం కానవస్తుంది. ఉదాహరణకు చీమలను తీసుకోవచ్చు. అవి ఒక క్షణం కూడా నిర్వ్యాపారంగా వుండవు. క్రమశిక్షణ వాటివల్లనే మనం నేర్చుకోవచ్చు. అవి ఎక్కడికి వెళ్ళినా బారులుతీరి వెళతాయి గాని చెదురు మదురుగా వెళ్ళవు. ఒకవేళ ఏదయినా ఒక చీమ వరుస తప్పిందంటే నాయకత్వం వహించిన చీమలు దానిని వరుసలో వుంచుతాయి.

పని లేకుండా ఏ మానవుడూ ఉండడు. ఏదో ఒకటి చేస్తూనే వుంటాడు అలస భావం వున్నవారు అప్రయోజకులుగా లెక్కించబడతారు. ఆముష్మికానికి గాని, ఐహికానికి గాని నిర్వ్యాపారత పనికిరాదు. కర్మాచరణ అవశ్యమే! కోపం, పొంగిపోవుట, గర్వం, అసంతృప్తి, దురభిమానం ఏలాటి చెడ్డ గుణాలో నిర్వ్యాపారత కూడా అటువంటిదే అని మన పెద్దలు చెప్తున్నారు. స్వధర్మాచరణ విధించడంలోని యీ అంతరార్థాన్ని మనం గ్రహించవలసి వుంటుంది.

స్వధర్మాన్ని ఆచరించే సమయంలో ఒక వేళ మరణం సంభవించినా అది మంచిదే అని "స్వధర్మేని ధనం శేయః" అనే ఆప్తవాక్యం చెప్తున్నది. ఆముష్మికానికి తపస్సు, ధ్యానం, సమాధి నియమం మున్నగునవి అవసరం. ఐహిక జీవితానికి జీవికి కోసం ఏదో కర్మ చెయ్యడం అవసరం. వ్యాపారం, అంటే కయ విక్రయాలు చెయ్యడమనే మాత్రం అర్థంకాదు. అది కర్మలన్నిటినీతెలుపుతుంది.

తాను పని చెయ్యక ఇతరుల చేత పని చేయిస్తూ అధికారం చెలాయించే వారిపై పనివారికి గౌరవం వుండదు. తాను యజమానిని అనే అహంకారం విడిచి, తానూ తక్కినవారివలెనే – పనివాడననే భావంతో వారితో కలిసి మెలిసి పని చేసినప్పుడే అతనికి గౌరవం వుంటుంది అట్టి యజమానులు గల సంస్థలలో చిక్కులు వుండవు. పనివాళ్ళు చిత్తశుద్ధితో పని చేయగలుగుతారు. సంస్థ కార్యక్రమాలు సక్రమంగా జరిగిపోతూ వుంటాయి. కష్టపడి పనిచేసే యజమానికి పనివాళ్ల కష్టసుఖాలు బాగా అర్థమవుతాయి. అతడు వారికి కావలసిన సదుపాయాలు చేస్తాడు. గౌరవం సంపాదిస్తాడు అలసత్వం నశిస్తుంది. అందువల్ల శారీరకంగానూ, మానసికంగానూ నిరామయుడై వుండగలడు.



ఇక అక్కడికెళ్ళే అవకాశం వుంటుందా? వుండదు!

* * *

పదిరోజుల తర్వాత రమణమూర్తికి శంకరం దగ్గరకు వెళ్లాలనిపించి బయలుదేరాడు. శంకరం ఇంట్లో సామానులు సర్దుతున్నాడు. రమణమూర్తి చూసి 'వచ్చారా! మిమ్మల్ని కలవడం ఎలా అని ఆలోచిస్తూ వున్నాను. నాకు ట్రాన్స్‌ఫరు అయింది కదా. సామాను తీసుకెళుతున్నాను. ఇల్లు అమ్మేసాను. ఇతను మా ఫ్రెండు రవి. ఇతనే కొన్నాడు.' అన్నాడు, రవిని రమణమూర్తికి పరిచయం చేస్తూ.

'ప్రక్కవాటా కూడా ఖాళీ అయినట్టు వుందే!' రమణమూర్తి గమనించి అన్నాడు.

## ఇల్లు

'అవును నిన్ననే ఖాళీ అయింది' అన్నాడు రవి.

'బాబాయిగారూ, మీరు ఒక వాటలో వుండొచ్చు. మా వాడు మంచివాడులెండి. అద్దె ఎక్కువ తీసుకోడు' అన్నాడు. రవి నవ్వాడు. రమణమూర్తికి సంతోషమేసింది. అద్దె తనకు అందుబాటులో లేకపోయినా, ఒక వాటాలో వచ్చేయదల్చుకున్నాడు ఆ క్షణం.

గేటు చప్పుడయింది. ఒకతను వస్తూనే 'ఏమోయ్, ఇంకా ఖాళీ చేయించలేదా!' అన్నాడు. 'తొందర పెట్టుకు నాయనా! చేస్తున్నాం' అన్నాడు శంకరం. 'ఈయన రమణమూర్తిగారు. ఈ పక్క వాటాలోకి వస్తారు.' అని శంకరం అతనికి పరిచయం చేసాడు. 'ఇతను కూడా మా ఇద్దరికి ఫ్రెండు. ఈ వాటా ఇతను తీసుకుంటున్నాడు అద్దెకు. ఆఫీసు పెడతాడు.' అన్నాడు శంకరం.

ప్రక్కనే ఆఫీసు అనగానే, రమణమూర్తికి ఏమిటో ఇబ్బంది అనిపించింది. 'ఏం ఆఫీసు?' అడిగాడు.

'మారేజ్ బ్యూరో! ఆడపిల్లలకు సంబంధాలు చూసిపెట్టే ఆఫీసు' అన్నాడు శంకరం. రెండు క్షణాలు ఆలోచించాడు. చల్లబడిన మనసుతో రమణమూర్తి ప్రేమగా ఇంటిని పరికించాడు. 

## తొందరగా! బ్యాండ్-ఎయిడ్ బ్రాండ్ పట్టీలను వాడండి.
## అవి మీ పాపను ఎంతో బాగా కాపాడుతాయి.

### రేగిన గాయంపైన ఏ మాత్రం మట్టి పడినా దాన్లో సూక్ష్మ జీవులు చేరుకోవచ్చు.

తల్లులు, ప్రపంచమంతటా, రేగిన గాయాలపైన సూక్ష్మ జీవులు చేరకుండా నమ్మకమైన బ్యాండ్-ఎయిడ్‌తో రక్షిస్తారు.

బ్యాండ్-ఎయిడ్ పట్టీలలో, గాయాన్ని మాన్పగల, రుజువైన క్రిమి విరోధక పదార్థం వుంది గాలిని లోపలికి పోనిచ్చే సూక్ష్మ రంధ్రాల వల్ల గాయం త్వరగా మానుతుంది. మరింత సౌకర్యం యివ్వడానికోసం అద్వితీయమైన అతుక్కోని పేడ్ వుంది.

బ్యాండ్-ఎయిడ్ పట్టీలు వేర్వేరు ఆకారాల్లో, సైజుల్లో వస్తాయి. మరి పెద్ద గాయాలకీ, తెగినప్పుడూ పట్టీ కట్టడానికి యిబ్బందయ్యే చోట్లకి, సెగ్గడ్డలూ, గీసుకు రాసుకుపోయినప్పుడూ, వీటన్నిటికి పనికొచ్చేలా, వీలుగా బ్యాండ్-ఎయిడ్ పట్టీలను దగ్గర వుంచుకోండి.






## బ్యాండ్-ఎయిడ్ బ్రాండ్ పట్టీలు
**సూక్ష్మ జీవులు చేరుకోకుండా రక్షణనిచ్చే అత్యంత విశ్వసనీయమైన పట్టీలు.**

**Johnson & Johnson**



OBM/9283/TL




(గత సంచిక తరువాయి)

వారి ప్రేమ ఎంతవరకు పోయిందో తెలియదు.

ముందే జాగ్రత్తపడు — మన బంగారం మంచిది కావాలి లక్ష్మిగారు. నాకు ఈ రోజు చాలా విచారంగా ఉంది. నాకయితే, మీకున్న అందం లేదు. అంత వోర్పు లేదు. మా కృష్ణపరమాత్మకు ఎన్నో సాకులు దొరుకుతాయి. తప్పులు పట్టుతాడు. (గిరిజ భర్తను పిలిచే పేరు అదే) మీకేమి తక్కువైంది? బజారు ముండల దగ్గరికి పోవటానికి. మీరు ఎన్ని విధాల మీ శ్రీవారిని సంతోషపెట్టుతారో నాకు తెలుసు. ముని పత్నులను చూచి మోహంతో బాధపడే అగ్నిని స్వాహాదేవి, ఆయా రూపాలు ధరించి వచ్చి భర్తను సుఖపెట్టినట్లు మీరు అన్ని విధాలుగా, రోజుకో విధంగా అలంకరించుకుని ఆనందింపజేసే విధం నాకు తెలుసు. రామచంద్రుని వంటివాడు ఒక్కడైనా వున్నాడని, కలియుగం మరీపాడైపోలేదని అనుకునేదాన్ని. అసలు ఈ మగవాళ్ళకు కావలసిన దేమిటి? నేనైతే పెళ్ళాందగ్గర లేనిది దానిదగ్గిర ఏముంది? అని నిలదీసి అడుగుతాను. అందం తక్కువయిందా? చదువు లేదా? ప్రాణం ఇచ్చే దానివి, కష్టాల్లో, సుఖాల్లో పాలు పంచుకుని అతని బిడ్డకు తల్లివయినదానివి. నీకేం తక్కువయింది?'' గిరిజ స్వరంలో ఆవేశం, ఆవేదన అర్థమవుతూనే వున్నాయి... ''నా కళ్ళారా నా భర్త... మరో ఆడదానితో వుండగ చూస్తే నేనేమి చేస్తానో తెలుసా? ... లక్ష్మిగారు...'' లక్ష్మి అవతల ఫోన్ పెట్టేసినట్లు కూడ గుర్తించక చక చక మాట్లాడుతూనే ఉంది, గిరిజ.

'లక్ష్మి' ఫోన్ ఎప్పుడో పెట్టేసింది. రవిచంద్ర సాహిత్య ఒడిలో తల పెట్టుకుని పడుకున్నాడని విన్నాక లక్ష్మి మనస్సు జాగరితమైంది. హృదయం దుఃఖపూరితమై శరీరం షాక్ కొట్టినట్లు తిమ్మిరెక్కిపోయింది చీకటి తెరలు తెరలుగా వచ్చి సందెను కప్పేశాయి పున్నమి వెన్నెలలా ఉన్న తమ సంసారంలో చంద్రుడిలోని మచ్చలా సాహిత్య వస్తుందని గ్రహించలేకపోయింది. పది సంవత్సరాల నుంచి కాపురం చేస్తోంది. ఆమాత్రం గుర్తించ లేకపోయింది తను. 'పరధ్యానం, ఆమార్పు ఆఫీసులో పని, క్రొత్తప్లాటు గురించిన ఆలోచనలు బుర్రలో తిరుగుతున్నాయి' అనుకొంది. ఆలోచనలు ఎక్కువై పరధ్యానం అవుతుంది. మనస్సు పరాధీనమై లోలోన బాధపడుతోంది. 'ఆఫీసులో గొడవలువచ్చి మనసు పాడుచేసుకుంటున్నారేమో!' అనికొని 'కొన్ని రోజులు సెలవు పెట్టండి హాయిగా, విశ్రాంతిగా రెండోసారి హానిమూన్ వెళ్దాం' అంది అమాయకంగా— ''రవీ, రవీ ఇలా ఎందుకు చేశావ్, నేనేమి తక్కువ చేశాను— రవీ'' అనుకుంది. కన్నీటి బిందువులు కనుకొనల్లో చేరుకున్నాయి.

ధీరజ్ మెడమీద చేతులు వేసి వూపుతూ ''అమ్మా'' అని పిలిచేదాకా ధీరజ్ రావడం గుర్తించ లేదు లక్ష్మి. ''ఏమిటి ఇల్లు ఇంత నిశ్శబ్దంగా ఉంది — నా రైవల్ ఇంకా వచ్చినట్లు లేదే!'' అన్నాడు. మరొకసారయితే ధీరజ్‌ను ఒడిలోనికి లాక్కుని గట్టిగా ముద్దుపెట్టుకునేది. ఆరోజు మౌనంగా కొడుకు చెయ్యిపట్టుకుని లోపలికి వెళ్ళింది లక్ష్మి. రవిచంద్ర వచ్చేటప్పటికి 10గం. దాటింది కారు షెడ్‌లో పెట్టి — ఇంటివైపు చూశాడు ఎప్పుడూ తనకోసం ఎదురుచూసే లక్ష్మి కిటికీలో నుంచి కనపడలేదు. చడీ చప్పుడు లేకుండా వచ్చి— వరండాలో లైటువేసి, నవ్వుతూ ఎదురొచ్చే లక్ష్మి రాలేదు. ఈ చిన్నదానికే తనకేదో తక్కువయినట్లు అనిపించింది. మెత్తగా పరుగెత్తాడు. వరండా తలుపుదగ్గిర కాపలాగవున్న కాశి, కూర్చొనె నిద్ర పోతున్నాడు. దగ్గరకు వచ్చినా లేవలేదు. తలుపు తీసుకుని వెళ్ళాడు. హాలులో డిమ్‌గా వెలిగే లైటు కాంతిలో నేరుగా పడకగదిలోకి వెళ్ళాడు. మంచానికి చివరగా పట్టేనానుకుని పడుకునిఉన్న లక్ష్మి దగ్గరకు వెళ్ళి — భుజంపైన చెయ్యివేసి ''లక్ష్మి'' అని పిలిచాడు. మెల్లిగా తిరిగి చూచింది. ఆమె కళ్ళలో తడి చూశాననుకున్నాడు. ''పడుకున్నావేం బాగున్నావా!'' అన్నాడు.

ఆ పిలుపుకి లక్ష్మి శరీరం అంతా నీరై పోయింది. చిన్నగా నవ్వబోయింది—తనవల్ల కాలేదు. ''నలతగా ఉన్నట్లు అనిపించిందండి''... లక్ష్మి లేవబోతుంటే —''పడుకో!'' అన్నట్లుగా వారించాడు అతను వెళ్ళి బట్టలు మార్చుకుని బాత్‌రూంలోనికి వెళ్ళాక—లేచి .. కళ్ళలో నీళ్ళు రానీయకుండ కళ్ళు-ముఖాన్ని పైటచెంగుతో తుడుచుకొని — మనోగత మయిన దుఃఖం కనపడనీయకుండ తగు జాగ్రత్త తీసుకుని—వంటగదిలోనికి వెళ్ళింది. భర్తకు వడ్డించి తనకు తినాలని లేకపోయినా అన్నంలోకి ఊరగాయ పెట్టుకుని తింటున్నట్లు నటిస్తోంది. తల వంచు కున్న లక్ష్మిని చూశాడు, గుండె కలుక్కుమంది. 'లక్ష్మిని తను మోసం చేస్తున్నానేమో' అని అను కున్నాడు. లక్ష్మితలెత్తింది తనవైపే చూస్తున్న భర్త కళ్ళలోకిచూసింది. ''ఏమిటీ కొత్తగా చూస్తున్నారు? వంట్లో బాగానేఉంది. భోజనం చేయండి'' అంది తన పరాకు కప్పిపుచ్చుకుంటూ నవ్వి, తిరిగి చపాతీని తుంచాడు. ''తనిప్పుడు ఏం చేయాలి? ఎలాగూ కృష్ణలీలలు నాదాకా వచ్చాయి. — నేను విన్నది ఎంతవరకు నిజం! మీ ప్రేమ ఎంతవరకు పోయింది అని అడగాలా వద్దా!'' అనుకుంటూ రవిచంద్ర వైపు చూసింది.

అప్పుడే కూర వేసుకోబోతూ దీర్ఘంగా తనవైపు చూస్తూన్న లక్ష్మిని చూశాడు. ఇద్దరి చూపులు కలుసుకున్నాయి. లక్ష్మి కళ్ళు తనని తరచి తరచి చూస్తున్నాయి. హరిణిలాంటి ఆ నల్లని కళ్ళల్లో బాధకూడా గోచరించింది. 'నాలో ఏం తక్కువయింది రవీ! నీకేం లోపం చేశాను.' అని ప్రశ్నిస్తున్నాయి. ఆ చూపులు, కళ్ళనిండా కోరికతో 'నా ప్రేమ నీ గుండెను తాకలేదా!' అని ప్రేమగా, బరువుగా, ఆర్తిగా, చూస్తూన్న లక్ష్మి కళ్ళు తననే తట్టి అడుగుతున్నాయి. ''భగవాన్! నేనేమి చేయాలి? కళ్ళనిండా వెలుగు నింపుకుని తృప్తిగా ఉన్న లక్ష్మి 'నన్ను అందుకోవా!' అని, సాహిత్య మరొక వైపు. ఎవ్వరు కావాలి తనకు? 'ఇద్దరూ కావాలి! ఇద్దరూ కావాలి!' అని మనస్సు ఘోషిస్తోంది.'' 'లక్ష్మి అంటూ లక్ష్మి చెయ్యి పుచ్చుకుని — భోజనం ముగించుకుని లేచాడు. ఒకరిపై ఒకరు చేతులు వేసుకుని పడుకున్నారు. కళ్ళు మూసుకున్నారు. నిద్రపోతున్నారు — కాని మనస్సు కుములుతూనే ఉంది. ఆలోచిస్తూనే ఉంది.

''లక్ష్మికి సాహిత్య విషయం చెప్పాలి. ఎలా చెప్పాలి? ఏమని ప్రారంభించాలి? దాని పర్యవసానం ఏమయినాకాని, ముందు — హృదయభారం తీరిపో తుంది. ''సాహిత్య తనను ప్రేమిస్తోంది. నీవు కోరుకున్నట్లే తనూ కోరుకుంటోంది.. నాకూ యిష్టమే'' అని చెప్పాలా? రవిచంద్ర ఘర్షణ లక్ష్మికి తెలుస్తూనే ఉంది. 'రవిచంద్ర సాహిత్యను ప్రేమిస్తున్నాడు' అని తెలిసిపోయింది. ''రవిచంద్ర వ్యక్తిత్వం తనకు తెలుసు — స్త్రీని గౌరవిస్తాడు. చులకన చేయడు. ''సెక్స్ అంటే శరీరానికి సంబంధించింది కాదు — వాడుకుని, వదిలేసే వస్తువు కాదు — పదార్థం కాదు, మనస్సుకు సంబంధించినది— ఆత్మకు సంబంధించినది. ప్రేమ ఉంటేనే సెక్స్ కావాలనిపిస్తుంది.'' అంటాడు. అలాంటి భావాలున్న రవిచంద్ర కాలక్షేపానికి, సరదాకి, సెక్స్ కోసం స్నేహం చేయడు అంత దూరం...

వారిమధ్య ఏదో సీరియస్‌గానే జరిగి ఉంటుంది.

**జరిగిన కథ—9 :** రవిచంద్ర 'రచన' వార మాస పత్రికలో మేనేజింగ్ ఎడిటర్‌గా పనిచేస్తుంటాడు. అతనికి పి.ఎ. గా చేరిన సాహిత్య తన అభిమాన రచయిత రవిచంద్రను ఎంతగానో ప్రేమిస్తుంటుంది. అతనికి పెళ్లయిందనీ, ఓ కొడుక్కి తండ్రి అనీ అతని ద్వారానే తెలుసుకొని విలపించిపోతుంది సాహిత్య తను పనిచేసే పత్రిక ప్రొప్రయిటర్ గోపాల్‌రావ్ కూతురని ఆయన ద్వారానే తెలుసుకొంటాడు రవిచంద్ర. రవిచంద్రపై వున్న ప్రేమకొద్దీ తన సర్వస్వాన్ని అతనికి అర్పించడాన్కి సిద్ధపడిన సాహిత్యను చెడగొట్టడం అతనికి ఇష్టంలేదు. ఆమెకు ఎంత దూరంగా వుండాలనుకుంటున్నాడో అంతగా దగ్గరవు తుంటాడు రవిచంద్ర. రవిచంద్రకు ఓ కొడుకు వున్నాడని తెలిసిన సాహిత్యలో కోపం చెలరేగుతుంది. ఎలాగైనా అతన్ని తనవాడిగా చేసుకోవాలని నిర్ణయించుకొంటుంది. జూలాజికల్ పార్క్‌లో సాహిత్య ఒడిలో తల పెట్టుకొని పడుకొన్న రవిచంద్రను చూసిన గిరిజ ఆ విషయం ఫోన్ ద్వారా లక్ష్మికి తెలియ జేస్తుంది.



అందుకే అంత ఘర్షణ పడుతున్నాడు. రవిచంద్ర హృదయ స్పందన తనకు తెలుస్తూనే ఉంది. ఆ గుండె వేగంగా మరీ దీనంగా కొట్టుకుంటోంది తనిప్పుడు ఏం చేయాలి.'' లక్ష్మి తన ఆవేదన రవిచంద్రకు ఎక్కడ తెలుస్తుందోనని తన హృదయాన్ని నొక్కిపెట్టింది రవిచంద్ర నిద్రలోకి జారిపోయాడు. అతని ఉచ్ఛ్వాస నిశ్వాసాలు - క్రమంగా ఉన్నాయి. అటు ధీరజ్ కదిలాడు. కొడుకు వైపుకు జరిగి - దుప్పటి సరిచేస్తుంటే దగ్గరికి జరిగి లక్ష్మి కడుపులోకి దూరి పడుకున్నాడు.

స్త్రీ ఎప్పుడు ఒంటరిదికాదు, ఎప్పుడు ఎవ్వరో ఒకరు—కనిపెట్టుకుని తమస్త్రీలను కాపలాకాస్తారు. బాల్యంలో తండ్రి, యవ్వనంలో భర్త, వృద్ధాప్యంలో కొడుకు. రవిచంద్ర దూరమయినా తనకు కొడుకున్నాడు. 'ధీరజ్ తనకు ఆధారం' — అన్నట్లుగా ధీరజ్‌ను హత్తుకొని నిద్రపోవటానికి ప్రయత్నించింది లక్ష్మి. ''స్త్రీ యుగయుగాలనుంచి మగవాడి మోసాలకు బలయిపోతూ ఇంకా బ్రతికేఉంది. స్త్రీకున్న సహనమే దానికి కారణం. తనకోసం కాకపోయినా తనవారికోసం అయినా బ్రతకటానికి అలవాటు చేసుకుంటుంది. మనస్సును చంపుకుంటుంది. కోరికలు చంపుకుంటూ జీవచ్ఛవంలా జీవించటానికి తయారవుతుంది. అంతకంటె ఆమె చేసేది ఏమిలేదు.

భర్త ఆలస్యంగా వచ్చినా — ఆరోజు ఆఫీసులో లేదు — ఫ్యాక్టరీకి పోలేదు — ఫోన్‌లో అందలేదు ఇదివరకు తన కనుసన్నల్లో వున్నట్లుండె రవిచంద్ర మనస్సు బ్లాంక్ అయినట్లు ఎక్కడ ఉన్నాడు తెలిసిందికాదు అయినా తను గిరిజలా భర్తను నిలదీసి అడగటానికి సిగ్గుగా ఉండేది ''సాహిత్య దగ్గరకు వెళ్ళాను ! ఆమె నాకు కావాలి !'' అని రవిచంద్ర చెప్పినా తనకెంత అభిమానంగా ఉంటుంది. అలా తెగేసి చెప్పిన భర్తతో సంసారం చెయ్యటానికి ఏ అభిమానవతి ఒప్పుకోదు. అలా అని భర్తను వదిలేసి వెళ్ళిపోలేదు. అతనిపై ప్రేమ పాశాన్ని లాగేసుకొని — తెంపుకుని వెళ్ళిపోతే ధీరజ్ ఏమవుతాడు ?

తల్లి, తండ్రి ప్రేమ, వారి సంరక్షణ కావలసింది ఈ వయసులోనే. తండ్రి లేకుండా తను పెంచగలదా ! అతని భవిష్యత్తు ఎలా ఉంటుంది ? తండ్రి పెంపకం ఆ కొడుకుకు ఎంతో అవసరం అతని బాల్యం ఆనందంగా గడవాలంటే ఇంట్లో తగవులు, వాదాలు వుండకూడదు. అమ్మా, నాన్నా సంతోషంగా లేరనుకుంటే పిల్లలు సంతోషంగా ఉండలేరు. అందులో ధీరజ్‌కు వయస్సుకు మించిన ఆలోచనలు. తండ్రి తల్లిని అన్యాయం చేస్తున్నాడు అని ద్వేషం పెంచుకోకూడదు. తండ్రిని గౌరవించలేనివాడు ఎవ్వరిని గౌరవించలేడు. భయపడడు. తనలాంటి స్త్రీలు భర్తలు వ్యభిచారులైనా, త్రాగుబోతులైనా — జూదం, లంచం లాంటి వ్యసనాలున్నా అతని గుట్టు బయటపెట్టక గుట్టుగ ఎందరు సంసారాలు చేసుకోవడంలేదు ? అభిరుచులు, అలవాట్లు, భార్యా భర్తల మనసుల్లో అయిష్టత — అనురాగాలు లేకపోయినా లోకం కోసం కాపురాలు చేసుకుపోయేవారు ఎందరో ! అలాగే తను తెలియనట్లు నటిస్తూ కాలం గడుపుతుంది '' లక్ష్మి ఆలోచిస్తూ నిద్రలోకి జారింది

* * *

నీలాల నింగిలో దేదీప్యమానంగ వెలిగే చంద్రుడ్ని చూసి కన్ను గీటుతున్నాయి, కొంటె తారలు. విదియ విభావరిలో సభస్థలి వైభవంగా వెలిగిపోతోంది. పిల్లగాలి తెరకె ద్రాక్షగుత్తులు బరువుగ వూగుతున్నాయి. చల్లగాలి ఎక్కడెక్కడి నుంచో మోసుకువస్తున్న విరితావులను — ఆ తోటంతా నింపి వెళుతున్నది

రవిచంద్ర ఒడిలో తలపెట్టుకుని నింగికేసి చూస్తున్నది సాహిత్య. దివినుండి భువికి దిగివచ్చిన అభిసారిక తన ప్రియునికోసం నలువైపుల పోవుచున్నది. వగలు, వయ్యారాలు గాంచిన ఆ గాలి పీల్చిన ప్రేమికులకు వళ్ళంతా శృంగారమే ప్రియుని వడిలో వెచ్చదనం సాహిత్యకు వెర్రిత్తిస్తోంది. గ్రేప్ జ్యూస్ తాగినట్లు రవిచంద్ర చుంబనాలు—మత్తెక్కి

స్తున్నాయి. నిశాముఖిలో రవిచంద్ర పరిస్థితి అల్లాగే ఉంది. వడిలోవాలిన ప్రియురాలి యవ్వనం—చల్లగాలి రెచ్చగొట్టుతున్నాయి. కామాతురతను కలిగిస్తున్నాయి. ఆ క్షణం కోరికతో మరులెక్కిన కళ్ళకి సాహిత్య తలపుతప్ప మరేం కనిపించటంలేదు. ధర్మాన్ని, న్యాయాన్ని జ్ఞాపకంచేస్తూ హెచ్చరించ వలసిన మనస్సు మత్తెక్కిపోయింది.

కామానికి ఆటంబాంబుకున్న శక్తి ఉంది అది పేలనంతవరకు అణువే! పేలినతర్వాత దానిని ఆపగల శక్తి భగవంతునికి కూడా లేదేమో? ప్రకృతిని జయించగలిగిన మానవుడు కామాన్ని జయించలేక పోయాడు. అక్కడే స్త్రీ మగవాడిపై ఆధిక్యత సంపాయించింది. అక్కడే మగవాడిని తొక్కిపెట్టేసింది. ఎంత బలవంతుడు, శూరుడు, తపస్వి అయినా అక్కడికి వచ్చేటప్పటికి దిగదుడుపే! భగవంతుడు మగవాడిని అక్కడే బలహీనుడుని చేసి పొగరు అణిచాడు. విశ్వామిత్రుడికంటె గొప్పవాడా రవిచంద్ర!?అణువణువు ప్రేమనింపుకుని మరింకెంత సేపో అతని అనురాగంకోసం వేచిఉండలేదు.అభిమానం చంపుకుని తనను తాను తగ్గించుకుని తన ప్రేమను తెలియజేసింది. అతనికి పెళ్ళి అయిందని తెలిసి తన తొందరపాటుకు సిగ్గు — తను మోసపోయినందుకు కోపం, పగ కలిగాయి తర్వాత ధీరజ్‌ను చూచినప్పుడు ఎలాగైనా మనస్సుకు దెబ్బ తగిలింది. మరీ పట్టుదల పెరిగి ఎలాగైనా తన అందంతో ఆకర్షించి తన పొందుకోసం పరితపించేలా చేయాలనుకుంది. పిచ్చివాడ్నిగా చేయాలనుకుంది. కాని. . కాని తనే పిచ్చిదైపోయింది. అతను కావాలని వెర్రెత్తినట్లు ఉంది మనస్సు. మనస్సుకు కళ్ళెం వేసినా నిలవ నంటోంది. పైట తొలగింది. ఆకులోంచి వచ్చిన వెన్నెల్లో సాహిత్య కన్నులు — కోరికతో తేనెకళ్ళు నల్లగా మరీ నల్లగా కనపిస్తున్నాయి. శరీరం యవ్వనపు బిగువు వెన్నెలంత తెల్లగా 'ఆకాశంలో విదియ చంద్రులను ఒకటి కాదు రెండు చూస్తే ఎలా ఉంటుందో!' అలా ఉన్న సాహిత్య వక్షం రవిచంద్రను మైమరిపించగా — మత్తుగా ముందుకువాలి ఉద్రేకంతో, వణకుతున్న అధరాలతో బంగారు కలువమొగ్గల మొనలను అందుకున్నాడు.

సాహిత్య పంచప్రాణాలు అతనుపట్టి గుంజినట్టు నరాలు జివ్వుమన్నాయి. ఇక ఆపలేకపోయింది. అతనిపై మోహంతో — "రవీ. . రవీ. ." అంటూ లతలా మెలికలు తిరిగిపోతూ పెనవేసుకుపోయింది. తన కన్నెవయసును అతని పాదాలవద్ద ఉంచింది. ఉక్కిరిబిక్కిరై క్షణం ఊపిరి పీల్చుకుంటున్న సమయంలో మసక చీకటిలో పాలరాతి విగ్రహంలా నగ్నంగా తన చేతుల్లో ఉన్న సాహిత్యను చూశాడు అప్పుడప్పుడె విచ్చుకుంటున్న గులాబీలా బిగువుగా, బిరుసుగా, లేతగా అందంగా ఉన్న ఆ శరీరాన్ని కళ్ళు విప్పి చూశాడు. శాపానికి స్వర్గంనుంచి క్రిందపడిన దేవ కన్యలా ఉన్న సాహిత్యను చూశాడు ఆమె కన్నుల్లో కోరికకాదు—కోరికకంటె తనపై ప్రేమనుచూచాడు. ప్రేమకంటె ఆ శరీరంలో త్యాగం కాదు అర్పణ కనుపించింది

ప్రతి స్త్రీ ప్రాణంకంటె, భర్తకంటె ఎక్కువగా



చూచుకునే శీలాన్ని తనకు అర్పిస్తోంది. సాహిత్య నిగ్రహంతెలుసు. ఎవ్వరికంటె వారికి కోరికతో శరీరాన్ని ఇచ్చేది కాదు. కావాలంటె రాజకుమారుడిలాంటి వాడిని తెచ్చుకోగలదు, కాని పిచ్చిగా తనను ప్రేమించింది. ఆ ప్రేమలో చచ్చిపోవడానికి కూడా తయారయింది—అని గ్రహించి రవిచంద్ర హృదయం కన్నీరు కార్చుతూ, వేదనగా మూలుగుతూ—"సత్యా! సత్యా నా సత్యా 'మై లవ్'" అంటూ క్రిందఉన్న సాహిత్యను ఒడిలో చేర్చుకుని సాహిత్య గుండెల్లో ముఖాన్ని ఉంచి "డార్లింగ్—ఐ లవ్‌యు!ఐ లవ్‌యు" అంటూ ఏడ్చాడు.

దుఃఖం ఉపశమించాక "అందుకే నిన్ను పొందలేక పోతున్నాను. నిన్ను స్పాయిల్ చేయలేక పోతున్నాను. నీ ప్రేమముందు వోడిపోతున్నాను నీ ప్రేమను గౌరవిస్తున్నాను. అందుకే నీ అందమైన శరీరాన్ని మలినపరచలేక పోతున్నాను" చల్లని నీళ్ళు ముఖాన కొట్టినట్లు సాహిత్యకు మెలకువ వచ్చింది. అతనిని కరుచుకుపోయి "రవిచంద్రా! ఇంకా నేను పవిత్రంగా ఉన్నానని అనుకోవడం నీ భ్రమ! ఎప్పుడో నీలోకలసిపోయాను—జ్ఞాపకం తెచ్చుకో—నాలో కలలో, ఆలోచనల్లో నిండిపోయావు. నిన్ను కామించాను. ప్రేమించాను. ఆత్మలు కలసిపోయాయి. ఇక పవిత్రత ఎక్కడిది? ఎప్పుడో నీవు నా భర్తవై పోయావు. అందుకే నీ దగ్గిర నాకు సిగ్గు వేయలేదు ఇప్పటి బంధం కాదు. ఏనాటిదో ఈ అనుబంధం. ఇది లేకుంటే నీపై నాకింత వలపు ఎందుకుంటుంది? నా మనస్సు, దేహం నీవే — తీసుకో స్వంతం చేసుకో — రవీ" ఇప్పుడు సాహిత్య స్వరంలో ఉద్రేకం లేదు, కామం లేదు — ప్రశాంతమయిన సరస్సులా వుంది. ఒకరినొకరు ఆర్తిగా పెనవేసుకు పోయారు.

## ఇదీ నా దేశం!

ఏ దిక్కుల చూసినా
చీకటి గుంటలు!
ఏ డొక్కలు తడిమినా
ఆకలి మంటలు!

కదులుతున్న ప్రతి గుండెలో
రగులుతున్న పగ!
ఆరని నిప్పుల సెగ!

ప్రతి రుధిర కణంలో
ప్రతీకారవాంఛ!
ప్రసరిస్తున్న ప్రతి శ్వాసలో ద్వేషం
భవిష్యత్తుపై అంతరిస్తున్న విశ్వాసం!

ఇవి
ఇప్పుడు నా దేశానికి నిర్వచనాలు
నిప్పుల గొంతుకల్లోని
నిర్ఘోష ప్రవచనాలు!!

— గడియారం శేషఫణిశర్మ

సాహిత్య కన్నులు, నొసలు, ముక్కు, పెదాలు, గడ్డం, మెడక్రింద — మెడ వంపులలో ఒక్కొక్కటి ప్రియంగా ముద్దుపెట్టుకుంటూ — "సాహిత్యా! నిన్ను ఇలా పొందటం నేరమవుతుంది. అందుకే నిన్ను పెళ్ళి చేసుకుంటాను. నా భార్యగా నీలో లీనమైపోతాను. పవిత్రంగ నాలో కలుపుకుంటాను అందులో పాపభీతి ఉండదు. 'నీకు అన్యాయం జరిగింది' అన్న బాధ ఉండదు నన్ను పెళ్ళి చేసుకుంటావా, సత్యా! నాకు భార్య ఉంది, కొడుకున్నాడు. నన్ను భర్తగా స్వీకరించడానికి నీకు అభ్యంతరం లేదుగా" అధరాలపై అధరాలు వుంచి మెల్లిగా అన్నాడు అతని పెదాలక్రింది సాహిత్య అధరాలు చిరునవ్వుతో విచ్చుకున్నాయి.

ఆ రోజు సాహిత్య పుట్టినరోజు పండుగ. ఫ్రెండ్స్‌కి, ఆఫీసు స్టాఫ్‌కి ద్రాక్షతోటలో వున్న గెస్ట్ హౌస్‌లో టీ పార్టీ ఇచ్చింది. చీకటి పడేవేళకు అందరూ వెళ్ళిపోయారు. చివరికి వారిద్దరే మిగిలి పోయారు.

గట్టిగా ముద్దు పెట్టుకుని "సత్యా! లే . మరొక్క నిముషం నీవు నా చేతుల్లో వుంటే ఏం చేస్తానో నాకే తెలియదు. ఈ నిగ్రహం చూపటానికి నా వంట్లోవున్న శక్తి అంతా హరించుకుపోయింది ఇక నన్ను టెంప్ట్ చేయకు ప్లీజ్" అన్నాడు

'మీరజాలగలడా!' అని సత్యభామలా వ్యంగ్యంగా తల ఎగురవేసి సాహిత్య తనలో తను నవ్వుకుంది చెల్లాచెదరుగా పడిన తన దుస్తులవైపు చూసింది అవి అందుకుని సాహిత్యకు ఇచ్చి ఇవతలకు వచ్చేశాడు

సాహిత్య తయారై మేకప్‌ను సరిచేసుకుని అక్కడి పనివాళ్లకు చెప్పి వచ్చింది. ఈ లోపల కారు స్టార్ట్ చేసి వుంచాడు రవిచంద్ర సాహిత్య వచ్చి కూర్చోగానే కారును పోనిచ్చాడు అక్కడి నుండి సాహిత్య ఇంటి దగ్గరకు వచ్చేలోపల ఎప్పుడు ఎక్కడ పెళ్లి చేసుకోవాలో మాట్లాడుకున్నారు ఈ పెళ్లి సంగతి ఎవ్వరికి తెలియనివ్వకూడ దనుకున్నారు. సాధ్యమైనంత వరకు రహస్యంగా వుంచాలనుకున్నారు

ఈ పెళ్లి ఎవ్వరికి సమ్మతము కాదు, హర్షించరని తెలుసు.

"మీ పేరెంట్స్‌కి తెలిస్తే! మా డాలీని ఎత్తుకు పోయాడని పోలీసులకు రిపోర్టు యిస్తే" భయంగ అడుగుతుంటే సాహిత్య పకపక నవ్వింది ఆ నవ్వులో ఎంతో వుత్సాహం వుంది.

"ఎలాగో వచ్చేస్తాను. దీనికి లేచిపోవడం అంటారు. కదూ! మా ఫ్రెండ్ మారేజ్‌కి వెళ్తున్నానో లేకపోతే పత్రిక తరుపున ఢిల్లీకి పోతున్నాననంటాను..."

అప్పుడే అయిడియా వచ్చింది రవిచంద్రకు 'ఫిల్మోత్సవ్‌కి కలకత్తాకి నువ్వు వెళ్లకూడదా' అని యం. డి. అన్నారు. అది గుర్తుకువచ్చి "మరి కలకత్తాకి విమానంలో పారిపోదామా?" అన్నాడు.

"అక్కడ ఏ గుడిలోనో పెళ్లి చేసుకుని హనీమూన్‌కి వెళ్లిపోదాం" అంది సాహిత్య

"నీవు పత్రిక తరుపున రావటానికి వీలులేదు. రేపే లీవ్ పెట్టెయ్యి.. ఏమని చెప్తావ్!"

"ఆఫీసుకు వస్తాను...నిన్ను చూడకుండ నేను వుండలేను రవీ."

డ్రైవ్ చేస్తున్న రవిచంద్ర ఎడమచెయ్యి సాహిత్య భుజంచుట్టూ వేసి దగ్గరకు లాక్కున్నాడు. కన్నులు అరమోడ్చి రవిచంద్రవైపు చూసింది.

“అలా చూడకు, కారును వెనక్కి తిప్పాల్సి వస్తుంది.” అని తలను పట్టుకుని అక్కున చేర్చుకున్నాడు.

సాహిత్య ఇంటిముందు కారు ఆపాడు.

సాహిత్య రవిచంద్ర బుగ్గమీద ముద్దుపెట్టి “గుడ్‌నైట్ డార్లింగ్” అంటూ దిగిపోయింది. కారు వెనక్కితిప్పుకుని వెళ్ళేంతవరకు సాహిత్య గేటు ముందు నిల్చుని చెయ్యి వూపుతూనే వుంది.

* * *

సాహిత్య తల్లితండ్రులు గొప్పవాళ్ళు. ఆధునిక భావాలు కలవారు. పిల్లలు పెద్దవాళ్ళు కాగానే వాళ్ళకి వ్యక్తిత్వం; స్వాతంత్ర్యం ఇచ్చినట్లే, ఇన్‌కమ్ టాక్స్ ప్రాబ్లమ్ రాకుండా ఎవ్వరి ఆస్తులు వాళ్ళకి ఇచ్చేశారు. ఆర్థిక స్వాతంత్ర్యం ఎప్పుడు వుంటుందో వ్యక్తిగత స్వాతంత్ర్యం — ధైర్యం, స్వేచ్ఛ — నిర్భయత — వాటంతట అవే వెన్నంటి వస్తాయి.

తమని తాము దిద్దుకోగల చదువు సంస్కారం వుంది. వారి గురించి భయపడే అవసరం లేదు; అనుకునే తల్లితండ్రులు వారి స్వవిషయంలో జోక్యం చేసుకోరు.

అలాగే వాళ్ల పిల్లలందరూ పెరిగారు. ఇద్దరు కొడుకులు. ఒకరు డాక్టరు — మరొకరు ఇంజనీరు. అమెరికాలో వున్నారు. ఇంజనీరు అమెరికా అమ్మాయిని పెళ్లి చేసుకున్నాడు కూడ.

పెద్దమ్మాయి సంగీతని — మరో వ్యాపారవేత్తకు ఇచ్చి పెళ్లిచేశారు. హైదరాబాదులోనే ‘పూనమ్’ అపార్ట్‌మెంట్‌లో వుంటున్నారు.

అందరికంటె చిన్నది సాహిత్య జీవితాన్ని ఆనందంగా, సరదాగా ఒక పాటలా గడిపేస్తుంది. “ఎంత వరకు ఫ్రెండ్స్‌తో, సినిమాలతో ఎంజాయి చేస్తుందో చేయనీ చివరికి. విసుగుపుట్టినప్పుడు ‘పెళ్లి చేయండి డాడీ, మమ్మీ’ అని అడిగినప్పుడే పెళ్లి చేస్తా” అని గోపాలరావుగారు సరదాగా ఫ్రెండ్స్‌తో అంటూ వుంటారు.

కాని సాహిత్యకు ఒక స్థిరమైన అభిప్రాయం— నిలకడ — వచ్చేదాక, పిల్లచేష్టలు — తగ్గినాక — పెళ్లి చేస్తే మంచిదని — ఆ తల్లిదండ్రుల అభిప్రాయం.

రాజబాట వేసి ఇక నీవు నిర్భయంగా వెళ్లవచ్చు అని అక్కడ తెచ్చి నిలబెట్టితే ప్రక్కకు తిరిగి డొంకదారి పట్టుతుందని — వాళ్ళు కలలో కూడ తలంచలేదు.

స్త్రీ ఎప్పుడు సాధారణంగా తనకంటె అన్ని విధాల అధికుడైనవానినే భర్తగా ఎంచుకుంటుందన్న ధీమాతో “పిల్లల కిష్టమైన వారితోనే పెళ్లి జరిపిస్తాం. మా కెప్పుడూ ఏ అభ్యంతరం వుండదు. సంపూర్ణంగా అది వారి జీవిత సమస్య — పూర్తిగా దానికి బాధ్యులు వారే కనుక — ఏ లోపం వచ్చినా, వున్నా, నోరు మూసుకుని సర్దుకుపోతారు. ఒకరిమీద నేరం తోసి జీవితం నుంచి పారిపోయి రారు.” అని వారి అభిప్రాయం.

(ఇంకా వుంది)



విద్యార్థి లోకం వ్యాసరచన పోటీలో ప్రత్యేక బహుమతి రు. 150/-లు పొందిన వ్యాసం

# మా విద్యార్థిలోకం ఆశయాలు

మా విద్యార్థి లోకం ముఖ్య ఆశయం సహజంగా ఉత్తమమైన విద్య, విజ్ఞానాలను సంపాదించాలని అత్యుత్తమమైన మానవులుగా మనుగడ సాగించగలగాలని, అందుకు తగిన వ్యక్తి వికాసము మాకు లభించాలని ఉంటుంది. కానీ, వాస్తవములో యిది సాధ్యము కావాలంటే ఎన్నో సమస్యలు, ఎన్నో విధాలుగా అడ్డుపడుతున్నాయి.

మొట్టమొదటగా ఆర్థిక సమస్య. విద్య అనేది ఈ రోజున పెద్ద లాభసాటి వ్యాపారముగా మారిపోయింది. నర్సరీ క్లాసు నుండి కాలేజీ సీట్ల వరకు డొనేషన్లు అంటూ చాలా డబ్బు ఖర్చు పెట్టవలసి వస్తోంది. అందుకు తోడు ఎక్కువ ఫీజులు, అనేక పుస్తకాలు, యింకా ఎన్నో ఆడంబరపు హంగులు కలసి మధ్య తరగతి కుటుంబపు పిల్లలకు విద్య చాలా బరువైన విషయము అయిపోయింది. పోనీ ఖర్చు అయినా వాళ్ళ విద్యలో పటుత్వము ఎంత ఉందీ అంటే (నూటికి 90 మందిలో) ‘నేతి బీరకాయలో నెయ్యెంత’ అని చెప్పవచ్చును. దానికి తోడు పరీక్షా విధానములో ఒక స్థిరత్వము అంటూ ఉండుట లేదు. కావలసిన పాఠ్యగ్రంధాలు సకాలములో అందటము అనేది కలలో వార్త. అందువల్ల చదువుకునేటందుకు, పిల్లలకు తగిన శిక్షణ యిచ్చేటందుకు ఉపాధ్యాయులకు కూడా యిబ్బందిగా ఉంటుంది. యిందువల్ల కూడా విద్యార్థి చదువుపై శ్రద్ధ, ఉత్సాహము దెబ్బ తింటున్నాయి ప్రశ్నలు అవకతవకగా యివ్వటము, ఆ తర్వాత మోడరేషన్ అంటూ మార్కులు కలపటము, ఏమంత సబబైన పద్ధతి చెప్పండి? యిక ఉపాధ్యాయుల విషయానికి వస్తే ఏదో జీవనోపాధి కోసం ఈ వృత్తిలోకి వచ్చాము కదా అని పాఠాలు చెప్పకు పోవటమే కానీ, అది వాళ్ళకు అర్థమయ్యేటట్లు చెబుదాము, ఈ పుస్తకాలలోని విషయాలతో మరికొంత లోక జ్ఞానాన్ని, ఆత్మవిశ్వాసము, ఆత్మస్థైర్యము వాళ్ళకు వచ్చేటట్లు ఉద్బోధ చేద్దామని గాని ధన సంబంధము కంటే బలమైన గురు, శిష్య సంబంధాన్ని ఏర్పరచుకుందామని గాని అనుకోవటం లేదు. ఎలాగో చదువు అయింది అనిపించి, డిగ్రీలు పుచ్చుకుని బయటకు వస్తే, ఉద్యోగములు దొరికే అవకాశాలు ఉండటము లేదు. పోనీ, ఏ చిన్న పనైనా చేసుకుని స్వతంత్రముగా మన కాళ్ళపై మనము నిలబడదాము అనే మనోధైర్యాన్ని, ఈనాటి మన విద్యా విధానము గాని, సామాజిక పరిస్థితులు గానీ యివ్వలేక పోతున్నాయి. ఎక్కడైనా ఒక ఉద్యోగం ఉన్నదంటే దానికి ఎన్నో విధాల పోటీలు, లంచాలు, రికమండేషన్లు. అందువల్ల విద్యార్థి ప్రతిభకు గుర్తింపు లేకుండాపోతోంది. తల్లిదండ్రులేమో, యింత ఖర్చు పెడుతున్నాముకదా, అని వ్యక్తిగత శ్రద్ధ తీసుకోనాలని అనుకోరు. ఎలాగో డిగ్రీ వచ్చేటట్లు చూస్తే అబ్బాయిలకు బోలెడంత కట్నం చేసుకోవచ్చని పథకాలు వేస్తారు. అంతే కాని, ఆ విద్యార్థి అత్యున్నత వ్యక్తిత్వము కలిగి ఉండాలని అనుకోరు. యిక అమ్మాయిల వరకు వస్తే యింత చదువూ చదివించి, యింకా వేలకు వేలు క్రుమ్మరించి వివాహం చేయవలసి రావటం మన సమాజములోని దుస్థితి. ఈ కట్నపిశాచికి ఎంత మంది బలి అవుతున్నారో !

అయినా ఈ సమస్యల్లో ఏదీ కూడా మనము తీర్చలేనిదీ, అసాధ్యము అయినది ఏదీ లేదు కావలసినది చిత్తశుద్ధి, మంచి మనసు మాత్రమే. విద్యార్థులకు మంచి క్రమశిక్షణతో కూడిన జీవన విధానము, మంచిచెడుల విచక్షణ నేర్పటము, బాధ్యతాయుతముగా బ్రతుకుట తెలియచేయాలి. మూఢనమ్మకాలను, దురాచాలను ధైర్యముగా ఖండించగలగాలి. విద్య అనేది అందరికీ అందుబాటులో వారి వికాసానికి తోడ్పడే విధముగా ఉండాలి. ఏ మంచి మార్పైనా సామాజికముగా వచ్చినపుడే దాని విలువ తెలుస్తుంది. అలా మంచి మార్పు తేగలిగిననాడు, విద్యార్థినీ, విద్యార్థుల భావిజీవితాలు నందన వనములుగా విలసిల్లతాయనటములో సందేహము లేదు ★

## రచయిత్రి పరిచయం



“నేను విజయవాడ మేరీస్టెల్లా కాలేజీలో బి. కాం. సెకండియర్ చదువుతున్నాను. పత్రికలు చదవటం, గార్డెనింగ్, చిన్న చిన్న కథలు వ్రాయటం నా హాబీలు.

నా రచనకు ప్రోత్సాహమిచ్చినది, ఈ ఫలితానికి కారకురాలు మా అక్క (కనకదుర్గ) పరోక్షంగా ఈ ఫలితం తనదే.”

— కె. సీతామహాలక్ష్మి

# వారఫలం

**31–12–1982 శుక్రవారం మొదలు 6–1–1983 గురువారం వరకు**

**మేషం :** శ్రద్ధగా వ్యాపారం, గృహ వ్యవహారాలు జరుపుకోండి. వ్యాపారంలో నూతన మార్గాలు త్రొక్కాలనే ప్రయత్నం కొనసాగిపోతుంది. భారీ వ్యాపారమయినా, పుస్తక విక్రయ సంబంధమైనా మేలున్నది. స్త్రీలకు :— ఉద్యోగంలో, అధిక విద్యార్జనా ప్రయత్నంలో మేలు చేకూరుతుంది.

**వృషభం :** పలువిధాల లాభదాయకం. ధనాగమనానికి అవకాశం కలిగి క్రయ విక్రయాదులు నెరవేర్చికోగలుగుతారు. ముఖ్య బంధువుల నుండి సాయం లభించే అవకాశమున్నది. స్థిరాస్తి వృద్ధి నొందే మార్గాలు కనిపిస్తాయి. స్త్రీలకు :— కొందరకు నూతనోద్యోగానుకూలత గల వారం.

**మిధునం :** సమాజంలో పేరు ప్రతిష్ఠలు వృద్ధినొందగలవు. మిత్రసాయం లభించే అవకాశమున్నది. బంధువుల రాకపోకలవలన కొన్ని విషయాలు తెలిసికొంటారు. శుభవార్తా శ్రవణం, రాజకీయంగా కోరిక నెరవేరటం, కించిత్తు ధనాదాయం కూడా సమకూడగల దినాలే. స్త్రీలకు :— అనుకోకుండా ధనధాన్యాదులు, నగలు సేకరించుకొనే అవకాశం గల వారం.

**కర్కాటకం :** చాలమందికి పత్రికా ప్రకటనయందు, కొందరకు క్రయ విక్రయాల మూలంగా, కొందరకు ఆస్తిపాస్తుల మూలంగా, కొందరకు రచనా వ్యాసంగం మూలంగా ఈ వారం అభివృద్ధి కనిపింపనున్నది. స్త్రీలకు :— బంధువర్గీయుల మూలంగా సంబంధ బాంధవ్యాలకు అవకాశం, కృషిలో సత్ఫలితం లభించే మార్గమున్నది.

**సింహం :** విలాసవస్తువులు సేకరించుకొనుటకు, దూరదేశ ప్రయాణ ప్రయత్నాలు ఫలించుటకు, బంధువుల మూలంగా ఏవైనా పనులు జరుగవలెనంటే సులువుగా జరుగుటకు అవకాశమున్నది. స్త్రీలకు :— నూతన బంధు సమాగమం, నూతన వ్యవహారాలలో జోక్యానికి అవకాశం ఉంటుంది

**కన్య :** అధికారం పెరుగుతుంది, దానితో కూడ అయివోజు పెరుగుతుంది చాలామందికి నిర్మాణ కార్యక్రమంలో అవకాశం కలుగనున్నది. ప్రతిభ రాణించే అవకాశం ఏదో లభింపనున్నది స్త్రీలకు .— నాల్గు విధాలా అనుకూలత. వస్త్ర వాహనాలు సమకూర్చుకొనగలుగుటకు అవకాశం గల వారం.

**తుల :** శ్రద్ధాసక్తులతో మీ కార్యం నెరవేర్చుకోగలుగుతారు. స్థిర చరాస్తులందు అభివృద్ధి కలిగించును, బంధువర్గీయుల నుండి శుభవార్తా శ్రవణం, శత్రువర్గీయులు లొంగి యుండగలరు స్త్రీలకు :— శుభకార్యానుకూలత, బంధువుల రాక, కించిత్తు ధనాదాయం చెప్పదగిన సమయం

**వృశ్చికం :** అధికారులవలన జరుగవలసిన పనులు సుకరంగా నెరవేరటం, 'మబ్బు వదలిన సూర్యునిలాగ' వ్యాపార విషయంలో ప్రకాశించే అవకాశమున్నది. జాయింటు వ్యాపారంలో అనుకూలత, వస్త్ర వాహనాలు సమకూర్చుకొనే అవకాశముంటుంది. స్త్రీలకు :— కొందరకు విదేశ ప్రయాణ అనుకూలత సమకూడటం, వస్త్రసేకరణ కూడటం గమనిస్తారు.

**ధనుస్సు :** భూములు కొనుగోలు చేయాలనుకొనే సంకల్పం కలుగుతుందిగాని, ఏమంత మంచిపనిగాదు. ఉత్సాహపరచినట్లు నటిస్తూ కొందరు మీకు అపకారం తలపెడుతారు, గమనించండి. రాజకీయంగా కొందరకు మేలు సమకూడే వారం, ప్రయత్నించండి. స్త్రీలకు .— ఉన్నత విద్యాధికారం, ఉద్యోగంలో 'ప్రమోషన్'కు అనుకూల వారం.

**మకరం :** ఉచితంగా ఏవో కొన్ని వస్తువులు ఎలాగో సంపాదించగలుగుతారు. అప్రయత్నంగా ధనం లభించే మార్గం ఏర్పడటం గమనించగలుగుతారు. బంధు విరోధం రాకుండా, ఋణదాతల వత్తిడి కలుగకుండా చూచుకోవలసిన బాధ్యత ఎంతైనా ఉన్నది. స్త్రీలకు :— వృత్తి, ఉద్యోగాలందు పెంపు సమకూడుతుంది.

**కుంభం :** కోరిన వస్తువులు సంపాదించుకోవటం, కొదువలేకుండా డబ్బు సంపాదించుకోవటానికి ప్రయత్నించటం, ప్రజారంగంలో పేరు ప్రతిష్ఠలు సంపాదించుకొనటం, శుభకార్యాలలో పాలు పంచుకొనటం, కళారంగంలో అభివృద్ధిని సాధించటం చెప్పదగిన అంశాలు. స్త్రీలకు — ఆదాయంలో వృద్ధి, వృత్తియందభివృద్ధి చెప్పదగిన వారం.

**మీనం :** ప్రజా రంగంలో పేరు తెచ్చుకోగలుగుతారు. అప్పులు వసూలు కావటం, రాజకీయంగా మేలు చేకూరటం గమనింపదగిన అంశాలు. ఉద్యోగంలో మేలు చేకూరగల వారం. స్త్రీలకు :— నూతనోద్యోగాలకై చేసిన ప్రయత్నాలు ఫలిస్తాయి. ఇంట, శుభం జరిగే గ్రహానుకూలతగల వారం. ఏమైనా ఆరోగ్య విషయంలో శ్రద్ధవహించాలి.

— విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి

# ఎన్నికలొస్తున్నయి..



రేపున మీటింగు జరిగే ప్రాంతంలో కోడిగుడ్లు, కూరగాయల అమ్మకం నిషేధించండి!
తనని గెలిపిస్తే ఈసారి తప్పకుండా ధరలు తగ్గిస్తానని మంత్రిగారు ప్రమాణం చేసి చెప్తున్నారు!
ఆంధ్రపత్రిక
A. PRASAD




అపోజిషన్‌లో చేరింది వాళ్ళ సిద్ధాంతాలు నచ్చికాదు.. అదిగో ఆ పిల్ల ఆ పార్టీలో ఉందని తెలిసి...
పార్టీ కార్యాల
మన పార్టీ తరఫున జయమాలిన్ని ఎన్నికల ప్రచారానికి తీసికెళ్ళండి జనం విరగబడి వస్తారు!




గట్టిగా మేకప్ కొట్టుకుని వెళ్తేగానీ జనం మీటింగులకి వచ్చేట్టులేరు. మేకప్ మాన్‌ని పిలవ్వయ్యో!!




నాకు వ్యతిరేకంగా నువ్వు పోటీ చెయ్యి... ఇద్దరిలో ఎవరు గెలిచినా పదవి తధ్యం..

పెద్దకథ:

# ఇది సంధ్యాసమయం

— నందం రామారావు

(గత సంచిక తరువాయి)

లంచవర్లో కళ్యాణి అడిగింది :

"సుజాతా! ఏవిటే విశేషం ? కొత్త పెళ్ళి కూతుర్లా వున్నావ్ ?"

సుజాత, కళ్యాణివేపు చూసింది.

కళ్యాణికి తను ఇంతవరకూ శ్రీనివాస్ విషయం చెప్పలేదు! ఇప్పుడిప్పుడే చెప్పాలనిలేదు. శ్రీనివాస్‌తో తన పెళ్ళి కుదిరింతర్వాత ఒకేసారి శుభలేఖ అందించి కళ్యాణిని ఆశ్చర్యంలో ముంచాలి.

"ఏంలేదే. బీరువా తియ్యగానే ఈ చీర కన్పించింది. కట్టాలనుకున్నాను. కట్టాను. అంతే. అంతకుమించి విశేషం ఏంలేదు."

"సుజా! ఈ చీరలో ఎంత ముద్దొస్తున్నావో తెలుసా ? ఈ రోజు అందరి కళ్ళూ నీమీదే వున్నాయి. ఇక కుమార్ ఐతే..." కళ్యాణి మాట పూర్తికాకుండానే సుజాత అందుకుని —

"కళ్యాణీ! వాడి పేరు ఎత్తొద్దని చెప్పానా ? వాడూ, వాడి మాటలూ చూస్తుంటే కంపరం పుట్టుకొస్తుంది. వుద్యోగం చేస్తున్న ఆడపిల్లలంటే అందరికీ చులకనే. తమకేదో అధికారం వున్నట్టు ప్రవర్తిస్తారు" అంది సుజాత.

"అంతేకాదు సుజా! ఆడపిల్ల చేసే ప్రతి పనినీ వెయ్యి కళ్ళతో చూస్తుంటారు. ఇక వుద్యోగం చేసే ఆడపిల్ల వుందంటే ఆ పిల్లకి శీలం లేదన్న మాటే. ఎవరిదాకో ఎందుకు? మా వీధిలోని ఆడవాళ్ళందరూ కలిసి 'శీలం లేని పిల్ల'ని నాకేనాడో బిరుదిచ్చారు."

"కళ్యాణీ! మనలాటివారి కెప్పుడూ ఇటువంటి గొడవలు తప్పవనుకుంటాను. అవునూ! నిన్న శెలవు పెట్టావెందుకు ?"

ఆ మాటతో కళ్యాణి ముఖంలో నీలినీడలు వ్యాపించాయి!

"మరేంలేదు. నిన్న మా అక్క దగ్గర్నుంచి వుత్తరం వచ్చింది." అంది కళ్యాణి తలొంచుకుని టేబుల్‌మీద గోరుతో గీతలు గీస్తూ.

"మీ అక్క దగ్గర్నుంచా ?"

"అంటే, డైరెక్ట్‌గా అక్క దగ్గర్నుంచి కాదనుకో. నీకు తెలుసుగా మా అక్క సంసారం గురించి. ఇదివరకోసారి నాన్నగారు అక్కడి కెళ్ళినప్పుడు, మా అక్క ఇంటి ప్రక్కనున్నవారితో పరిచయం చేసుకుని, అక్కని గురించి ఎప్పటికప్పుడు తెలియజేయమని వారిని కోరారు. అందుకు వారు అంగీకరించారు. ఇప్పుడు ఆ ఇంటిప్రక్క ఆవిడే వుత్తరం వ్రాసింది."

"ఏమని ?"

"అక్కయ్య గర్భవతని. చాలా వీక్‌గా వుందని."

"అసలీ గొడవలన్నీ మీకు పెళ్ళితో వచ్చాయా?"

"అవునే. నాన్నగారు ఎంతో కష్టంమీద ఐదువేలు కట్నం ఇచ్చారు. పెళ్ళిలో బావ స్కూటర్ కావాలన్నాడు. కాకపోతే స్కూటరు కొనుక్కోవ డానికి నాలుగువేలు యిమ్మన్నాడు. అప్పటికే నిండా అప్పుల్లో మునిగిన నాన్న అప్పటికప్పుడు నాలుగువేలు ఎక్కడనుంచి తెస్తారు! రెండు నెలల్లో ఆ డబ్బు ఇస్తామన్నారు. అప్పటికి పెళ్ళయిందె. అక్కయ్య

కాపరానికిక్కూడా వెళ్ళింది. రెండునెలలు గడిచాయి. నాన్నగారు స్కూటర్‌కి డబ్బు ఇవ్వలేకపోయారు. అప్పటినుంచే అక్కయ్యకు కష్టాలు ప్రారంభ మయ్యాయి. అత్తగారూ, భర్త కలిసి అక్కయ్యని రాచి రంపానపెట్టసాగారు. డబ్బు ఇవ్వందే మమ్మల్ని ఆ గడప తొక్కొద్దన్నారు. అక్కయ్యని పంపడం మానేశారు. అక్కయ్య మాకు వుత్తరం రాసినా వూరుకునేవారుకాదు. ఈ గొడవల్లోనే అక్కయ్య ఆడపిల్లని కన్నది. అది చూసి వాళ్ళు మరీ రెచ్చి పోయి, మగపిల్లవాడిని కనలేదని అక్కయ్యను మరీ హింసంచడం మొదలుపెట్టారు. అక్కయ్యని పరీక్షించిన డాక్టర్ —'అక్కయ్య చాలా బలహీనంగా వుందనీ, ఈసారి గర్భవతి అయితే చాలా ప్రమాద మనీ, పిల్లలు పుట్టకుండా ఆపరేషన్ చేస్తానని' చెప్పింది. కానీ, బావగారు వినలేదు. తనకు కొడుకు కావాలని పట్టుబట్టాడు. అక్కయ్య మళ్ళీ గర్భవతని నిన్న వుత్తరం వచ్చింది. అప్పటినుంచీ అక్కయ్యకు ఏమౌతుందోనని నాకు చాలాభయంగా వుంది.''

కళ్యాణి విచారంగా, చెప్తుంటే సుజాత అదోలా ఐపోయింది. తలెత్తి కళ్యాణికేసి చూసింది. కళ్యాణి కళ్ళల్లో నీళ్ళు తిరుగుతున్నాయి. ఆ కన్నీళ్ళు ఏ క్షణంలోనైనా శాపంగా పరిణమించేట్లుగావున్నాయి!

సుజాతకి కళ్యాణిని ఎలా ఓదార్చాలో తెలియక—

''విచారించకు కళ్యాణి'' అంది.

''విచారించీ ప్రయోజనం లేదని తెలుసుగా సుజా. కానీ, ఏం చెయ్యనే.''

''కళ్యాణి! ఈ దేశంలో ఆడపిల్ల జీవితం ఎంత అధ్వాన్నంగా తయారయిందే.''

''స్త్రీలు అభివృద్ధి సాధించారు. అందరూ ముందుకొస్తున్నారు అన్ని రంగాల్లోనూ రాణిస్తు న్నారూ అంటున్నారు. కానీ, అదంతా వట్టిదే. ఎవరో ఒక ఆడది మంత్రిణి అయినంతమాత్రాన, ఒకఆడది డాక్టరు అయినంతమాత్రాన స్త్రీలందరూ అభివృద్ధి సాధించినట్లేనా! ఒక్కొక్క ఇంటికెళ్ళి, అక్కడ ఆడవాళ్ళు ఎలా బ్రతుకుతున్నారో చూసి మాట్లాడాలి. మురికిగుంటల్లోని పురుగుల్లా ఎంత హీనంగా బ్రతుకుతున్నారో చూసి అప్పుడు చెప్పాలి. సుజా! అంతవరకూ ఎందుకూ మన విషయమే తీసుకో. మనం ఉద్యోగం చేస్తున్నాం కాబట్టి అందరూ మనల్ని గురించి గొప్పగా చెప్పకో వచ్చు. కానీ మనం ఎన్ని అవమానాలను ఎదుర్కొంటూ, ఎన్ని అవహేళనలను తట్టుకుంటు న్నామో ఎవరికి తెలుసు!! ఆవేశంగా అంటున్న కళ్యాణి చేతిని తన చేతులోకి తీసుకుని —

''కళ్యాణి! ఎందుకే మనకిన్ని కష్టాలు?'' బేలగా అడిగింది సుజాత.

సుజాత అలా చిన్నపిల్లలా అడుగుతుంటే కళ్యాణికి అంతబాధలోనూ నవ్వొచ్చింది.

''ఎందుకేవిటే పిచ్చిపిల్లా. మనుష్యుల పైరూపాల్లో వచ్చినంత మార్పు వారి మనసుల్లో రాకపోవడంవల్ల.''

''మరి మన జీవితాలిక ఇంతేనంటావా?''

''ఆ. వాళ్ళ మనసుల్లో మార్పు రానంత వరకూ మనకీ కష్టాలు తప్పవు.'' అని వాచీ చూసుకుని — ''బాప్‌రే. టైమయింది. పద. పద'' అంటూ లేచింది కళ్యాణి.

కళ్యాణితోపాటు సుజాతకూడా లేచింది.

*       *       *

రోజులు గడుస్తున్నాయి.

శ్రీనివాస్‌ని చూడాలనే ఆరాటం రోజు రోజుకీ ఎక్కువ కాసాగింది సుజాతకి. ఈ ఆరాటంలో బ్యాంక్‌లో పనికూడా సరిగ్గా చేయలేకపోతోంది!

ఓ రోజు సుజాత ఇంటికొచ్చేసరికి, ఇంటి ముందు డాక్టర్‌గారి కారు ఆగివుంది.

ఆ కారుని చూడగానే సుజాత గబగబా నడిచి కారు దగ్గరకొచ్చింది. డ్రైవర్ కనిపించాడు.

''వచ్చింది కామేశ్వరరావుగారా?'' అనడిగింది సుజాత.

''కాదమ్మా. శ్రీనివాస్‌బాబుగారు!'' అన్నాడు డ్రైవర్.

సుజాత మనస్సు ఝల్లుమంది.

శ్రీనివాస్!

అబ్బా! ఎన్నాళ్ళకి అతన్ని చూడబోతోంది వుషారుగా అడుగులు వేసుకుంటూ లోపలకొచ్చింది

హాల్లో ఎవరూ కనిపించలేదు!

వంటింటి గుమ్మం దగ్గరకొచ్చి నిలబడ్డ సుజాతకు — దొడ్లో కనిపించిన దృశ్యాన్ని చూడగానే తల తిరిగినంత పనయింది!

జయ శ్రీనివాస్ చేతులమీద నీళ్ళు పోస్తోంది. శ్రీనివాస్, జయ ముఖంలోకి చూస్తూ నవ్వు తున్నాడు. జయకూడా తలొంచుకుని చిన్నగ నవ్వుతోంది!

సుజాత తెల్లబోయింది. తను చూసేది కలా నిజమా?

తలెత్తి మళ్ళీ చూసింది.

అవును! శ్రీనివాస్ నవ్వుతున్నాడు.

జయ కూడా నవ్వుతోంది!

సుజాత అక్కడ నిలబడలేక తన గదిలోకొచ్చి మంచంమీద పడుకుని కళ్ళు మూసుకుంది!

హాల్లోనుంచి శ్రీనివాస్ మాటలు వినిపిస్తు న్నాయి.

సుజాతకి మనస్సు, శరీరం స్తంభించిపోయి నట్లనిపించింది. మాటిమాటికీ ఆ దృశ్యమే కళ్ళ ముందు మెదులుతోంది!

శ్రీనివాస్ అక్కయ్య ముఖంలోకి చూసి నవ్వు తున్నాడు. అక్కయ్య కూడా నవ్వుతోంది. వుహు, అంతేకాదు, సిగ్గుపడుతోంది. శ్రీనివాస్ నవ్వు కూడా మామూలుగా లేదు. ఆ నవ్వులో కొంటెతనం కనిపిస్తోంది!

శ్రీనివాస్ ఏమన్నాడో?

అక్కయ్య ఎందుకలా సిగ్గుపడుతోందో!

వాళ్ళిద్దరూ ఏం మాట్లాడుకుని వుంటారు?

వాళ్ళిద్దరిమధ్యా అంత చనువు ఎలా ఏర్పడింది?

శ్రీనివాస్ రోజూ వస్తున్నాడా?

ఆయనొచ్చే సమయంలో అక్కయ్య ఒక్కతే ఇంటి దగ్గర వుంటుంది. పిల్లలు బడికెడతారు. తనేమో బ్యాంక్ కెడుతుంది. ఎవరూలేని ఆ సమయం లోనే వారిద్దరికీ బాగా పరిచయం ఏర్పడి వుంటుంది!

ఆలోచనలతో సుజాత బుర్ర వేడెక్కిపోతోంది.

'శ్రీనివాస్ ఏదో సరదాగా మాట్లాడాడేమో'నని ఎంత సరిపెట్టుకుందామని చూసినా మనసు స్థిమిత పడడంలేదు! దుఃఖమో, కోపమో తెలియని భావం మనస్సుని నలిపేస్తోంది.

కళ్ళు మూసుకుని పడుకుంది.

''గీతా! సుజాతక్క ఇంకా రాలేదా?'' అడిగింది జయ.

''వచ్చిందక్కా. ఆ గదిలో పడుకుంది.''

''అలాగా. నేను చూడనేలేదే'' అంటూ గబగబా గదిలోకొచ్చి సుజాత దగ్గరకెళ్ళి —



## ఇది సంధ్యా సమయం

''సుజా ! అలా పడుకున్నావే. ఎంతసేపయింది ఏవొచ్చి '' అంటూ సుజాతమీద చేయి వేసింది.

సుజాత మాట్లాడలేదు.

జయ ఎంత బ్రతిమలాడినా సుజాత ఆ రాత్రి భోజనమే చెయ్యలేదు !

సుజాత విచారానికి కారణం తెలియక జయ మనస్సు విలవిల్లాడిపోయింది.

బహుశా, బ్యాంక్‌లో ఏదైనా గొడవ జరిగిందేమో. అటువంటిదేదైనా జరిగితే తనకు చెప్పొచ్చు గదా ! అని మథనపడసాగింది జయ !

* * *

సుజాత ఆ మర్నాడుకూడా ముభావంగానే వుంది. త్వరత్వరగా తయారయి ఇంట్లోంచి బయట పడింది. ఆ రోజు బస్సు త్వరగానే దొరికింది. బస్సులో కూర్చున్నాక నిన్నటి విషయం మళ్ళీ జ్ఞాపకం వచ్చింది !

కానీ, ఇప్పుడు రాత్రంత బాధగా లేదు !

తను పొరబాటుగా వూహించిందేమో ?

అందరిలా తనూ ఆలోచించింది.

ఒక ఆడా మగా మాట్లాడుకుంటే వాళ్ళిద్దరి మధ్యా ఏదో వున్నట్టుగానే వూహించి బాధపడింది.

'శ్రీనివాస్ తన కుటుంబంలోని అందరితోనూ కలుపుగోలుతనంగా వుంటాడు. అంత మాత్రాన అనుమానించడమేనా? ఛ ! తన చదువు, సంస్కారం ఏమయిపోయాయి ? తనెంతపొరబాటు చేసింది. పాపం ! అక్కయ్య రాత్రి తన ధోరణి చూసి ఎంత బాధపడిందో. సాయంత్రం ఇంటికెళ్ళగానే అక్కయ్యని క్షమాపణ అడగాలి.'

ఈ ఆలోచనలతో సుజాత మనస్సు చాలా తేలికయింది. తన భుజాలమీద నుంచి ఒక పెద్ద బరువును దింపినట్టుగా ఫీలయింది !

ఆ సాయంత్రం బ్యాంక్‌లో పనిపూర్తికాగానే అక్కయ్యకి పువ్వులు, పిల్లలకు స్వీట్స్ తీసుకొని ఇంటికొచ్చింది. గుమ్మంలో అడుగుపెట్టగానే కనిపించిన దృశ్యాన్ని చూసి సుజాత స్తంభించి పోయింది !

ఏ విషయాన్నైతే తేలిగ్గా తీసుకుని మరచి పోవడానికి ప్రయత్నించి, సంతోషంగా ఇంటి కొచ్చిందో మళ్ళా అదే సంఘటన చూస్తోంది !

హాల్లో జయా, శ్రీనివాస్ ప్రక్క ప్రక్కనే కూర్చున్నారు. శ్రీనివాస్ ఏదో అంటున్నాడు. జయ పకపకా నవ్వుతోంది.

అది చూడగానే సుజాత మనస్సు భగ్గుమంది సిగ్గులేకుండా ఎలా నవ్వుతున్నారో. రోగిష్టిదాన్ని ఒకమూల పడేసి హాయిగా ప్రేమకలాపాలు సాగిస్తున్నారు !

వెనక్కి తిరిగి వెళ్ళిపోవాలనుకుంది సుజాత. కానీ, ఇంతలో జయ — ''సుజా! అక్కడే ఆగి పోయావేమిటే ? రా'' అంది కుర్చీలోంచి లేస్తూ.

సుజాత తప్పనిసరిగా లోపలకు అడుగుపెట్టింది.

''ఏమండీ ! బావున్నారా ?'' శ్రీనివాస్ పలుకరించాడు.

సుజాత తలెత్తి శ్రీనివాస్ కేసి చూడాలను కుంది. ఆ చూడడంలో తన ముఖం ఎలా వుంటుందో తనకు తెలుసు. అందుకే తలొంచుకుని—

''వూ'' అని లోపలకు వెళ్ళిపోయింది.

''వస్తానండి'' అని చెప్పి శ్రీనివాస్ వెళ్ళి పోయాడు.

జయ వంటింట్లోకెళ్ళింది

ఐదు నిముషాలు గడిచాక సుజాత లేచి కాఫీ త్రాగుదామని వంటింట్లోకొచ్చి, ఫ్లాస్కులోని కాఫీని గ్లాసులోకి వంపుకోబోతుండగా —

''సుజాతా ! ముందీ టిఫిన్ తినవే'' అంటూ జయ ప్లేటులో బజ్జీలు పెట్టసాగింది ప్లేటులో పెడుతూనే —

''డాక్టర్‌గారికి టిఫిన్ పెడదాంగదాని చేశాను ప్స ! తీరా, ఆయన వచ్చాక పెట్టడమే మర్చి పోయాను.'' స్వగతంగా అనుకోసాగింది

ఆ మాట వినగానే సుజాత ఒళ్ళు మండి పోయింది బజ్జీల ప్లేటు తీసుకోబోయేదల్లా చెయ్యి వెనక్కుతీసుకుని కాఫీ కూడా త్రాగకుండా అక్కడ నుంచి వెళ్ళిపోవాలనుకుంది. కానీ, తల బ్రద్దలవు తోంది. కాఫీ త్రాగక తప్పదు అందుకనే కాఫీ గ్లాసు తీసుకుంది

''అదేవిటే ? టిఫిన్ తినవా ?''

''అక్కర్లేదు. ఎవరికోసం చేశావో వారికే పెట్టు'' అని విసురుగా అక్కడనుంచి వెళ్ళిపోయింది సుజాత.

సుజాత ప్రవర్తన అర్థంగాక జయ తెల్లబోయింది. ఎందుకంత కోపంగా వుంది ?

నిన్నకూడా అలాగే వుంది ?

బ్యాంక్‌లో ఏదైనా గొడవ జరిగిందేమోనని సరిపెట్టుకుంది.

కానీ, ఈ రోజుకూడా అలాగే కోపంగా వుంది

ఏం జరిగింది ?

ఏదో జరిగివుంటుంది !

ఏ చిన్న విషయం జరిగినా సుజాత తనకు చెబుతుంది. మరి, ఈసారెందుకు చెప్పలేదు ?




ఎంత ఆలోచించినా సుజాత ప్రవర్తనకి కారణం తెలియక జయ తల్లడిల్లిపోయింది!

* * *

''మేడమ్! దయచేసి మరేమనుకోక ఈ చెక్ కొంచెం క్యాష్ చేసిపెడతారా?''

కళ్యాణి తలెత్తి చూసింది. ఎదురుగా ముప్పై ఏళ్ళ యువకుడు సాదా బట్టల్లో స్మార్ట్‌గా వున్నాడు. చాలా సేపటినుంచీ నిలబడేవున్నాడు.

కళ్యాణి మాట్లాడకపోవడం చూసి, ''అర్జెంటుగా ట్రెయిన్ కెళ్ళాలండి అందుకని అడిగాను. మిమ్మల్ని డిస్టర్బ్ చేసినట్లున్నాను సారీ'' అని అవతలకు వెళ్ళబోయాడు.

కళ్యాణి సీటులోంచి లేచి — ''అబ్బే! లేదండీ ఇటివ్వండి మీ చెక్'' అని తీసుకుంది

క్యాష్ కౌంటర్ దగ్గర విపరీతమైన రష్‌గా వుంది. క్యాషియర్ రంగనాధం తెలిసినవాడవడం వలన, ఐదు నిముషాల్లో పనిచేయించి, డబ్బు తీసుకొచ్చి అతనికిచ్చింది కళ్యాణి ఆ వ్యక్తి ఎంతో సంతోషపడి — ''మెనీ. మెనీ థాంక్సండి'' అని చెప్పి వెళ్ళిపోయాడు.

కళ్యాణి సీట్లోకెళ్ళి పని చేసుకోబోతుంటే, పోస్ట్‌మాన్‌వచ్చి కళ్యాణికి లెటర్ ఇచ్చి వెళ్ళాడు

కళ్యాణి ఆ లెటర్ విప్పి చూసింది.

అది పార్వతి వ్రాసింది.

'మీ అక్కయ్యకు వంట్లో బావుండలేదు. ఐనా, మీ బావ, అత్తగారూ మీ అక్కయ్యను సాధించడం మానలేదు. లోగడ మీకో ఉత్తరం వ్రాశాను. వీలైనంత త్వరలో వచ్చి ఆవిడను ఈ నరకం నుంచి తప్పించండి. ఆవిడ బాధ మేము చూడలేకుండా వున్నాం.'

పార్వతి.

ఆ ఉత్తరం చదవగానే కళ్యాణి గుండెల్లో విచారం గూడు కట్టుకుంది. ముఖాన్ని కర్చీఫ్‌తో తుడుచుకుని ఉత్తరం మడచి బ్యాగ్‌లో పెట్టుకుంది.

'ఆవిడను ఈ నరకంనుంచి తప్పించండి.'

'ఏం చెయ్యాలి?'

ఏం చెయ్యాలన్నా ప్రస్తుతం డబ్బు కావాలి.

డబ్బు సంపాదించాలంటే ఇక ఒకే ఒక్క మార్గం వుంది.

ఆనాడు అమ్మ కోసం డబ్బు సంపాదించిన మార్గమే!

''కళ్యాణి! ఇంకా అలా కూర్చున్నావేమే. లంచ్ టైమయింది.'' సుజాత మాటతో వులిక్కిపడింది కళ్యాణి. పుస్తకాలు సర్ది సుజాత వెంట వెళ్ళింది.

ఇద్దరూ రూమ్‌లో కూర్చున్నారు.

''అదేవిటే అలా వున్నావ్?'' అనడిగింది సుజాత టిఫిన్‌బాక్స్ ఓపెన్‌చేస్తూ.

''పార్వతి వుత్తరం వ్రాసింది.''

''పార్వతా! ఏమని వ్రాసింది?''

కళ్యాణి బ్యాగ్‌లోంచి వుత్తరం తీసిచ్చింది.

సుజాత ఆ వుత్తరాన్ని తీసుకుని చదివి —

''ఇప్పుడేం చేస్తావ్ కళ్యాణి?'' అని అడిగింది

''ముందు డబ్బు తీసుకెళ్ళి వాడి ముఖాన, అదే మా బావనేవాడి ముఖాన కొడతాను అక్కయ్య కోసమని అతికష్టంమీద ఐదొందలు దాయగలిగాను''

''ఆ డబ్బు సరిపోతుందా?''

''చాలదు.''

''మరేం చేస్తావ్?''

''మా అమ్మ కోసం డబ్బు సంపాదించిన మార్గమే'' రెండు చేతుల మధ్యా ముఖం ఆన్చుకుని అంది కళ్యాణి.

సుజాత అదరిపడి — ''కళ్యాణి!'' అంది

కళ్యాణి తలెత్తి, నవ్వేలేక నవ్వి — ''అవునే! అంతకంటే వుపాయం లేదు'' అంది.

''కళ్యాణి! నీకేవన్నా మతిపోయిందా? వాటి వలన నువ్వెంత అల్లరి పడ్డావో అప్పుడే మరచిపోయావా?''

''సుజా! ఎలాగూ అల్లరి పడ్డానుగదా ఇప్పుడింక క్రొత్తగావచ్చే అప్రదిష్ట ఏముంటుంది? కనీసం ఈ రకంగానైనా అక్కయ్య జీవితం బాగుపడుతుంది సుజాతా! జీవితంలో అన్ని విధాలా ఓడిపోయిన ఆడపిల్లనే నా కంటూ ఇప్పుడు ఏ కోరికాలేదు ఈ కుటుంబం కోసం ఎన్నిరకాలుగా అప్పు చెయ్యాలో, ఎన్నిరకాలుగా 'లోన్లు' పెట్టాలో పెట్టి డబ్బు తీసుకున్నాను ఐనా, సమస్యలు తీరలేదు. తీరవుకూడానూ తీరుతాయనే ఆశతో బ్రతుకుతున్నాను ఆ ఆశే లేకపోతే..'' కళ్యాణి ఆ పైన మాట్లాడలేకపోయింది కంఠం దుఃఖంతో పూడుకుపోయి మాట పెగల్లేదు

''కళ్యాణి!'' అంది సుజాత

కళ్యాణి నవ్వి - ''సుజా! మన రాతలు బావుండలేదని కష్టాలు రాకుండా మానవు కదా? ఇవన్నీ ఎందుగ్గానీ ముందు టిఫిన్ చేద్దాం'' అంటూ బాక్స్ తీసింది.

సుజాతకు టిఫిన్ సహించలేదు తన జీవితం, కళ్యాణి జీవితం ఒక్కలానే వుంది!

తన మనస్సులో బాధను కళ్యాణికి చెప్పుకోవాలనిపించింది ఇప్పుడు చెప్పి కళ్యాణికి ఇప్పుడున్న కష్టాలకు తోడు మరికొంత బాధని కలిగించడమే అవుతుంది!

సుజాత మనస్సులో శ్రీనివాస్ మెదిలాడు. అతడిపైన తను పెంచుకున్న ఆశలు, కోర్కెలూ జ్ఞాపకం వచ్చి గుండెల్లో ఆవేదన బయలుదేరింది

'శ్రీనివాస్! నా దగ్గరకొచ్చినట్లే వచ్చి ఎందుకలా దూరంగా వెళ్ళిపోయావ్? నిన్ను ప్రేమించి ఆరాధించినందుకా నాకీ శిక్ష? నాకన్నా అక్కయ్యలో నిన్ను ఆకర్షించింది ఏవిటి?'

''సుజాతా! అతిగా ఆలోచించడం ఆరోగ్యానికి మంచిదికాదు పద వెడదాం'' అంది కళ్యాణి

సుజాత లేచింది.

## ఎలక్ట్రానిక్ చెవి!

బధిరత్వాన్ని తొలగించేందుకు పశ్చిమ జర్మనీ డాక్టర్లు క్రొత్తరకం ఆపరేషను చికిత్సను రూపొందించారు ఈ చికిత్సలో మధ్య చెవిలో ఎలక్ట్రోడులను అమర్చి, శబ్దాన్ని మెదడుకు తీసుకునిపోయే నరాలతో కలుపుతారు. ఒక మైక్రోఫోను ఈ ఎలక్ట్రోడులకు శబ్ద తరంగాలను ప్రసారం చేస్తుంటాయి. ఈ చికిత్సలో లోపలి చెవిని తెరవడం జరగదు. ఆపరేషన్ల తర్వాత చెవిటివారు వాతావరణంలో ఏర్పడే శబ్దాలను సులభంగా వినగలరు. పెదవుల కదలికను గుర్తించడం ద్వారా సంభాషణల్లో 95 శాతాన్ని అర్థం చేసుకోగలరు. అయితే దీని కోసం కొంత శిక్షణ ఇవ్వవలసి ఉంటుంది పశ్చిమ జర్మనీలో పదివేల మంది చెవిటివారున్నారు. ఈ ఎలక్ట్రానిక్ పరికరాల తయారీలో జరిగే జాప్యం వలన నెలకొకరికి మాత్రమే ఆపరేషను చేయడానికి వీలవుతుంది.

ఇద్దరూ బయటకొచ్చారు.

సుజాతకి అసహనం రోజురోజుకీ పెరిగిపో సాగింది.

మనుషులందరూ స్వార్థపరులే.

అందరూ వంచకులే.

ప్రేమాభిమానాలూ, మమతానురాగాలు లేవు!

ఈ మనుష్యులందర్నీ వదలి ఎక్కడికైనా దూరంగా వెళ్ళిపోవాలి.

అందరిమీదా ఏదో కసి, ద్వేషం. కనిపించిన వాళ్ళనల్లా హత్య చెయ్యాలన్నంత ఆవేశం.

ఎవరన్నా నవ్వుతూ, వుత్సాహంగా వుంటే భరించలేని ఆవేదన!

జయ, గీత, రవి, సుజాత కోపానికి తరచుగా గురవుతున్నారు.

ముఖ్యంగా జయ 'నీడే' భరించలేకుండావుంది సుజాత!

జయ అక్కకాదు

తన సౌభాగ్యాన్ని, ఆనందాన్ని దోచుకున్న రాక్షసి.

శ్రీనివాస్ తనవేపు కన్నెత్తికూడా చూడడం లేదు. అక్క అతన్ని మాయచేసి బుట్టలోవేసుకుంది.

అక్కయ్య నవ్వుతుంటే అసహ్యమేస్తోంది. ఆ నవ్వు చూసి తను సహించలేకపోతోంది.

అక్కయ్య నవ్వకూడదు.

ఎప్పుడూ ఏడుస్తూనే వుండాలి.

అప్పుడే తన మనస్సు శాంతిస్తుంది!

అందుకే — జయని సాధ్యమైనంతవరకూ హింసించడం మొదలుపెట్టింది సుజాత.

అన్నం కాస్త బిరుసయితే చాలు — "ఇలా మేకుల్లా వండితే తినాలనా, చావాలనా! కష్టపడి సంపాదిస్తున్నా కడుపునిండా తినే యోగ్యతలేదు" అంటూ కంచంలో చెయ్యి కడిగేసేది.

మరోసారి —

"అలసి అలసి వస్తాను గదా. నీళ్ళలాటి కాఫీ మొహాన్మిద పొయ్యకపోతే ఏదైనా టిఫిన్ చెయ్య కూడదా? ఛీ! ఛీ! వెధవకొంప" అంటూ విసుక్కునేది.

రవి పరీక్ష ఫీజు అడిగాడని ఓరోజు వాడ్ని బాదేసింది.

"మిమ్మల్నందర్నీ పోషించాల్సిన అవసరం నాకేంలేదురా ఒక్క సుఖం లేదు. ఆనందం లేదు. జీవితమంతా మీకు సంపాదించి పెట్టడమే సరిపోతోంది" అంటూ అరిచింది.

ఓ రోజు మధ్యాహ్నం కమలమ్మ అడిగింది — "ప్రొద్దున్న ఏమిటే ఆ గోల" అని.

ఇంట్లో జరిగే గొడవలు తల్లికి తెలియడం ఇష్టంలేదు జయకి.

ఆవిడకసలే ఆరోగ్యం బాగాలేదు. ఇవన్నీ తెలిస్తే ఆవిడ ఏమవుతుందో?

"ఏంలేదమ్మా" అని సర్దేసింది జయ.

"ఎలాగైనా సుజాతకి కోపం, విసుగూ ఎక్కువయ్యాయే. ఐనా, దాంతప్పేం వుందిలే. సుఖంగా వుండవలసిన వయస్సులో బాధ్యతలు నెత్తిమీదకొచ్చి పడ్డాయ్ ఇదంతా నా రాత." అంది కమలమ్మ కళ్ళొత్తుకుంటూ.

## ఇది సంధ్యా సమయం

సుజాతని గురించి పూర్తిగా తల్లికి అర్థమయి నట్లు గ్రహించింది జయ.

'సుజాత వయసు ఆడపిల్లలు హాయిగాకాలేజీల్లో చదువుకుంటున్నారు. లేదా, పెళ్ళిళ్ళు చేసుకుని హాయిగా కాపరాలు చేస్తున్నారు. కానీ, సుజాత కుటుంబం కోసం కష్టపడుతోంది. ఏ వయసులో జరగవలసిన ముచ్చట ఆ వయసులో జరక్కపోతే ఇంతే!

సుజాతకి గుదిబండలా తనొకటి. కోరికలు తీర్చుకోవాల్సిన ఈ వయసులో బరువు బాధ్యతలు నెత్తిమీద వేసుకోవాలంటే ఎవరికైనా బాధగానే వుంటుంది. అందునా, ఇవి ఇప్పుడిప్పుడే తీరే బాధ్య తలు కావు! ఏ సరదా తీర్చుకోవాలన్నా ఇంటి ఖర్చులు తప్పడం లేదు!'

ఆలోచిస్తున్న కొద్దీ జయకి సుజాత మీద విపరీతమైన జాలి కలగసాగింది.

ఇన్నాళ్ళూ తనీ విషయమే గుర్తించలేదు సుజాత డబ్బిస్తే వండిపెడుతోంది. అంతేగానీ, సుజాతకి సహాయం చేద్దామనే ఆలోచనే రాలేదు!

మధ్యాహ్నం సమయమంతా తనకు ఖాళీయే. ఆ సమయంలో వూరికే కూర్చోకుండా ఏదైనా పనిచేసి నాలుగు డబ్బులు సంపాదించాలి.

ఏం చెయ్యాలి?

జయ ఆ రోజు అంతా ఆలోచించింది.

ఏ ఉపాయం తోచలేదు.

తనకీ విషయంలో సలహా చెప్పగలిగేది ఒక్క శారదమ్మగారే!

* * *

కళ్యాణి మందులషాపులో మందులు కొనుక్కుని బయటకొచ్చి హ్యాండ్‌బ్యాగ్‌లో చిల్లరా, చీటీ వేసు కుంటోంది.

ఇంతలో ఎవరో కుర్రాడు కళ్యాణి చేతిలోంచి పర్సు లాక్కుని పరిగెట్టాడు.

కళ్యాణి కంగారుపడుతూ —

"దొంగ...దొంగ..."అని గట్టిగాఅరవసాగింది

కళ్యాణి అరుపు విని ఎవరో వ్యక్తి పరిగెట్టుకు వెళ్ళి ఆ కుర్రాడిని పట్టుకుని పర్సు తీసుకొచ్చి కళ్యాణి కిస్తూ — "ఇదిగోనండి మీ పర్స్. అన్నీ సరిగ్గా వున్నాయో, లేదో చూసుకోండి" అన్నాడు ఆయాసపడుతూ.

కళ్యాణి ఆయనవేపు తిరిగి 'థాంక్సండీ' అని అనబోయి, 'ఈయన్నెక్కడో చూశానే' అని అనుకుంది.

అతనూ అదే స్థితిలో వున్నాడు. అతనే ముందు అడిగాడు — "మీరు బ్యాంక్‌లో పని చేస్తున్నారు కదూ?"

కళ్యాణికి అప్పుడు జ్ఞాపకం వచ్చింది.

అవును! అతను ఒకసారి వచ్చి అర్జెంటుగా చెక్ క్యాష్ చెయ్యాలని కోరితే తను చేసిచ్చింది ఇప్పుడు బదులుకి బదులు తీరిపోయింది!

కళ్యాణి నవ్వుకుంది.

"అదేమిటండీ నవ్వుతున్నారు? నేనెవరో గుర్తు కొచ్చానా?"

"ఆ."



కలకత్తా ఆంధ్ర సంఘంవారు ఇటీవల జరిపిన ఆదికవి నన్నయ జయంతి సభలో వేదికపై సభాధ్యక్షులు డాక్టర్ ప్రభాకర్ మాచ్వే, ముఖ్య అతిథి, వక్త డాక్టర్ దాశరథి, సంఘం అధ్యక్షుడు శ్రీ జె. ఆర్ కె మూర్తిగార్లని చిత్రంలో చూడవచ్చు

"ఆ రోజు మీరు సహాయం చెయ్యబట్టేవెంటనే నేను ట్రెయిన్‌కి అందుకోగలిగాను. నాన్నగారిని ఆఖరిసారిగా చూసుకోగలిగాను" అన్నాడు బాధగా

"అయ్యో! మీ ఫాదర్ పోయారా?"

"అవునండి!"

ఇద్దరూ మాట్లాడుకుంటూ నడవసాగారు

"నా పేరు శివరావండి. ఓ ప్రైవేట్ కంపెనీలో క్లర్క్‌గా పనిచేస్తున్నాను. అమ్మ, చెల్లి మా వూళ్ళోనే వున్నారు. మంచి ఇల్లు చూసి వాళ్ళను తీసుకురావాలి. మీ ఎరికలో ఏవైనా ఇల్లుంటే చెప్పండి."

"అలాగే!"

క్షణం ఆగి శివరావు అన్నాడు — "ఇంతవరకూ మీ గురించి చెప్పారు కాదు?"

"నాకు బ్యాంక్‌లో వుద్యోగమనే విషయం మీకు తెలుసుగదా!" అని నవ్వింది కళ్యాణి

"మీ ఫాదర్ .."

శివరావు మాట పూర్తికాకముందే కళ్యాణి అంది — "ప్రస్తుతం మా నాన్నగారు రిటైర్డై ట్యూషన్లు చెబుతున్నారు. అన్నయ్య వుద్యోగ ప్రయత్నంలో వున్నాడు. ఇద్దరు తమ్ముళ్ళు చదువు కుంటున్నారు."

శివరావు నవ్వాడు. —"మీరేం అనుకోనంటే మనం పరిచయమైన ఈ శుభసందర్భంలో ఒక కప్పు కాఫీ తాగుదాం. వస్తారా!" "ఇద్దరం ఒక కప్పేనా?" అని కళ్యాణి అనబోయి, అతిచనువు చూపించినట్లవు తుందని మానేసింది.

ఇద్దరూ హోటల్లో కూర్చున్నారు. "ఇందాక చూశారా? ఆ కుర్రాడికి పదేళ్ళుంటాయో లేదో? చేతిలోవున్న పర్సును ఎంతో నేర్పుగా కొట్టేశాడు. వాడి ధైర్యం తలచుకుంటే చాలా ఆశ్చర్యంగా వుంది." అంది కళ్యాణి.

"అదంతా ఆకలి మహత్యమండీ ఆకలి మనుషులచేత ఎటువంటి పనినైనా చేయిస్తుంది.





# నోటి దుర్వాసన పోగొట్టుకోండి...
# దంత క్షయాన్ని ఎదుర్కోండి.




కోల్గేట్ తాలూకు నమ్మకమైన ఫార్ములా మీ నోటి శ్వాస శుభ్రంగా, తాజాగా వుండేలా చేస్తుంది...
మీ పళ్లు ఆరోగ్యంగా, దృఢంగా వుండేలా చేస్తుంది.

**ఎలాగో చూడండి :**



మీ పళ్లలో ఇరుక్కుపోయిన ఆహారపు తునకల్లో దుర్వాసన, దంతక్షయం కలిగించే సూక్ష్మజీవులు పెరుగుతాయి.



కోల్గేట్‌లోని అద్వితీయమైన శక్తి గల నురుగు లోతుగా చొచ్చుకుపోయి, హానికరమైన ఆహారపు తునకలనీ, సూక్ష్మజీవులనీ తొలగిస్తుంది



ఫలితం: ఆత్మవిశ్వాసాన్నిచ్చే తాజా శ్వాస, దంతక్షయం నుంచి రక్షణ, ఆరోగ్యమైన గట్టి పళ్లు.

గుర్తుంచుకోండి, ప్రతిసారీ భోజనం కాగానే కోల్గేట్ డెంటల్ క్రీమ్‌తో పళ్లు బ్రష్ చేసుకోండి నోటి దుర్వాసన పోగొట్టుకోండి...దంతక్షయాన్ని ఎదుర్కోండి.

GK&E B82 86 TL,

## దీని తాజా పిప్పరమెంట్ రుచి మీ కెంతో నచ్చుతుంది!

విద్యార్థి లోకం వ్యాస రచన పోటిలో ప్రత్యేక బహుమతి రు. 150/-లు పొందిన వ్యాసం

# మా విద్యార్థిలోకం ఆశయాలు

"నేటి బాలలే రేపటి పౌరులు" అన్నట్లుగా నేటి మా విద్యార్థులు రేపటి భారతదేశ నిర్మాతలు. ఎన్నో ఆశలతో, మరి ఎన్నో ఆశయాలతో, విద్యార్థులు చదువుకోసం స్కూళ్ళకు, కాలేజీలకు వెళుతున్నారు. పై చదువుల ద్వారా తమ భవిష్యత్తును, తద్వారా దేశ భవిష్యత్తును తీర్చిదిద్దవలెననే కోరిక ప్రతి విద్యార్థిలోను ఉంటుంది.

అలా కలలు కనే మా విద్యార్థిలోకం నేటి విద్యా విధానంతోను, పరీక్షల పద్ధతులతోను, రాజకీయ నాయకుల కుతంత్ర పోరాటాలతోను, జోక్యంతోను విద్యార్థులు నిరాశ చెంది నిస్పృహకు లోనవుతున్నారు. అంతేకాక సరిపడు టీచర్లు లేక, ఒకవేళ టీచర్లు ఉన్నా సరియైన పాఠ్య పుస్తకములు లేక పాఠాలు చెప్పాలనే ఆసక్తి వారిలో లోపించుచున్నది లోపభూయిష్టమైన పరీక్ష పద్ధతుల వలన విద్యార్థులు కూడా చదువుల పట్ల చూపించవలసిన ఆసక్తిని చూపించుటలేదు. దీనివలన చదువులంటే శ్రద్ధ తగ్గి ఇతర అనవసర విషయాలలో జోక్యం చేసుకోవటం వలన వారి ఆశయములు నెరవేర డానికి ఆటంకమౌతున్నది.

తమ ఆశలు ఫలించాలంటే విద్యార్థులే పూనుకొని తమ సమస్యలకు తగిన పరిష్కార మార్గాలను కనుగొనవలెను. దీనికై విద్యార్థులు సంఘీభావంతో కలసి కట్టుగా పరిష్కారమార్గము లను అమలు జరపాలి. చదువుకు ఆటంకము లేనట్లుగా ప్రతి చిన్న సమస్యకు సమ్మెలు చేయ కుండా సంప్రదింపులద్వారా సమస్యలు పరిష్కారము చేయవలెను. ఉపాధ్యాయులు కూడా విద్యార్థుల అభివృద్ధిలో తమ పాత్రను తెలుసుకొని తదను గుణముగా పాఠములు బోధించవలెను. ప్రభుత్వము మరియు రాజకీయ నాయకులు విద్యార్థులను పావులుగా ఉపయోగించడం మాని, ఉన్నత విద్యా ప్రమాణముల అమలుకు కృషిచేయాలి. అంతేగాక సరియైన పాఠ్య పుస్తకములు సకాలములో అందే ఏర్పాటు చేయాలి. విద్యార్థు లందరు తమ ఆశయ సాధన కోసం విద్యార్థి దశనుండీ పునాదులు వేసుకొని కృషి చేయాలి. యువక రక్తపు వేడిలో సమస్యలను క్లిష్టము చేయకుండా, శాంతి సామరస్యాలతో వాటి పరిష్కారానికి కృషిచేసి మంచి విద్యార్థులు అనిపించుకోవాలి. తల్లితండ్రులు కూడా పిల్లల యెడ తమ బాధ్యతలు గుర్తించి వారి ఆశయ సాధనకు సరియైన మార్గాన్ని చూపించి కృతార్థులయ్యేలా చూడాలి. ★

## రచయిత పరిచయం



"1968వ సం.లో పుట్టాను. స్థానిక సి. ఎస్. ఐ. హైస్కూల్‌లో 10వ తరగతి చదువుచున్నాను. క్రికెట్ ఆడటం, సైక్లింగ్, వ్యాయామము చేయటం అంటే నాకు ఇష్టం. చిత్రలేఖనము, పుస్తక పఠనం చేస్తుంటాను. వ్యాసరచన పోటీలో నా వ్యాసానికి ప్రత్యేక బహుమతిని ఇచ్చిన ఆంధ్ర సచిత్ర వార పత్రిక సంపాదకులకు నా కృతజ్ఞతలు."

— జి. శ్రీనివాసరావు

పాపం, సన్నగా వూపిరిలేనట్టున్నాడు. వాడిని పోలీసులకు పట్టిస్తామంటారు జనం. వాడు ఆ పోలీసుల చేతుల్లో పడితే ఆ కాస్త ప్రాణం గుటుక్కు మంటుంది అందుకే ఒక రూపాయి వాడి చేతిలో పెట్టి, తిరిగి ఇటువంటి పనులు చెయ్యకు దెబ్బలు తింటావని చెప్పి పంపాను."

కళ్యాణి శివరావు వేపు ఆశ్చర్యంగా చూసింది. "కానీ, కళ్యాణిగారూ! వాడు మళ్ళీ దొంగతనం చెయ్యడన్న గ్యారంటీ ఏమీ లేదనుకోండి. నేనిచ్చిన రూపాయి అయిపోగానే మళ్ళీ దొంగతనం చేస్తాడు దానికి మనమేం చెయ్యలేంగదా!" అని శివరావు

## ఇది సంధ్యా సమయం

నిట్టూర్చాడు

ఇంతలో కాఫీ వచ్చింది.

ఇద్దరూ త్రాగారు.

"మన జీవితాలు మాత్రం ఏం బావున్నాయి లేండి వాడు తిండి లేకపోతే దొంగతనం చేస్తున్నాడు. మనం అది చెయ్యలేక కడుపులో కాళ్ళు పెట్టుకుని పడుకుంటున్నాం. ఆకలితోపాటు మన కనేక సమస్యలు. చిక్కులు. జవాబుదొరకని పజిల్స్"

శివరావు మాటలు వింటుంటే కళ్యాణికి తన అక్క సీత జ్ఞాపకం వచ్చింది.

అవును! అతను చెప్పింది నిజమే!

"మన సమస్యలన్నిటికీ ఒక్కటే మందండి అది డబ్బు" అంది కళ్యాణి.

"అవునండి. కాని, అది మనకు దొరకని మందు" అంటూ శివరావు లేచాడు

అవును! ఆ మందూ దొరకదు

తమ జబ్బు నయంకాదు! అని అనుకుంటూ కళ్యాణి కూడా బ్యాగ్ తీసుకుని అతన్ని అనుసరించింది.

ఇద్దరూ బయట కొచ్చింతర్వాత—

"నమస్తే. వస్తానండి" అంది కళ్యాణి

"నేనూ వెడతానండి" అన్నాడు శివరావు నవ్వుతూ.

అతని మాటకి కళ్యాణి నవ్వింది

ఆ నవ్వుకి లైటు వెలుగులో కళ్యాణి ముఖం తళుక్కుమంది.

'కళ్యాణిలోని అందమంతా ఆమె నవ్వులోనే వుంది' అని అనుకున్నాడు శివరావు

కళ్యాణి రిక్షా ఎక్కింది.

ఆ రిక్షా కనుమరుగయ్యే వరకూ అలాగే చూస్తుండిపోయాడు శివరావు!

* * *

సాయంత్రం అయిదున్నరవుతోంది.

సుజాత బస్సుకోసం వెయిట్ చేస్తూ బస్ స్టాపులో నిలబడింది.

"హల్లో సుజాతా!"

సుజాత తలత్రిప్పి చూసింది ఎదురుగా స్కూటర్‌మీద కుమార్.

సుజాతని చూసి నవ్వుతూ—"వస్తారా? లిఫ్ట్ యిస్తాను" అన్నాడు.

సుజాత కుమార్‌వేపు చూసింది. ఆ క్షణంలో సుజాతకి కుమారంటే ఎప్పటిలా అసహ్యం కలగలేదు జాలి కలిగింది. సానుభూతి కలిగింది. తనెంత విదిలించినా తనవెంటే పడుతున్నాడు. తనని అంతగా అభిమానిస్తున్నాడా!

సుజాత తనని ఏమైనా అంటుందేమోనని బెదురుగా చూడసాగాడు కుమార్. కాని, సుజాత మౌనం అతనికి వుత్సాహాన్నిచ్చింది.

"మీలాంటి బ్యూటీ క్వీన్ ఇలా బస్సుస్టాపులో నలుగురి మధ్య నిలబడ్డం ఏం బాగాలేదండి ప్లీజ్ రండి లిఫ్ట్ యిస్తాను" అని అభ్యర్థించాడు కుమార్.

సుజాత వెంటనే ఇంకేం ఆలోచించకుండా వెళ్ళి కుమార్ వెనుక స్కూటర్‌పై కూర్చుంది.

అది చూసిన కుమార్ మహానందపడిపోయాడు. హుషారుగా స్కూటర్ స్టార్ట్ చేశాడు ఒక హోటల్ ముందు స్కూటర్ని ఆపి—

"సుజాతా! మీరు బాగా అలిసిపోయినట్లున్నారు. 'టీ' త్రాగి రిలాక్స్ అవుదురుగాని రండి" అన్నాడు.

సుజాత కాదనకుండా కుమార్‌ను అనుసరించింది.

తను కోరిందే తడవుగా సుజాత తన వెంట రావడం కుమార్ ఆశ్చర్యపోయాడు.

(ఇంకా ఉంది)

ఆబాలగోపాలాన్నీ అలరింపజేసే అనురాగసుధారససుమమాలికలు

# శిల్పిఆర్ట్స్ గ్రీటింగ్ కార్డులు

ఎన్నో కొత్తరకాలు! నిత్యమై, సత్యమై పరవశింపజేసే శుభసందేశాలు

## ఆరాధన కార్డులు



ఆదిశంకరులనాటినుంచి నేటి వరకు యోగిపుంగవులు పూజించిన దేవతావిగ్రహాలు. స్తోత్ర రత్నావళి. అన్ని సందర్భాలలోను అంపదగినవి.
12 కార్డుల సెట్ రిజిస్టరు పోస్టేజితోసహా రూ. 28/-

## క్రిస్మస్ కార్డులు

బాపు చిత్రాలు క్రైస్తవ సోదరులకు పరమానందం కలిగించే కార్డులు
6 కార్డుల సెట్ రిజిస్టరు పోస్టేజితోసహా రూ. 12/-

## శృంగార నాయికలు



బాపు వర్ణచిత్రాలు. కృష్ణశాస్త్రిగారి చిత్రవర్ణనలు బహుశః శాస్త్రిగారు రచించిన చివరి పద్యరత్నాలు
8 కార్డులసెట్ రిజిస్టరు పోస్టేజితోసహా రూ. 20/-

## జానపద నృత్యావళి



నిత్యకళాకారుల రాయచౌధురి మురిపించే ముద్దుల చిత్రాలు కళాకారుల మువ్వలరవళిని మరిపించే సందేశాలు. భిన్నత్వంలో ఏకత్వసాధనకు మా చిరుకానుక.
12 కార్డులసెట్ రిజిస్టరు పోస్టేజితోసహా రూ. 24/-

## సంక్రాంతి కార్డులు



తెలుగు సంస్కృతికి నేటి వరకు సాటిలేని అపూర్వమైన శుభాకాంక్షలు
33 రకాల కార్డులు

తెలుగుమాట. తెలుగుపాట
తెలుగుకట్టు. తెలుగుబొట్టు
తెలుగుసంస్కృతి తియ్యదనాలు
తెలుగుసంస్కృతి వైభవానికి
హారతిపట్టే కర్పూరనీరాజనాలు

## శిల్పిఆర్ట్స్ గ్రీటింగ్ కార్డులు

మన తెలుగుతల్లికి మరో మల్లెపూదండ
మీ మనసులోని మాటను సందర్భశుద్ధితో
తెలియబలికే కమనీయ కవితలు
మృదుమధుర స్మృతులకు
ప్రతికార్డొక ప్రతిబింబం

## పుష్పరాగం



పువ్వులలో రాణిగులాబి పువ్వుల చిత్రాలు. రోజురోజూ పెరిగిపోతున్న ఒరలలో వికసిస్తున్న మనస్సులకు ఆశాభావం కలిగించే సందేశాలు,
6 కార్డుల సెట్ రిజిస్టరు పోస్టేజితోసహా రూ. 14/-

## ఉగాది కార్డులు



తెలుగుజాతి గర్వించదగిన వసంతోత్సవ చిత్ర రత్నాలు
15 రకాల కార్డులు

## పుష్పవిలాసం



జీవిత మాధుర్యాన్ని మురిపింపజేసే ముద్దుల చిత్రాలు తగు సందేశాలు
8 కార్డుల సెట్ రిజిస్టరు పోస్టేజితోసహా రూ. 10/-

న్యూఇయర్
తెలుగు
ఇంగ్లీషు
కార్డులు
మరికొన్ని
విక్రేతలవద్ద
లభించగలవు




**Cards Crafts Classics**
8 State Bank Street, P B No 2421 MADRAS-600 002
Grams "GREETCARDS" Phone 8 50 29 & 8 37 92
*Vijayawada Sales Office*, 23-10-16, Purushotham St, Satyanarayanapuram VIJAYAWADA-520 011
*Hyderabad Sales Office*, 1-1-336/26, Vivek Nagar, Chikkadapalli, HYDERABAD-500 020


SA/GC/82-10

సీరియల్

# జీవన్మృతులు

## ఇంగ్లీషు మూలం: బ్రామ్ స్టోకర్

## స్వేచ్ఛానువాదం: కొలను వేంకట దుర్గాప్రసాద్



(గత సంచిక తరువాయి)

**మీనా డైరీ :**

ఆగస్టు 6 : మరి మూడురోజులు గడిచాయి. జోనాధన్ దగ్గర్నించి ఇంకా వార్త తెలీలేదు. ఈ మౌనం చాలా భయంకరంగా వుంది. అతనికి ఉత్తరం ఎక్కడికి రాయాలో, అతనికోసం ఎక్కడి కెళ్ళాలో తెలిస్తే నా మనసు కుదుటపడుతుంది. కానీ జోనాధన్ గురించి, ఆ చివరి ఉత్తరం తర్వాత ఎవరికి ఏమీ తెలీదు. నాకు ఓర్పునిమ్మని దేవుడ్ని ప్రార్థించాలి. లూసీ కాస్త ఉద్రేకపడ్డం తప్ప, ఇతరత్రా బాగానే వుంది. తుఫాను వచ్చేట్టు వుందని రాత్రి పల్లెవాళ్ళు చెప్పారు. చాలా భయమేసింది. వాతావరణాన్ని పరిశీలించి తెలుసుకోవాలి. ఇవాళంతా బాగా మబ్బు పట్టింది. సూర్యుడు దట్టమైన మబ్బులవెనక వుండిపోయాడు. ప్రకృతిఅంతా మబ్బుగానే కనిపించింది, ఒక పచ్చికబయళ్ళు తప్ప. మబ్బు రంగు గుట్ట, మేఘాలు మధ్య పచ్చిక 'పచ్చ'గా వెలిగింది. మబ్బులు దట్టంగా అలుముకున్నాయి. సముద్రం ఘోష పెడుతోంది— ప్రకృతి నాశనం జరగబోతోందన్న సూచనగా. సముద్రపు ఒడ్డున అక్కడక్కడా కొన్ని ఆకారాలు కనిపిస్తున్నాయి. చేపలుపట్టే నావలు తిరిగి వచ్చేస్తున్నాయి. మిస్టర్ స్వేల్స్ వస్తున్నారు. తిన్నగా నా దగ్గరకే వస్తున్నాడు. అతని టోపీ తీసేస్తున్నాడు. ఇప్పుడు నాతో మాట్లాడతారు ...

ఆ శతవృద్ధుడిలో వచ్చిన మార్పు నన్ను కదిలించివేసింది. నా ప్రక్కనే కూర్చుని సౌమ్యంగా చెప్పడం మొదలెట్టాడు—

''చచ్చిపోయినవాళ్ల గురించి చాలా క్రూరమైన సంగతులు చెప్పి నిన్ను బాగా భయపెట్టి వుంటాను. నిజానికి నిన్ను భయపెట్టాలని కాదు. నేను పోయిన తర్వాత ఈ విషయాలు నువ్వు గుర్తుంచుకోవాలి. మమ్మల్నికూడా ఇట్లాగే సమాధి చేస్తారు. చావంటే నాకు భయం లేదు. కొద్దిగాకూడా భయంలేదు అంతమాత్రాన చావాలని లేదు. బ్రతకగలను అనుకున్నప్పుడు చావడం దేనికి. అయినా నా చావు దగ్గరపడిందనే అనుకుంటాను. మనిషి వంద ఏళ్ళకంటే బ్రతకడం ఎక్కువ ఆశించడం అవుతుంది. దేవుడు నాకోసం కబురు పంపొచ్చు—అప్పుడు మీరు నాకు వీడ్కోలు చెప్పరా !'' అన్నాడు. నాకు ఏడుపు వచ్చింది. ''ఈ రాత్రికే దేవుడు నాకు కబురుచేసినా నేను వెళిపోతాను. జీవితం అంటే ఏమిటి ? మనం చేస్తున్నదానికోసం కాకుండా, దేనికోసమో ఎదురు చూడ్డం. చావే దానికి సరైన జవాబు. నాలో తృప్తి వుంది. నాకు పిలుపు త్వరలో వచ్చేస్తోంది. మీరు చూస్తుండగానే, వింటూపోతుండగానే రావొచ్చు. సముద్రం మధ్యలో ఆ గాలి చూడు. అందులో నా కోసం పిలుపు వుండివుంటుంది. చూడు, చూడు!'' అంటూ హఠాత్తుగా అరిచాడు. ''ఆ గాల్లో ఏదో కనపడుతోంది. ఆ శబ్దం, ఆ వాలకం, ఆ అనుభవం, ఆ వాసన అంతా మృత్యువుకు సంబంధించిందే ! అది గాల్లో వుంది. అది వస్తున్నట్టు నాకు అనిపిస్తున్నది. ఓ దేవుడా, నువు నన్ను పిలిచినపుడు నాకు సంతోషాన్ని కలుగజేయి'' అంటూ రెండు చేతులు జోడించి నమస్కరించాడు. తన టోపీని గాల్లో వూపాడు. అతని పెదాలు ప్రార్థన చేస్తున్నట్టు కదులుతున్నాయి. కొద్ది నిముషాల తర్వాత, అతను లేచి, మాతో కరచాలన చేసి, ఆశీర్వదించి వెళ్ళిపోయాడు. ఇదంతా నా హృదయాన్ని కదిలించివేసింది. బాధతో నిండిపోయాను.

కోస్టుగార్డు మావైపు వచ్చాడు. అతనెప్పుడూ మాతో మాట్లాడేవాడు ఈసారి మాట్లాడకుండా సముద్రం మధ్య తేలియాడుతున్న ఓడను చూస్తున్నాడు ''అదేమిటో తెలియడంలేదు చూస్తుంటే రష్యా ఓడలా వుంది అది ఎటు పోతోందో తెలీడంలేదు ఏదో తుఫాను వస్తున్నట్టు అనుకుంటున్నది కాబోలు, అందుకని, అది ముందు కెళ్లాలో, లేక ఇక్కడకు రావాలో తేల్చుకోలేక పోతున్నట్టుంది అదిగో చూడు, ఓడ ఎట్లా తిరిగి పోయిందో వున్నట్టుండి. ఏమైనా దీనిగురించి రేపుగానీ సరిగ్గా తెలీదు'' అన్నాడు

### 'ది డైలీ టెలిగ్రాఫ్' పత్రిక నుండి కత్తిరించి, మీనాముర్రే డైరీలో అంటించిన ముక్కలు

(ఒక విలేఖరి)

విట్‌బి, ఆగస్టు 8. వున్నట్టుండి ఇక్కడ ఒక గొప్ప తుఫాను సంభవించింది. దీని తాలుకు ఫలితాలు అసాధారణంగ వున్నాయి. ఆగస్టులో వుండే మాదిరిగానే వాతావరణం కాస్త ఉక్కగా వుంది శనివారం సాయంత్రం వాతావరణం మున్నెన్నడూ లేనంత హాయిగా వుంది. శలవుల్లో ముల్‌గ్రేవ్‌వుడ్స్, రాబిన్‌హుడ్స్‌బే, రిగ్‌మిల్ రన్స్‌విక్, స్టయిథిస్, మొదలైన విట్‌బికి దగ్గరగా వున్న ప్రదేశాల్లో గడిపే జనానికి నిన్నటి వాతావరణం అనుకూలంగా వుంది. 'ఎమ్మా' 'స్కార్‌బరో' స్టీమర్లు చాలాసార్లు రద్దీగా తిరిగాయి. మధ్యాహ్నం వరకు వాతావరణం చక్కగా వుంది. ఆ సమయంలో 'ఈస్ట్‌క్లిఫ్' చర్చి ప్రాంతంలో కొంతమంది తుఫాను గురించి అనుకోవడం వినిపించింది. సముద్రతీరంలోని వాతావరణ కేంద్రం నుండి వాయవ్య దిశగా తుఫాన్‌ను సూచించడం జరిగింది. గాలి నైరుతి మూల నుండి వీచసాగింది అప్పటివరకు వాతావరణం బాగానే వుంది. కానీ తీరప్రాంతపు రక్షణ శిభిరపు వ్యక్తి, గత యాభై ఏళ్లకు పైగా వాతావరణ మార్పులను గమనిస్తున్న జాలరి ఇద్దరూ, హఠాత్తుగా తుఫాను సంభవించబోతున్నట్టు తెలిపారు సూర్యాస్తమయం అవుతోంది మేఘాలన్నీ సాయంత్రపు ఎండలో వివిధ రంగులను వెదజల్లుతున్నాయి. జనం చాలామంది ఈ ప్రకృతిని తిలకిస్తున్నారు. గాలులు వీచసాగాయి.

తర్వాత గాలి వీయడం బాగా తగ్గిపోయింది అర్థరాత్రి వేళకు ఆకాశంలో ప్రశాంతత ఏర్పడింది భూమిమీద ఉక్క మొదలయింది సముద్ర తీర

---

**జరిగిన కథ—7 :** 'తను ఇక్కడ బందీ' అని తెలుసుకొన్న జోనాధన్‌లో భయంకరమైన ఆలోచనలు కల్గుతుంటాయి. తనని తినబోయిన దెయ్యాల్ని అడ్డుకొని వాటిని సమాధాన పరచి పంపుతాడు డ్రాకులా. అసలు డ్రాకులా మనిషి కాదేమో అనే అనుమానం జోనాధన్‌కి కల్గుతుంది. అతను ఇక్కడి విషయాల్ని ఉత్తరాల ద్వారా తనవారికి తెలియపర్చడానికి చేసిన ప్రయత్నాలను డ్రాకులా అడ్డుకొంటాడు. ఇక తన చావు దగ్గిర పడిందని తెలుసుకొన్న జోనాధన్ అక్కడి నుంచి తప్పించుకోవడాన్కి మార్గాలు వెతుకుతుంటాడు. మిస్ మీనాముర్రే, మిస్ లూసీవెస్ట్ ఒకరికొకరు తమ తమ విషయాలను ఉత్తరాల ద్వారా తెలియ పర్చుకొంటారు. పి. మోరిస్‌కు ఆర్థర్ హోల్మ్‌వుడ్ క్విన్సీ తన దగ్గిర వళ్లు జలదరించే కబుర్లు వున్నాయని, తనకోసం ఎదురు చూడమని టెలిగ్రాం ఇస్తాడు. మిస్ మీనా తన డైరీలో, జోనాధన్ దగ్గరనుంచి ఎటువంటి సమాచారం అందకపోవడంతో దిగులు చెందుతునాటు రాసుకొంటుంది.

ప్రాంతంలో కొన్నిదీపాలు కనిపిస్తున్నాయి. ఎప్పుడూ కాస్త ఒడ్డున వుండే కొన్ని స్టీమర్లు, సముద్రం లోపలికి వెళ్లివున్నాయి. జాలరి పడవలు అక్కడక్కడా కనిపిస్తున్నాయి. ఒక చిన్న ఓడ మాత్రం పడమర దిశగా వెళుతూ కనిపించింది. దాని తాలుకు మనుషులు ఇంకా దాని గురించి పట్టించుకోకుండా వున్న విషయం కొంత విమర్శకు గురి అయింది. మొత్తానికి అది చూపు దాటి పోకుండా ప్రయత్నాలు చేయడం మొదలెట్టారు. దానిని చూస్తుంటే 'సముద్రంలో ఓడ' చిత్తరువులా వుంది.

రాత్రి పదిగంటల వేళకు వాతావరణం చాలా నిశ్శబ్దంగా వుంది. ఎక్కడో గొర్రె అరుపు, కుక్క అరుపు అతి స్పష్టంగా వినపడ్డాయి. దూరంగా బ్యాండ్-మేళం ఒకటి అప్పటివరకు వున్న నిశ్శబ్దాన్ని ఛేదిస్తోంది. అర్ధరాత్రి తర్వాత సముద్రంపైనుండి ఒక వింత ధ్వని వినవచ్చింది. ఆ ధ్వని ఫిరంగిలా మోతలా వుండి, మనిషి మూర్ఛపోయేంత ఎక్కువగా వుంది.

అంతే, హఠాత్తుగా తుఫాను మొదలయింది. నమ్మశక్యంగాని వేగంతో మొదలయింది. ఎంత వేగమో, తర్వాత కూడా అంచనా వేయడానికి వీలుండనట్టి వేగం అనిపించింది. సముద్రంలో అలలు కోపంతో వున్నట్టు లేస్తున్నాయి. కొద్ది నిముషాల్లో సముద్రం గర్జిస్తూ, భూమిని కబళిస్తున్న రాక్షసుడిలా కనిపించింది. అలల అంచుల నురగలు ఎత్తైన, ఇసుకతిన్నెలను పిచ్చిగా ఢీకొని, ఏటవాలుగా నున్న కొండగుట్టల అంచులు తాకుతున్నాయి. ఆ నురగలు విట్‌బీ హార్బరు లైట్ హౌస్‌లో వెలుగుతున్న లాంతర్లను వూడ్చుకు తీసుకుపోయాయి. గాలిహోరు పిడుగులా ఉరిమింది. ఆ గాలి తాకిడికి మనుషులు నిలబడడానికి ఎంతో ప్రయాస పడవలసి వచ్చింది. కొంతమంది ఇనప కడ్డీలు ఆసరాగా పట్టుకుని నిలబడగలిగారు. వంతెన మీద జనం లేకుండా చూడవలసిన అవసరం కనిపించింది. లేకపోతే ఎంతో ప్రాణనష్టం జరిగే ప్రమాదం వుండేట్టుంది. వున్న కష్టాలు చాల వన్నట్టు, సముద్రంపైన వున్న పొగ, తేటమేఘాలు భూమిని బాగా కమ్మేశాయి. అవి సముద్రంలో ఏనాడో చనిపోయినవారి ఆత్మలు భూమిమీద వున్న తమ బంధువులను పరామర్శించడానికి వస్తున్నట్టుగా అనిపించసాగాయి. ఒక్కోసారి పొగ మాయమవుతూ వున్నప్పుడు దూరంగా వున్న సముద్రంలోని మెరుపులు కనిపించసాగాయి. ఆ మెరుపులు తీగల్లా కాకుండా, చాలా మందంగా, వేగంగా వున్నాయి. వాటి ఉరుముల శబ్దానికి ఆకాశం వణికిపోతున్నట్టు అనిపించింది.

ఇట్లాంటి కొన్ని దృశ్యాలు మరిచిపోలేనివి జరిగాయి. సముద్రం పర్వతం అంతపైకి లేచింది తెల్లటి నురగతో ఆకాశం నిండిపోయింది. తుఫాను ఆకాశాన్ని అంటుతోందా అనిపించింది. జాలరిబోట్లు, తుఫాను తాకిడికి రాలిపడ్డ సముద్రపు పక్షుల్లా ముక్కలయిపోయాయి. ఈస్ట్‌క్లిఫ్ లైట్‌హౌస్‌లో సెర్చిలైట్ వేయడానికి ప్రయత్నాలు జరిగాయి మొత్తానికి లైట్‌హౌస్‌లోని అధికారులు అది పని చేసేట్టు సరిచేసారు. మధ్య మధ్యలో అలల అంచులు లైట్‌హౌస్ శిఖరాగ్రాన్ని తాకుతునే వున్నాయి. ఒకటి రెండుసార్లు మాత్రం లైటు బాగా వెలిగింది. ఆ వెలుగులో ఒక జాలరి పడవ, హార్బర్ దగ్గరి రాళ్లతో కట్టబడిన స్తంభాలకు గుద్దుకోకుండా, తప్పించుకోగల్గింది. అట్లా కొన్ని పడవలు ప్రమాదాన్ని తప్పించుకోడం చూసి హార్బర్‌లోని వాళ్ళు సంతోషంతో అరిచారు చప్పట్లు కొట్టారు. ఆ చప్పట్లు తుఫాను హోరును క్షణం సేపు మరిపించాయి

ఆ లైటు వెలుగులో మరో చిన్న ఓడ కనిపించింది. అది తుఫానుకు ముందు సముద్రం మధ్యలో తేలియాడుతున్న ఓడ అని తెలిసింది గాలి తూర్పువేపుకు తిరిగింది అది అట్లా తిరగ్గానే హార్బర్ గుట్టమీద వున్న జనానికి వణుకుపుట్టింది పరిస్థితి ప్రమాదంలో పడబోతున్నట్టు వాళ్లకి అర్థమయింది సెర్చిలైటుకు పోర్టుకు మధ్య కొన్ని రాతి గుట్టలున్నాయి. తుఫాను వచ్చినప్పుడు వాటికి ఓడలు గుద్దుకోని పాడయిపోతుంటాయి ఉప్పెన మొదలయింది. అలలు విపరీతంగా పైకిలేచాయి అలలు లేచినప్పుడు, సముద్రంలోని ఇసుక నేల కనిపించసాగింది. సముద్రం మధ్యలో వున్న చిన్న ఓడ వేగంతో, అతివేగంతో, నరకానికి పోతున్నట్టుగా వుంది తీరప్రాంతమంతా మళ్ళీ పొగ కమ్మేసింది









మునుపటిదానికన్నా దట్టంగా వుంది. ఆ పొగలో ఏ వస్తూవూ, ఏ మనిషీ కనిపించలేదు. తుఫాను హోరు, ఉరుముల శబ్దం, అలలజోరు, చెవులను బద్దలు కొట్టేస్తున్నాయి. సెర్చిలైటు తూర్పు వైపునున్న గుట్టలకేసి కేంద్రీకరించబడివుంది రాబోయే ప్రమాదాన్ని అందరూ అటువేపు చూస్తూ వూహిస్తున్నారు,ఊపిరిబిగపట్టుకొని గాలిహఠాత్తుగా ఈశాన్యమూలకు తిరిగింది కమ్మేసిన పొగ కరిగి పోయింది. చిన్న ఓడ అలలమధ్య ఊగిసలాడుతూ వస్తోంది. సెర్చిలైటు దానిమీద పడింది ఆ ఓడ లోని దృశ్యాన్ని చూసేసరికి అందరి శరీరాల్లో వణుకు బయలుదేరింది దానికి ఒక శవం వేలాడుతోంది. ఓడ వూగుతున్నప్పుడల్లా, శవంకూడా వూగులాడు తోంది ఓడలో మరో దృశ్యం కనపడ్డంలేదు. ఆ ఓడ ఎవరూ లేకుండా తిన్నగా ఒడ్డుకు కొట్టుకు రావడం, చాలా అద్భుతమయిన విషయంగా అనిపించింది ఇదంతా రాస్తున్నంతసేపు కాకుండా క్షణాల్లో జరిగిపోయింది. ఓడ ఆగిపోకుండా తిన్నగా ఒడ్డుకుచేరి, ఈస్ట్‌క్లిఫ్ వేపు వున్న ఇసుకదిబ్బలో వేగంగా కూరుకుపోయింది. ఆ ఓడ అట్లా ఇసుకలో కూరుకుపోయినప్పుడు, గొప్ప సంచలనం కలిగింది. ఓడలో చాలా భాగాలు దెబ్బతిన్నాయి పెద్ద ఇనుప దూలం ఓడ పైనుంచి విసురుగా క్రిందకుపడి భూమిలో కూరుకుపోయింది. అన్నిటికన్నా ఆశ్చర్య కరమైన విషయం ఏమిటంటే, ఓడ డెక్ కింద నుంచి ఒక కుక్క గెంతుతూ బయటకు వచ్చింది. ఇసుక దిబ్బమీదకు దూకింది. అది సమాధులువేపు పరుగెత్తి చీకట్లో కలిసిపోయింది, సెర్చిలైటుకు అందకుండా.

ఇది జరిగినప్పుడు అటువైపు ఎవరూలేరు తూర్పువేపునున్న కోస్టుగార్డు ఓడ కూరుకుపోయిన వేపు గబగబా పరుగెత్తాడు. దానిమీదకు ఎక్కాడు. సెర్చిలైటుమీద పనిచేస్తున్నవాళ్ళు, ఆ లైటును ఓడమీదకు ప్రసరించారు. కోస్టుగార్డు గబగబా ఓడనడిపే చక్రందగ్గరకు పరుగెత్తాడు. దాని మీదకు వంగి పరీక్షించడం మొదలెట్టాడు అతను ఏం చేస్తున్నాడో చూడాలన్న ఆతృత అందరిలోనూ బయలుదేరింది. అందరూ ఇటువేపుకు పరుగెత్తి రావడం మొదలెట్టారు. వెస్ట్‌క్లిఫ్ దగ్గర్నించి ఈస్ట్

## జీవన్ మృతులు

క్లిఫ్‌కు మంచిదారి వుంది (మా విలేఖరి బాగానే పరుగెత్తగలవాడవడంచేత జనానికంటే ముందరగా ఓడదగ్గరకు చేరుకున్నాడు.) నేను అక్కడికి వెళ్లే టప్పటికే కొంతమంది జనం అక్కడ వున్నారు పోలీసు, కోస్టుగార్డు ఎవర్నీ లోపలికి వెళ్లనీయడం లేదు. నేను విలేఖరిగా అనుమతి సంపాదించి, ఓడమీదకు ఎక్కాను. అక్కడ నావికుని శవం ఓడ చక్రానికి చుట్టేసి వుంది. కోస్టుగార్డు భయంతోనూ, ఆశ్చర్యంతోనూ చూసారు ఇట్లా ఎప్పుడూ జరగలేదు. ఆ నావికుని చేతులు తాళ్లతో చక్రానికి గల ఒక ఆకుకు కట్టేసివున్నాయి అతని చేతికి, చక్రానికి మధ్య ఒక 'శిలువ' వుంది

### రాత్రిపూట నగరం

రాత్రిపూట నగరం
తెలివిగా ఆడిన అబద్ధం
పగటి పూట ఆ నగరం
బయటపడిన సత్యం

### హూష్ కాకి

మంత్రి పదవికి కీచులాట
మరో పదవికి పాకులాట;
సమస్య శార్దూలమైనప్పుడు
అందరూ హూష్ కాకి.

### శుభ్రత

సులోచనాలు శుభ్రం చేస్తే
తొలగుతుందా కళ్ల మసక?
బాహ్య పరిశుభ్రత తొలగిస్తుందా
అంతర్గత మాలిన్యాన్ని?

— చల్లా రాధాకృష్ణశర్మ

పాపం అతను అక్కడ వుండి ఓడ నడుపుతూ వున్నాడేమో ఈ అలల తాకిడికి, ఓడ వూగులాటకు, వెనక్కి ముందుకు వచ్చి, అతని చేతులు, చక్రం ఆకుల్లో ఇక్కుకుపోయి, దానికున్న తాడు చేతులకు చుట్టుకుపోయి వుంటుంది ఆ తాళ్ళు అతని చేతుల్ని ఎముకలు కనపడేంతవరకు తెగకోసాయి

ఒక డాక్టర్ – సర్జన్, పేరు జె ఎమ్ కేఫిన్, 33 ఏళ్ళవాడు వచ్చాడు అతను నేను వచ్చిన వెంటనే వచ్చాడు. నావికుడి శవాన్ని పరీక్షించాడు అతను రెండు రోజుల క్రితమే చనిపోయినట్టుగా చెప్పారు అతని జేబులో మూత బిగించిన ఖాళీసీసా ఒకటి వుంది. దానిలో ఒక కాగితపు చుట్ట వుంది ఆ నావికుడు తాళ్లతో తన చేతుల్ని నోటిపళ్లతో కట్టేసుకుని వుంటాడని కోస్టుగార్డు అన్నాడు ఆ శవాన్ని అక్కడ్నించి కదిలించి అంత్యక్రియలు జరిపారు.

తుఫాను తగ్గుముఖం పట్టింది చిక్కుబడి పోయిన జనం ఇళ్ళవేపుకు దారిపట్టారు ఆకాశంలో అరుణకాంతులు పడసాగాయి. ఓడ సముద్రం నుండి హార్బర్‌కు చేరిన మాయాజాల విధానం మరికొన్ని వివరాలతో తర్వాతి సంచికలో రాస్తాను

విట్‌బి, ఆగస్టు 9 రాత్రి తుఫానులో ఓడ ఒడ్డుకు కొట్టుకురావడం చాలా ఆశ్చర్యం గొలిపే విషయమయింది. ఆ ఓడ పేరు 'డిమిటర్' — రష్యావారిది. వర్నా నుంచి వచ్చింది. ఓడ దాదాపు పూర్తిగా ఇసుకదిబ్బలో కూరుకుపోయిందనే చెప్పాలి. దానిలో కొంత సామాను వుంది. ఒవన్నీ చెక్క పెట్టెలు. అవి విట్‌బిలోని న్యాయవాది మిస్టర్ ఎస్. ఎఫ్. బిల్లింగ్‌టన్, 7, ది క్రిసెంట్‌కు చేరవలసినవి. ఆయన ఇవాళ ఉదయం తన పేర వచ్చిన సామానును తీసుకున్నారు. అక్కడి రష్యా రాయబారి ఓడను తమ ఆధీనంలోకి తీసుకున్నారు. హార్బర్‌కు చెల్లించవలసిన రుసుము చెల్లించారు. ఈ రోజు ఎవరూ ఆ ఓడ విషయం గురించి అనుకోలేదు పెద్దగా. విట్‌బిలో ఓడ ఒడ్డుకు చేరినప్పుడు, అందులో వున్న కుక్క విషయం విట్‌బిలో చాలామంది అనుకున్నారు. దానికోసం చాలామంది వెదికారు. కానీ దొరకలేదు అది చాలా భయపడిపోయి, ఎక్కడో దాక్కొని వుంటుంది అనుకున్నారు. కొంతమంది

# సినిమా

## 'శాంతిఘటం'

నాగమోహిని ఎంటర్‌ప్రైజెస్‌వారి చిత్రానికి పై పేరు పెట్టినట్లు నిర్మాత వై. రమేష్‌బాబు తెలియజేశారు. రాధిక, మేనక, సచ్చు, సిల్క్‌స్మిత, మోహన్, రాజేష్, వెన్నిరాడై మూర్తి పాత్రధారులు. ఎ. వీరప్పన్ కథ, స్క్రీన్‌ప్లే రాశారు. ఎస్. వసంతకుమార్ సంభాషణలంకర్త. శ్యామ్, ఎ. ఎ. రాజ్ స్వరకల్పనలో గోపి గీతాలు రాశారు. బి. ఎస్. ర్తి ప్రొడక్షన్ కంట్రోలర్. చంద్రశేఖరరెడ్డి వకర్త. ఎస్. పి. చక్రవర్తి దర్శకత్వంలో రామకోటేశ్వరరావు సమర్పిస్తారీ చిత్రాన్ని.



'ప్రళయ గర్జన'లో స్వప్న

## రాధాకృష్ణా మూవీస్

''మా చిత్రాన్ని సమర్పించే హీరో కృష్ణంరాజు గారు ఇదివరకు ధరించిన పాత్రలు ఒక ఎత్తు; మా కొత్త చిత్రంలో పాత్ర ఒక ఎత్తు,'' అన్నారు నిర్మాత జి. సత్యనారాయణరాజు. ఈయన డిసెంబర్‌లో మొదలెట్టే చిత్రంలో జయసుధ, ప్రభాకరరెడ్డి, సారథి ముఖ్యభూమికలు నిర్వహిస్తారు. రాజన్ నాగేంద్ర సంగీత దర్శకులు. కొమ్మినేని చిత్ర దర్శకుడు. 

# నన్ను క్షమించు రాజ్యం.....

- యం. ఉమామహేశ్వరరావు




ఆఫీసు మెయిన్‌గేటు సరిగ్గా పది అడుగుల దూరంలోనే ఉంది.

ఈ పదడుగులు పడితేచాలు గేటు చేరిపోవచ్చు. గేటుకీ, ఆఫీసుకీ మధ్య మరో పదడుగులు ఉంటుంది.

ఇలా కొలిచి కొలిచి నడవడం ఎంత కాలం?...

నడుస్తున్న దూరాన్నీ, గడుస్తున్న కాలాన్నీ కొలవడం ఎంతకాలం ?...

ఇదో యాంత్రిక జీవితం. తిరిగి తిరిగి యంత్రం చెడిపోతుంది. ఈది, ఈది ఈ సంసార సాగరంలో మనిషి అలసిపోతాడు.

అనంతం ఆ లో చ న లు పరి పరి విధాల పోతున్నాయి.

వేస్తున్న అడుగులు తడబడుతూ పదడుగుల దూరాన్నీ పదివందల్లాగ భావిస్తూన్నాయి.

"హమ్మయ్య !! గేటు వచ్చేసింది ... సిటీ బస్సులో వస్తే ముప్ఫై పైసల ఖర్చు. అవి మిగల్తాయని చెప్పి నడక మొదలిడితే కాళ్ళు తేలి పోతున్నాయి."

అనంతం ఊపిరినిండా ఆలోచనలే క్రమ్ము కున్నాయి.

ఈ ప్రపంచం నిండా నిండివున్నది ఆక్సిజినూ, నైట్రోజను ప్లస్ మరేదో అని అంటారు గాని అదేమీ గాదు .........

డబ్బు ! ...

డబ్బుతోటే ఈ ప్రపంచం నిండివుంది.

డబ్బులేని మనిషికి ఊపిరి లేనట్లే లెఖ్క.

ప్రాణాల్నీ, డబ్బునీ చెరో ప్రక్క పెట్టి ఏది కావాలో కోరుకొమ్మని అడిగితే మనిషి ముందు డబ్బుకే చేయి సాచుతాడు.

అదంతే !...

చిక్కటి చీకటి వలయంలా డబ్బు. మందులా డబ్బు. ఈ ప్రపంచం నిండా డబ్బు.

అనంతం గాల్లోకి చూసేడు. అప్పుడే ఎక్కువైన ఎండ చురుక్కున కళ్ళకు తగిలింది.

ఆఫీసు మెట్లు ఎక్కుతూ క్రిందకి చూసేడు అనంతం.

తనప్పుడే ఆరుమెట్లు ఎక్కి ఏడోమెట్టు మీద వున్నాడు.

ఇంతకాలం ఈ ఆఫీసు జీవితంలో ఎక్కేవి మెట్లే తప్ప ఏ ప్రమోషనూ లేదు. గుమాస్తాగా జాయనైనాడు. గుమాస్తాగానే రిటైరై పోతాడు.

మరికొన్ని గంటల్లో ఇప్పుడెక్కిన మెట్లన్నీ దిగక తప్పదు.

ఆఫీసు రిజిష్టర్‌లో సంతకం పెడుతూ చుట్టూ చూసేడు అనంతం.

అందరూ తనకంటే ముందుగానే వచ్చేసేరు

అవును వాళ్ళు తనకంటే ముందు రాగలరు. కాబట్టే తన కంటే ముందుగానే ఆఫీసులో ఉద్యోగపు మెట్లెక్కి గొప్పవాళ్ళయి కూచున్నారు.

జేబులోని రుమాలు తీసుకుని ముఖాన్ని తుడుచు కున్నాడు అనంతం.

ఇక పని ప్రారంభించాలి.

ఎలా ? ...

మనస్సు పనిమీద లగ్నం కావడం లేదు.

అంతరాంతరాల్లో ఎక్కడో కలుక్కుమంటున్న బాధ ...

"ఈ రోజు నీకు తప్పక మందు తెస్తాను రాజ్యం ! "

ఎంతో ధైర్యంగా, నమ్మకంగా, గుండెల్ని చిక్కబరుచుకుంటూ తన జీవిత భాగస్వామితో అన్న మాటలు మరోసారి గుర్తుకొచ్చేయి.

ఆ మాటలకు తనవేపు చూసిన రాజ్యం చూపుల్లో ఏదో మెరుపు. రోజురోజూ నీర్సంతో శుష్కించిపోయిన ఆ ముఖంలో ఏదో కాంతి. ఆ

కాంతి ముందు తను కొడిగట్టిన దీపంలా అయిపోతూ... తనలో తనే కుంచించుకుపోతూ...

అంతే చాలు...

తను తన భార్యను, తన జీవిత భాగస్వామిని నమ్మించగలుగుతున్నాడు. ఇన్నాళ్ళూ ఇలానే నమ్మించాడు.

కోరినవన్నీ యిస్తానని చెప్పి పదా? కాదు పాతికేళ్ళ నుంచి అబద్ధాలాడేడు.

చేస్తున్న ఉద్యోగంలో రాజీపడినా జీవితంతో రాజీపడలేక ఏదో పరాజయంతో క్షణ, క్షణం కుమిలి పోయేడు.

రాజ్యం!

అనంతం ఆలోచనలు రాజ్యం చుట్టూ తిరుగుతున్నాయి.

వారం రోజుల్నుంచి మూసిన కన్ను తెరవని జ్వరం. డాక్టరు దగ్గిరికి తీసుకెళ్ళలేని దౌర్భాగ్యంతో తనామె వంక చూడలేక, కుమిలిపోయేడు. కష్టాలప్పుడు కన్న బిడ్డలైనా ఉండాలి ... లేదా సంపాదించుకున్న డబ్బు అయినా ఉండాలి.

కన్న బిడ్డలు రెక్కలొచ్చి ఎగిరిపోయారు. ఎక్కడెక్కడో వున్నారు. వాళ్ళమీద ఆశ చాలా కాలం నుంచీ అడుగంటి పోయింది.

బారెడు బ్రతుకులో చేరెడేసి బియ్యం గింజలకే సరిపోని జీతంతో డబ్బు సంపాదించడం అనే విషయాన్నే ఊహించలేదు.

అనంతం ఆలోచనల్లో ఉండగనే ఎవరో పలకరించేరు.

'ఏం అనంతంగారూ... ఒంట్లో బావుండ లేదా? అలా వున్నారు?'

సీనియర్ గుమాస్తా లోకనాథం పలకరింపుగా అన్నాడు.

"అబ్బే! ... ఏం లేదు. బాగానే ఉన్నానే!..."

సర్దుకుని ఫైల్లో తల దూర్చేడు.

లోకనాథం అక్కడి నుంచి ఏదో గొణుక్కుంటూ కదిలేడు.

మనస్సు పని మీదకు లగ్నం కావటమే లేదు. కళ్ళ ముందు తన భార్య రాజ్యం... మందులు ... డబ్బు... .

"పోనీ ఆఫీసులో ఎవరైనా అడిగితేనో?!..."

అనంతం గుండెల్ని బరువుగా పట్టి పిండినట్లయింది.

ఆఫీసులో అందరూ ఒకటే. జీవన గమ్యాన్ని చేరడంకోసం అందరూ పడే తాపత్రయం కూడా ఒకటే ...

కాని వాళ్ళకూ తనకూ ఏదో తేడా వుంది. తనలో లేని ఏదో తెలివి వాళ్ళలో వుంది. అందుకే తను నెలాఖర్లో లబ లబ లాడిపోయి కుంచించుకుపోతుంటే వాళ్ళు మాత్రం తల ఎత్తుకునే తిరగ్గలుగుతున్నారు. సవ్యంగా బ్రతక్కలుగుతున్నారు.

అనంతం దృష్టి మనిషి మనిషి మీదా పడుతూ కొంతసేపటిలో మరో మనిషి మీదకు జారుతున్నాయి.

"ఎవర్నడగాలి?..."

"పోనీ లోకనాథాన్నే కదిపితే సరి!!

## నన్ను క్షమించు రాజ్యం...

పదిరూపాయలన్నా యివ్వకపోడు. తనంటే కాస్తో, కూస్తో గౌరవం చూపిస్తున్న వాడు..."

అనంతం తన సీట్లోంచి లేచేడు భారంగా.

తను వచ్చిన పని లోకనాథానికి వివరించాడు. ఆ చెప్పడంలో గుండెల్లో రగిలే మంటల్ని అదుపులో వుంచుకున్నాడు

కుర్చీమీద మంచి వెనక్కి జారగిలబడ్డాడు లోకనాథం. "సారీ! అనంతంగారూ! నా దగ్గర చిల్లిగవ్వ కూడా లేదీ సమయంలో. మీకు చెప్పలేక పోతున్నాను గానీ నిజంగా చాల బాధపడిపోతున్నాను." ఇంకా ఏదో చెప్పి ఒప్పించాలని చూసేడు లోకనాథం. కాని అనంతం అక్కడ లేడు.

అనంతం దృష్టి జనార్ధనం పై పడింది. అప్రెంటిస్‌గా చేస్తూ ఆ మధ్యనే జూనియర్‌గా కన్ఫర్మ్ అయ్యాడు. కుర్రాడు. ఇంకా పెళ్ళి కాలేదు. షోగ్గా, దర్జాగా వుంటాడు. ఆ మాత్రం డబ్బు పుట్టక పోదు.

ఈ బొమ్మ బొరుసు జీవితంలో అనంతం వంటి వారి జీవితం నాణెం ఎప్పుడూ బొరుసునే చూపిస్తుంది.

"జనార్ధనం ఆడపిల్లల కోసమైతే డబ్బు ముఖం చూడడుగాని తన కెందుకిస్తాడు!! ప్రాధేయపడి అడుగుతున్న ముసలాడిని ఓ పురుగు క్రింద చూసి తల త్రిప్పేశేడు.

అనంతం ప్రేగుల్ని ఎవరో మెలిత్రిప్పినట్లయింది.

రెండు ప్రయత్నాలూ ఘోరంగా ఫెయిలయ్యాయి. ఇక మూడో ప్రయత్నం ప్రక్క సెక్షన్‌లోనే ఉన్న రంగారావు.

అనంతం పట్ల బోల్డెంత గౌరవం వున్నవాడు రంగారావు. సెక్షన్ ఆఫీసరుగా ప్రమోషన్ కావడానికి అనంతం ఎంతో సాయం చేసేడు. ఆ విషయాన్నే పదే పదే చెవుతూ, "మీకు ఏ సమయంలోనైనా ఆదుకుంటాను అనంతం గారూ!!" అనేవాడు రంగారావు.

అనంతం కాళ్లు నెమ్మదిగా ప్రక్కసెక్షన్ వేపు మళ్లేయి.

లోకనాథాన్ని, జనార్దనాన్ని ప్రాధేయపడి లేదనిపించుకున్నాక అనంతం అవమానం, సిగ్గు పడిపోయాడు. రంగారావు తన సీట్లోనే కనిపించాడు అనంతానికి.

"హమ్మయ్య! రంగారావు సీట్లోనే ఉన్నాడు. సాయం చేయకపోడు."

అనంతాన్ని చూస్తూనే రంగారావు సాదరంగా ఆహ్వానించేడు. అవీ, ఇవీ, మాట్లాడేక తను వచ్చిన పని ఎంతో బాధతో, ఎంతో ఓర్పుతో చెప్పేడు అనంతం.

అడిగింది కేవలం ఇరవై రూపాయలే.

ఆ మాత్రం లోకనాథం దగ్గరా, జనార్దనం దగ్గరా లేకపోవచ్చు. కాని రంగారావు దగ్గర లేకపోవడం బాధగానే వుంది మరి!

రంగారావు నుంచి తనకు నెగిటివ్ రిప్లై వస్తుందని అనుకోలేదు అనంతం.

"సారీ అనంతంగారూ! నా దగ్గర ఈ నెల పూర్తిగా ఎక్జాష్ట్ అయిపోయింది డబ్బు. ఏమీ అనుకోవద్దు. అయాం ఎక్స్ట్రీమ్లీ సారీ!!..."

"సారీ!... ఈ సారీలూ, ఎపాలజీలూ, అనంతం జీవితంలో ఎన్నో విన్నాడు. రంగారావు పట్ల తన అభిప్రాయం ఎన్నడూ మారదు. కాని పరువునీ, మర్యాదనీ ఓ ప్రక్క పెట్టినా ఫలితం లేకపోయింది గదాని కుమిలి పోయేడు అనంతం. కళ్ళల్లో నీళ్ళు చిప్పిల్లుతుండగా తన సెక్షన్‌లోకి అడుగులు వేసేడు.

"నువ్వు దురదృష్టవంతురాలివి రాజ్యం!!"

గుండెల్లోనే బాధగా గొణుక్కున్నాడు భార్యను తలుస్తూ.

పాతిక సంవత్సరాల సర్వీసు కేవలం యిరవై రూపాయల్ని పుట్టించలేక పోయింది. తన పెద్దరికం గడ్డిపోచ కింద తయారైంది.

"లోకనాథానికీ, జనార్ధనానికీ తనంటే అసహ్యం లేకపోవచ్చు. గౌరవమే ఉండొచ్చు. కాని తనకు డబ్బు సర్దుబాటు చేయడంలో ఏదో యిబ్బంది వుండి వుంటుంది."

"బాబుగారు మిమ్మల్ని పిలుస్తున్నారండి." ప్యూను చెప్పి వెళ్లిపోయాడు. చివ్వున తలెత్తి చూసే లోపుగా అతను కదిలేడు. బాస్‌పిలుస్తున్నాడు. బాస్ పేరు భూషణం అక్కౌంట్స్ జనరల్ ఆఫీసు నుంచి ఆ మధ్యనే డైరెక్టుగా రిక్రూట్ అయ్యాడు.

మంచి తెలివీ, హొరవా వున్నవాడతను.

పనిలో ఏ తప్పునీ సహించలేని వ్యక్తి.

అనంతం ఆఫీసరు రూమ్‌లో అడుగుపెట్టేడు భూషణం చిర్నవ్వుతో పలకరించేడు.

"ఈ రోజు మా బేబీ 'బర్త్‌డే' అండీ! సాయంత్రం ఆఫీసుకాగానే వస్తారుకదూ!!"

అనంతం కంగారు పడ్డాడు. అయినా తమాయించుకున్నాడు.

"అలాగే సార్!..."

అంతే అని అక్కడి నుంచి పైకి వచ్చేసేడు అనంతం.

"బాస్ కూతురు బర్త్‌డే... సాయింత్రం ఆరు గంటలకి..."

తలలో వేయిడైనమైట్లు పేలినట్లుంది అతని పరిస్థితి. తన భార్య రాజ్యానికి మందులకే ఇరవై రూపాయలుసంపాదించలేని తన బ్రతుక్కి ఆఫీసరు గారి బేబీబర్త్‌డేకి వెళ్ళడం కూడానా?"

దుఃఖాన్ని దిగమింగు కుంటూ అక్కడినుంచి కదిలేడు.

"రాజ్యానికెలావుందో? ఈ వేళ నీకు తప్పక మందులు తెస్తాను రాజ్యం!" పిచ్చిది... తనంటే ఎందుకంత పడిచస్తుందో?... తను భర్తగాబట్టి. భరించేవాడు గాబట్టి.

మళ్ళీ నడుస్తున్నాడు అనంతం. ఈసారి అతని కాళ్ళు ఆఫీసునుంచి ఇంటికే. ఊపిరి భారంగా వుంది. అడుగులో అడుగులు వేసుకుంటూ కదుల్తున్నాడు.

త్రోవలోనే ఆఫీసరు భూషణంగారిల్లు.

"పోనీ వెళ్ళి ఆ పాపను దీవించి వస్తేనో!..." గుండెల్నిండా ఫకాల్మని నవ్వు వచ్చింది.

"తను దీవించడమా?... దీవిస్తే తన దరిద్రం అంటుకుపోదూ?! చేతిలో చిల్లికానీ




**వి. ఎమ్ - గుంతకల్లు**

అవినీతి, లంచగొండితనం దోపిడీ దౌర్జన్యాలకు అలవాలమై స్త్రీకి రక్షణ ఇవ్వలేని ఈ సమాజంపై నేటి యువతీ యువకులకు మీ సలహా ?

★ స్త్రీ బయట ప్రపంచంలోకి వచ్చింది కనుకనే ఈ అనర్థాలన్నీ — అంచేత మాట్లాడక — లోపల కూర్చోపెట్టాలి — అనుకోకుండా వుంటే చాలు. చీకటి తొలగిపోడానికీ, వెల్గులు రావడానికీ మధ్య కొద్ది క్షణాలు గాఢాంధకారం కమ్ముకొంటుంటుంది ... అది కొద్దిసేపే అయినా సుదీర్ఘంగా తోస్తుంది. ప్రస్తుతం మన సమాజం అలాంటి సంధి కాలంలో వుందని అన్పిస్తుంది నాకు. ఈ అదనులో ఆడది ఏ మాత్రం పిరికితనం ప్రదర్శించినా తరాలు వెనక్కి నెట్టివేయబడుతుంది.

**కె. జి. కె; కె వి. — న్యూఢిల్లీ**

13–8–82 వార పత్రికలో కాకినాడ పఠితకి మీరిచ్చిన జవాబు చదివాక మీకు ఉత్తరం రాసి అభినందనలు చెప్పాలనిపించింది. "జీవితంలో మగాడి పక్క పంచుకోవడమే ముఖ్యం కాదు. మనిషిగా నైతిక బలంతో తలెత్తుకుని, సగర్వంగా కూడా తిరగగలగాలి ఆడది" ఈ విషయం ప్రతి స్త్రీ గుర్తించాలి...

★ గుర్తిస్తేనే — మనిషిగా గుర్తింపబడుతుంది.

**జి. వి. ఆర్ — విజయవాడ**

నేటి రాజకీయ నాయకులపై మీ అభిప్రాయం?

★ మహోన్నతుల భుజాలెక్కి కూర్చున్న పిగ్మీలు ! అందుకే వారికంటే — ఎక్కువ మేర చూడకల్గుతున్నారు.

**మధు - కొల్లూరు**

దేశం, సాహిత్యం, సంసారం అన్నీ స్త్రీ చేతిలో వున్నా ఈ దేశంలో స్త్రీకి గౌరవం లేదు. ఎందుకండీ ?

★ అవన్నీ పురుషుడు స్త్రీ చేతిలో వుంచుకోనిచ్చాడన్న — మగ దృక్పథమే కారణం.

**ఎ. ఎస్. ఆర్. — కందికుప్ప**

ఈ దేశంలో కష్టపడి బాగా చదుకోవాలనే ఆసక్తి కలవారికి కులాల ప్రమేయం లేకుండా సీటు లభించే మంచి కాలం ఏనాటికైనా వస్తుందా ?

★ రాదు. ఏ మైనారిటీ కమ్యూనిటీగానో, ప్రొటెక్టెడ్ జాతిగానో పార్లమెంటుచేత డిక్లేరు చేయించుకోవాలి. అప్పుడు ప్రత్యేక కాలేజీలూ సదుపాయాలూ వీరికీ వస్తాయి.

**టి. టి. ఎమ్. ఆర్. — పెదకాకాని**

మంచికిపోతే చెడు ఎదురొస్తుంది ఎందుచేత ?

అడక్కుండా 'మంచి' చేయడానికి దిగిపోడం వల్ల.

మానవ జీవిత పరమార్థం ఏమిటి ?

★ సృష్టిలో ఉత్తమమైన మానవుడు ప్రతి క్షణం 'జంతువుకంటె బెటర్' అని నిరూపించుకుంటూ పోవడమే ప్రస్తుత పరమార్థంగా గోచరిస్తుంది.

**కె. ఎ - కాకినాడ**

అమ్మాయిలు ఎక్కువగా ఎటువంటి వారిని కోరుకుంటారంటే అస్తమానమూ ఏదో చమత్కారంగా జోకులు వేసేవారిని, నవ్వించేవారిని, చురుగ్గా వారిముందు నటన చేసేవారిని కోరుకుంటారు.

★ అది పెళ్లికి ముందు !

**బి. ఎస్ - విజయనగరం**

ప్రేమించడం నేరమా ?

★ కాదు— ఆ ప్రేమించింది పక్కింటావిడ భర్త కాకపోతే.

నేను ఒక అబ్బాయిని ప్రేమించాను యింట్లో ఎవరూ ఆమోదించడంలేదు.

★ అప్పుడదికదా చరితార్థం అవుతుంది !

**బి టి ఆర్. — బొబ్బిలి**

పునర్జన్మ వుందంటారా ? మీ అభిప్రాయం ?

★ ఉన్నట్టే వుంది — అదేవిటో కొందర్ని నేను గుర్తుకూడా పడుతున్నాను !!

**గణేశ్ ఆదోని**

మనకి ఏ మాత్రం స్వాతంత్ర్యం వచ్చిందంటారు ?

★ అధికారం వుంటే చాలానే వచ్చింది అధికారం లేకపోతే — ఏం లేదు.

**యు యు. యు. — ఎమ్మిగనూరు**

ఒకసారి మాట తప్పిన వ్యక్తిని ఎప్పటికీ నమ్మకూడదు అంటాడు షేక్స్పియర్ — మరి

★ అవి ఆ రోజులు. తప్పు ఒప్పుకుని క్షమాభిక్ష కోరిన వ్యక్తిని మన్నించడం, ఋనాటి సభ్యత

**జి ఆర్. కె — తుని**

నవ్వే ఆడదాన్ని నమ్మకూడదంటారు మరి నవ్విస్తూ నా మనసు దోచుకొందొక అమ్మాయి ఏమనాలి ?

★ బాగుందయ్యా... లేకపోతే ఏడుపు ముఖం వేసుకువుంటారా ఆడవాళ్లంతా ?! వెకిలిగా ప్రవర్తించేవారిని — జాగ్రత్త ! అని ఆ నానుడి అర్థం.

**డి. హెచ్ ఆర్. ఆర్ — సికింద్రాబాదు**

స్నేహితులా ? సంపదా ? ఏది ముఖ్యం ?

★ సంపద ఎప్పుడూ స్నేహితుడు కాకపోవచ్చునేమో— స్నేహితుడెప్పుడూ సంపదే. ★

---

లేకుండా ఉత్తచేతుల్తో వెళ్ళి "హేపీ బర్త్‌డే టూ యూ. ." అన్న పదాలు పలకాలంటే చాల బాధగా వుండదూ...

ఆఫీసరుగారు హోదాకు తగ్గట్టుగా చేతిలో ఏ పేకెట్‌తోనో వెళ్ళొద్దూ...

బహుమానాల కోసం... ప్రజల్లో గుర్తింపుల కోసం, పెంచుకోదలచిన పరపతికోసం తయారైన ఈ బర్త్‌డేలు ఉత్తచేతులకీ, దరిద్రపు మొహాలకీ, ఎంత్రటన్నూ పలుకుతాయా ?

అనంతం ఆలోచన్లతో నడుస్తూండగనే ఆఫీసరు భూషణంగారింటి సమీపానికి వచ్చేసేడు.

భూషణంగారింటిముందు ఒకటి రెండు కార్లు ఆగివున్నాయి. రిక్షాలు ఆగివున్నాయి. లోపలకు వెళ్ళేవాళ్ళు వెళ్తున్నారు.

దూరంగా ఎవరివో నవ్వులు వినిపించి అటు చూసేడు అనంతం.

లోకనాథం .. జనార్థనం కనిపించేరు. వాళ్ళ చేతుల్లో పెద్ద పెద్ద పేకెట్‌లు. వాళ్ల మాటల్లో ఇంగ్లీషు భాష.

తనకు బాధగా 'సారీ' చెప్పిన లోకనాథం ఆఫీసరుగారింట్లోకి హుషారుగా అడుగులు వేస్తున్నాడు

తనంటే గడ్డిపోచలా అసహ్యించుకున్న జనార్థనం చేతిలో ఏదో పెద్ద పేకెట్ వుంది. బ్రతకడం నేర్చినవాళ్ళు వాళ్ళంతా.

ఏ ఎండకా గొడుగు ధరించడం తెలిసినవాళ్ళు... వాళ్ళకి తన బాధతో పన్లేదు. అయినా వాళ్ళకి తనెవరు ?

తనకోసం వాళ్ళు డబ్బెందుకీయాలి ?

అనంతం కనుకొలకుల్లో నీళ్ళు చిప్పిల్లినాయి. తుడుచుకుంటూ వెనుదిరిగి అడుగులువేసి కదిలేవాడల్లా ఠపీమని ఆగిపోయాడు.

ఆఫీసరుగారింటి ముందు అప్పడే వచ్చి ఆగిన టాక్సీలోంచి భార్యా పిల్లలతో ఎంతో అట్టహాసంగా దిగేడు రంగారావు.

ఈ నెల పూర్తిగా ఎగ్జాస్ట్ అయిపోయింది డబ్బు. వెరీ సారీ ? అన్న రంగారావు, టాక్సీ వాడికి ఎంతో నిర్లక్ష్యంగా జేబులోంచి పర్స్‌తీసి పాతిక రూపాయలను తీసి ఇస్తున్నాడు

అనంతంలో కోటి కన్నీటి కడవలు పగిలిపోయాయి.

గుండె బ్రద్దలైంది. బాధతో ఉక్కిరిబిక్కిరైపోయాడు . .

హృదయ కవాటాల్ని తెరచుకుంటూ వస్తున్నాయి ఏవేవో మాటలు . అతని పెదవులు అస్పష్టంగా గొణుగుతున్నాయి. "నన్ను క్షమించు రాజ్యం .. " ★



# నీలాకాశం

## సీరియల్ — శ్యామల



(గత సంచిక తరువాయి)

వేణుగోపాలస్వామి ఆలయం ఏమంత పెద్దదికాదు.

కాని ఆలయప్రాంగణం ఎంతో శుభ్రంగా, నిశ్శబ్దంగా, ప్రశాంతంగా ఉన్నది. స్వామి విగ్రహం, ప్రక్కనే ఉన్న రాధాదేవి విగ్రహం చాలా బాగున్నాయి. స్వామి ముఖంలో చిరునవ్వు, దేవి కళ్ళలో మైమరవు అద్భుతంగా చెక్కబడిన ఆ విగ్రహాలను ముగ్ధురాలయి చూస్తూ ఉండిపోయింది ఇందిర. ఇద్దరూ దేవుడికి దండం పెట్టుకొని, తీర్థం తీసుకొని, బయట గట్టు మీద కూర్చున్నారు.

గుడిలో పూజారి తాతయ్య, వీళ్ళిద్దరూ తప్ప మరెవరూ లేరు. ప్రశాంత వాతావరణంలో, ఎత్తైన ఆ గుట్టపైన కూర్చొని, క్రిందనున్న వాగుని, చెట్లను చూస్తుంటే, చల్లని గాలి హాయిగా మేను స్పృశిస్తుంటే, దూరాన పక్షుల కిలకిలరావాలు చెవులకు సోకుతుంటే, ఇందిరకు మనసంతా హాయిగా, తేలికగా అనిపించింది. ప్రకృతి ఒడి కూడా తల్లిఒడి వంటిదే. ఆ స్పర్శ మనసులో బరువునంతా తీసేయ గలదు. అలా తన్మయంగా కూర్చున్న ఇందిర, ఏవో ఆలోచనల్లో కొట్టుకుపోతున్న పద్మ కూడా గుడిలోకి మరొక వ్యక్తి ప్రవేశించటం గమనించనే లేదు. అతను కొద్ది దూరాన కూర్చొని, కాస్సేపు వాళ్ళనే గమనిస్తూ గడిపాడు. తర్వాత గొంతు సర్దుకొని, చిన్నగా ఒక భావగీతం మొదలు పెట్టాడు—

"ఈ మావి పైనుండి ఈపె కూ కూ యనుచు..."

పాట విని ఉలిక్కిపడ్డారు ఇద్దరూ. ఇందిర విస్మయంగా చుట్టూ చూసింది. పద్మ నవ్వుకొని, ఆ భావగీతంలోని రెండవ లైను పాడింది.

"ఈ మావి పైనుండి ఈపె కూకూ యనుచు ."

అతను లేచి వాళ్ళవద్దకు వచ్చాడు. పద్మ ముఖంలో అతన్ని చూసినప్పటినుంచి కొత్త ఆనందం ఏదో కనిపిస్తున్నది.

"ఎప్పుడు వచ్చావు ?"

"ఈ మధ్యాహ్నం వచ్చాను. ఎలా ఉన్నావు ?"

పద్మ పరిచయాలు చేసింది. "ఇందిరా, ఇతను కృష్ణప్రసాద్. మా అత్తయ్య కొడుకు. మీ హైదరాబాదులోనే ఆంధ్రాబాంకిలో పనిచేస్తున్నాడు. మా అత్తయ్యవాళ్ళదీ ఈ ఊరే. అందుకని రెండు రోజులు శలవలువచ్చినా ఇక్కడికి వచ్చేస్తూంటాడు బావా, ఈవిడ ఇందిర. ఈరోజే జాక్సన్ అంకుల్ వద్ద టైపిస్ట్‌గా చేరింది. మా యింట్లోనే ఉంటోంది. నాకు స్నేహితురాలు."

"నమస్తే" అన్నాడతను మర్యాదగా.

ఇందిరకూడా "నమస్తే" అంది.

పద్మ పక్కన కూర్చున్నాడు అతను.

"మాకు కొన్ని ఫామిలీ ప్రాబ్లమ్స్ ఉన్నాయి ఇందిరా ! మేమిద్దరం కలుసుకోవటం బావ వాళ్ళింట్లోకాని, మా యింట్లోకాని ఇష్టపడరు అనవసరంగా గొడవ పడటం ఎందుకని, మేము వాళ్ళెవరికీకూడా తెలియకుండా కలుసుకుంటాము అందుకని ఈ పాట "ఈ మావిపైనుండి..." అనేది ఒక గుర్తుగా పెట్టుకున్నాము. బావ మొదటి లైను పాడగానే నేను రెండవలైను పాడితే,'దగ్గరకు రావచ్చు, డేంజర్ లేదు' అని అర్థం. ఏమీ పాడక పోతే 'ఇప్పుడు రావద్దు' అని అర్థం—ఇలా గుర్తులు పెట్టుకున్నాం !" చెప్పింది పద్మ.

"బాగుంది మీ కోడ్ లాంగ్వేజ్" నవ్వింది ఇందిర.

"ఏమండీ, మిమ్మల్ని ఎక్కడో చూసినట్టుంది ఎప్పుడయినా హైదరాబాదులో మా బాంకికి వచ్చారా ? మా బాంకి అంటే అశోక్‌నగర్‌లోని ఆంధ్రాబ్యాంక్ బ్రాంచి." ప్రసాద్ అడిగాడు

"వచ్చాను కొన్నిసార్లు" మధు పని చేసేది ఆ బ్రాంచిలోనే. ఈ ప్రపంచం ఏమంత పెద్దది కాదు — సుధాకర్ కనిపించాడు ఈ పల్లెటూరిలో ఇప్పుడు మధు పరిచయస్థుడు ఇతను కనిపించాడు

"బహుశా బ్యాంకులోనే ఎప్పుడో చూసి ఉంటాను" అన్నాడు అతను. తర్వాత పద్మ, అతను ఏవో మాటల్లో పడ్డారు. ఇందిర లేచి, ప్రకృతి సౌందర్యాన్ని రకరకాల కోణాల్లోనించి చూస్తూ, ఆవరణలో తిరుగుతూ, చాలారోజుల తర్వాత అనిర్వచనీయమైన హాయిని అనుభవించింది.

ఇంటికి వెళ్ళగానే ఇందిర, పద్మ భోజనాలుచేసి, వరలక్ష్మిగారికి పనిలో సాయపడ్డారు. తర్వాత పద్మ పత్రిక చదువుతూ పడుకుంది. ఇందిర తమ్ముళ్ళకి ఉత్తరం రాయసాగింది.

* * *

ఒక వారం గడిచేసరికి ఇందిరకు చాలాకాలంగా అక్కడే ఉన్నట్లు అనిపించసాగింది — అంతగా అలవాటయిపోయినాయి ఆ ప్రదేశము, ఆ వ్యక్తులు. క్రొత్తచోట, క్రొత్త రొటీన్‌లో, క్రొత్త వ్యక్తుల మధ్య — ఇందిరకి మార్పు చాలా నచ్చింది. దెబ్బ తిన్న ఇందిర మనసు ఈ చంద్రాపురంలో సేద తీరసాగింది. తల్లితండ్రులు లేరనే బాధతీరేదికాదు. కాని వారు లేరనే సత్యానికి, ఆ ఖాళీకి అలవాటు పడసాగింది ఆమె. పగలంతా మనస్సు డాక్టర్ జాక్సన్ ప్రాత్రపతిలో నిమగ్నమయి ఉండటంతో మధు ఏమంత గుర్తువచ్చేవాడు కాదు. సాయంత్రాలు గుడికి వెళ్ళి ప్రశాంత వాతావరణంలో కూర్చుంటే హాయిగా ఉండేది. ఆ సమయంలోనే మధు గుర్తు వచ్చేవాడు. అతనికి తిరిగి దగ్గర కాలేనేమోననుకుంటే గుండె బరువుగా అనిపించేది. కాని తను చేయగలిన దేమీలేదు. పరిస్థితులనే వాహినిలో కొట్టుకు పోకుండా, తమ్ముళ్ళ కోసం ఆ వాహినికి ఎదురీదాలనే ప్రయత్నంలో, మధుతో వివాహాన్ని జారవిడుచుకొనక తప్పలేదు ! ఆ గాయమూ నిజానికి మానలేదు. కాని చురుకు చురుకుమని పొడుస్తున్న బాధ పదును ఈ చంద్రాపురం తగ్గించింది.

డాక్టర్ జాక్సన్ ఇందిరను ఎంతో ఆదరంగా చూసుకొంటున్నారు. పద్మతో తీయని స్నేహం

**జరిగిన కథ — 9** ఆ రోజు రామారావ్ సుభద్రల సిల్వర్‌జూబిలీ సెలిబ్రేషన్స్‌కి అన్ని ఏర్పాట్లు చేస్తారు వారి సంతానం ఇందిర, రమేష్, సురేష్, ఉష. దానిలో భాగంగా రామారావ్, సుభద్రలను సినిమాకి పంపుతారు పిల్లలు: సినిమా చూసి స్కూటర్‌మీద వస్తూ యాక్సిడెంట్‌లో మరణిస్తారు ఆ దంపతులు. మధుతో ఇందిర పెళ్లి గతంలోనే ఖాయం చేయడం జరుగుతుంది. తన తమ్ముళ్ల, చెల్లి భవిష్యత్తు తీర్చిదిద్దడానికి మధుకి యిష్టం లేకపోయినా ఉద్యోగంలో చేరాలనుకుంటుంది ఇందిర. తన స్నేహితురాలు వీణ సహాయంతో ఓ ఫైవ్ స్టార్ హోటల్లో టెంపరరీ పోస్ట్‌లో ఇందిర టైపిస్ట్‌గా జేరుతుంది. తన కుటుంబాన్ని పైకి తీసుకువచ్చేవరకు ఆగమని ఇందిర ఎన్ని విధాల నచ్చజెప్పినా వినని మధు ఆమెతో తెగతెంపులు చేసుకోవడానికే నిశ్చయించుకొంటాడు. డాక్టర్ జాక్సన్‌తో ఇందిరకు పరిచయం కల్గుతుంది. ఆయన వివరాలు తెలుసుకొని ఆశ్చర్యపోతుంది. అక్కడ జాబ్ పూర్తికాగానే తన దగ్గర టైపిస్ట్‌గా జేరమని జాక్సన్ ఇందిరను ఆహ్వానిస్తాడు. పరీక్షలవగానే చెల్లిని తీసుకు రమ్మని తమ్ముళ్లకి చెప్పి తను ముందుగా వస్తుంది ఇందిర. లక్ష్మీపురంలో రైలు దిగి, అక్కడి పోర్టర్ సాయంతో ఆ పల్లెకు బయల్దేరుతుంది. తను ఎవరి మూలంగా అక్కడి జాబ్ వదులుకొని ఇక్కడికి వచ్చిందో అతనే డా॥ సుధాకర్ ఇందిరను జాక్సన్ దగ్గరకు చేరుస్తాడు. పట్నంలో పెరిగిన ఇందిరకు ఆ పల్లెటూరి వాతావరణం, అక్కడి మనుష్యుల మనస్తత్వాలు నచ్చుతాయి.

నరేసరి. పద్మ తల్లితండ్రులు కూడా ఒంటరి ఆడపిల్ల, ఇబ్బందులలో ఉన్నది, అనే భావనతో ఆప్యాయంగా మసులుతున్నారు. డాక్టర్ జాక్సన్ పుస్తకంలోని భావాలు ఇందిరకు క్రొత్త క్రొత్త వింత లోకాలను — ఆధ్యాత్మిక తరంగాలను — చూపిస్తున్నాయి.

సుధాకర్‌తో ఇదిరకు పెద్దగా పరిచయం అవలేదు. సాధారణంగా ఇందిర సాయంత్రం వెళ్ళి పోయినాకనో, వెళ్ళబోతుంటేనో అతను వచ్చేవాడు. ఇద్దరి మధ్యా ఏమంత మాటలు ఉండేవి కావు. ఆ రోజు 'బ్లూబెల్స్' హోటల్‌లో తను సుధాకర్‌ని మధుగా పొరబడటం, అతను తనను చవకబారుగా అంచనా వేయటం గుర్తుకు వస్తే, ఇందిరకు ఎంతో అవమానంగా, అభిమానంగా అనిపించేది.

ఇందిర వచ్చిన రెండు వారాలకు ఉషను తీసుకు వచ్చాడు సురేష్. అక్క ఆ ఊరిలో సంతోషంగా సెటిల్ కావటం గుర్తించాడు. ఆడంబరంగా ఉన్న హోటల్ 'బ్లూబెల్స్' వాతావరణం కంటె, సాధారణమైన పల్లె జీవితమే అక్కకి బాగా నచ్చినట్లుంది, అనుకున్నాడు. ఉష కూడా మాస్టరుగారి ఇంటి చుట్టూ, డాక్టర్ జాక్సన్ ఇంటి చుట్టూ ఉన్న విశాలమైన ఆవరణలో ఉత్సాహంగా తిరగసాగింది. ఆ సాయంత్రం సురేష్ వెళ్ళిపోతుంటే ఇందిర మరీ మరీ చెప్పింది, "నా గురించి, ఉష గురించి మీరేమీ దిగులు పెట్టుకోవద్దు. పరీక్షలకు బాగా చదువుకొని, మంచి మార్కులు తెచ్చుకోవాలి."

"మేము బాగానే ఉంటాం అక్కా ! నీ జీవితమే అయోమయం అయిపోయింది — మధుతో పెళ్ళి కావలసినదానివి, ఇలా ఇక్కడ ఉద్యోగం చేస్తూ ఉండవలసి వస్తున్నదంటె మా వలననే కదా !"

"'మీ వల్ల' ఏమిటెరా ? అవేం మాటలు ... మీరు — నేను — అంటూ వేరు చేయకు ! అందరం ఒక్కటే. మన అందరికీ మంచి అనుకున్నవే చేద్దాం. నేను ఇక్కడ సంతోషంగా ఉన్నాను ! పెళ్ళి విషయం అంటావా, దానికి ఇంకా టైము రాలేదు ... ఉషా, అన్నయ్య వెళ్తున్నాడు, బై బై చెప్పు ... రమేష్‌ని అడిగానని చెప్పు ... అమ్మమ్మ జాగ్రత్త ..."

సురేష్ వెళ్ళిపోయాడు. వాళ్ళకు పెద్దదిక్కుగా అమ్మమ్మ ఉంది. వాళ్ళు శ్రద్ధగా చదువుకుంటారని నమ్మకం ఉన్నది. వాళ్ళ గురించి బెంగపెట్టుకోవలసిన అవసరం లేదు, అనుకున్నా — 'ఎప్పుడూ నలుగురం కలిసే ఉన్నాం. ఇప్పుడు విడిపోయాం' అనే భావన మనస్సులో కలుక్కుమంటూనే ఉన్నది.

ఉషకు ఇంటి దగ్గరే చదువుచెప్పే బాధ్యత సుదర్శనం మాస్టారు తీసుకున్నారు. మంచి ఆహారం పెట్టి త్వరగా ఆరోగ్యం చిక్కేటట్లు చూసేందుకు వరలక్ష్మిగారు సాయపడసాగింది. చుట్టుప్రక్కల ఇళ్ళలో పిల్లలు ఉషకు స్నేహం అయినారు. పల్లె వాతావరణంలో ఉష ఉత్సాహంగా ఉండసాగింది.

డాక్టర్ జాక్సన్ పుస్తకం టైప్ చేయటంలో రోజులు చకచకా గడిచిపోతున్నాయి ఇందిరకి. ఒకమారు టైప్ చేస్తున్న విషయం అర్థం కాకపోతే, ఆయనను వివరణ కోసం అడిగింది.

"ఈ వాక్యం అర్థమేమిటండీ ? 'ఈ సమస్త జగమున అష్టమూర్త్యాత్మక ఈశ్వర స్వరూపముగా భావించి సేవించవలెను. అప్పుడే పరమాత్మని పరిపూర్ణముగా సేవించినట్లు అర్థము.' అష్టమూర్తులు అంటే ఏమిటి ?"

"అష్టమూర్తులు అంటే భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము, చంద్రుడు, సూర్యుడు, పురుషుడు. ఇందులో మొదటి అయిదింటిని పంచ భూతములంటారని తెలుసు కదా ? చంద్రుడు అంటె మనస్సు, సూర్యుడు అంటే బుద్ధి, పురుషుడు అంటే జీవుడు అని అర్థం చేసుకోవాలి. ఇది భగవాన్ రమణ మహర్షి 'ఉపదేశ సారం'లో ఎంతో బాగా వివరించబడి ఉంది. నీకు ఆసక్తి ఉంటే ఆ పుస్తకం చదువమ్మా, చాలా బాగుంటుంది. కేవలం 30 శ్లోకాలు — భావం మాత్రం ఎంతో లోతైనది —"

"ఆ పుస్తకం ఎక్కడ దొరుకుతుంది ?" అడిగింది ఇందిర.

"నా దగ్గర ఉన్నదమ్మా !" అంటూ ఇందిరను మేడమీదికి తీసుకు వెళ్ళాడు ఆయన.

మేడమీదికి వెళ్ళటం అదే మొదటిసారి ఇందరికి అక్కడ ఆయన పడకగది, లైబ్రరీ గది, వంట గది మాత్రమే ఉన్నాయి. తక్కినదంతా విశాలమైన డాబా. గదులలో ఫర్నిచర్ అవసరమైనంత మేరకు మాత్రమే సింపుల్‌గా ఉన్నది లైబ్రరీ గదిలో ఆంగ్లంలో పుస్తకాలే ఎక్కువగా ఉన్నాయి ఆంధ్ర, సంస్కృత భాషల ఉద్గ్రంథాలు ఎన్నో ఆంగ్లానువాదాలు ఉన్నాయి. ఇన్ని పుస్తకాలు చదివిన విజ్ఞాన ఖని — అనుకుంటే ఇందిరకు ఆయన పట్ల గౌరవం హెచ్చింది. నిరాడంబరంగా ఉన్న ఆయన జీవన విధానం ఇందిరకు చాలా ఆశ్చర్యం కలిగించింది ఈ మారుమూల పల్లెటూరిలో ఇంత సింపుల్‌గా









ఉంటూ, ప్రజలకు సేవ చేస్తూ కాలం గడపటంలో ఆయనకు ఏం ఆనందం లభిస్తున్నదో ?! ఆయన ఎప్పుడు తన వద్దకు వచ్చిన రోగులను, బాధితులను చూస్తూ అయినా ఉంటాడు; లేదా, తన వద్దకు రాలేని రోగుల ఇళ్ళకు వెళ్ళి వాళ్ళను చూసి వస్తూ ఉంటాడు. ఈ రెండూ కాకపోతే వైద్యం గురించిన జర్నల్స్ కాని, వేదాంత గ్రంథాలు కాని చదువుతూ ఉంటాడు. నిజంగా 'సెయింట్స్' అంటే ఇటువంటి వాళ్ళే — అంది ఇందిర మనస్సు. మళ్ళీ ముక్కు మూసుకొని పూజలు చేసే తత్త్వం కాదు ఆయనది. పిల్లలతో పిల్లవాడిగా ఆడుతూ పాడుతూ గడపగలడు; యువకులలో సరదాగా నవ్వుతూ, నవ్విస్తూ ఉండగలడు; పెద్దలలో ఒకడిగా గంభీరంగానూ ఉండగలడు. భార్యలేదు, అయినా ఎప్పుడూ ఒంటరిగా ఉన్నట్లే కనిపించడు. ఆయన ఆత్మశక్తే ఆయనకు మిత్రుడు, అండ.

క్రమంగా ఆయన పట్ల ఇందిరకు గౌరవం హెచ్చిన కొద్దీ, ఆయనకూ ఇందిర పట్ల అభిమానం ఎక్కువ కాసాగింది. ఆ అమ్మాయి కార్యదీక్ష, పట్టుదల ఆయనకు బాగా నచ్చాయి. దూరాన ఉన్న తన కూతురు వంటిదే ఇందిర కూడా, అనుకొనేవాడు. ఆయనకు టైప్ చేయటమేకాక, పేషంట్స్‌ని చూడటంలో కూడా ఇందిర సాయపడసాగింది. ఆయనకు సహాయంగా సుధాకర్, కంపౌండర్ ఉన్నా, తనకూ చేతనయిన పనులు చేస్తూ ఉండేది. ఆయన లేనప్పుడు ఫోన్‌కాల్స్ అందుకొని విషయాలు వ్రాసి ఉంచటం, పేషంట్స్‌ని వరుసగా లోపలికి పంపించటం; మందులు ఎలా వేసుకోవాలనేది వాళ్ళకు మళ్ళీ వివరించటం, హాస్పిటల్‌కి అవసరమైన ఉత్తర ప్రత్యుత్తరాలు చూడటం — చాలా వరకు ఆయనకు సెక్రటరీ పని చేయసాగింది:

వారానికి ఒకమారు ఆ క్లినిక్‌కి లేడీ డాక్టరు వస్తుంది, గర్భిణీ స్త్రీలను పరీక్ష చేసేందుకు. ఆవిడ సుధాకర్ పనిచేసే హాస్పిటల్‌లోనే డాక్టరు. సుధాకర్ డాక్టర్ జాక్సన్ కారులో ఆవిడను తీసుకు వస్తాడు. ఆ ఊరిలో మామూలి కాన్పులు నాటు మంత్రసానుల వద్ద చేయించటమే అలవాటు. డాక్టర్ జాక్సన్ ఎంతో శ్రమపడి ఒక రిటైర్డ్ మెటర్నిటీ నర్స్ విమలమ్మ అనే ఆవిడను తీసుకు

## నీ లా కా శం

వచ్చి, ఆవిడకు ఆ ఊరిలో నివాసం ఏర్పాటు చేయించాడు. తర్వాత లేడీ డాక్టర్ వారానికి ఒక మారు వచ్చి వెళ్ళే ఏర్పాటు కూడా చేశాడు.

ఆ రోజు బుధవారం. లేడీ డాక్టరుని తీసుకు వచ్చి దింపి, తిరిగి తన డ్యూటీకి వెళ్ళిపోయాడు సుధాకర్. బెంచీల మీద కూర్చొని ఉన్న గర్భిణీ స్త్రీలను చూస్తే ఎలాగో అనిపించింది ఇందిరకి. ఈ సాధక బాధకాలన్నీ స్త్రీలకే కదా! ఆనందం అనుభవించటం మాత్రం పురుషుల వంతు — ఫలితాలను భరించటం స్త్రీల వంతు. ఏమిటీ పక్షపాతం ప్రకృతికి కూడా ? నర్స్ విమలమ్మ సాయంతో పేషంట్స్‌ని పరిశీలించి, తను తీసుకువచ్చిన విటమిన్ బిళ్ళలు, ఐరన్ బిళ్ళలు వాళ్ళకు యిచ్చింది డాక్టర్ అరుణ.

పని అంతా అయినాక డాక్టర్ జాక్సన్, లేడీ డాక్టర్ అరుణ కాఫీ తీసుకుంటూ విశ్రాంతిగా కూర్చున్నారు. డాక్టర్ జాక్సన్ ఇందిరను పిలిచి అరుణకి పరిచయం చేశాడు. మాటల్లో అరుణ అన్నది ఇందిరతో "నీకు ఈ పల్లె వాతావరణం క్రొత్త కాదమ్మా? వీళ్ళు ప్రెగ్నన్సీకి పరీక్షలు ఎందుకు, డెలివరీలకు డాక్టర్లు ఎందుకు, అంటారు. 'మీ మంచి కోసమే' అని చెప్పినా అర్థం చేసుకోరు ఏదో విధంగా నచ్చజెప్పి తీసుకువచ్చి, మందులు ఇస్తే శ్రద్ధగా వేసుకోరు! 'మా అమ్మ డాక్టరు ముఖం చూడకుండా ఎనిమిదిమందిని కన్నది! నాకు మొదటి

### చుట్టాలు

ఒకప్పుడు చుట్టాలు
నవ్వితే నవ్వేవారు
ఏడుస్తే ఏడ్చేవారు
కానీ యిప్పుడు
నవ్వితే ఏడుస్తారు
ఏడుస్తే నవ్వుతారు — !

— ఖైరి సత్యనారాయణ

కాన్పుకే ఇవన్నీ ఎందుకండీ?' అన్నది ఒక అమ్మాయి. నేనేం జవాబు చెప్పను ? పూర్వం పుట్టిన పిల్లలలో ఎంతో మంది బ్రతికేవారు కాదు — కాన్పులు కష్టమయి తల్లులూ పోయేవారు — అటువంటివన్నీ జరగకుండా ఉండటానికే ఈ జాగ్రత్తలు అని వివరిస్తాను.''

''ఈ పల్లెలలో మూర్ఖత్వాలు ఎంతదూరం పోతాయో ఒక్కోసారి మీరు నమ్మలేరు !'' డాక్టర్ జాక్సన్ మనసు గతంలోకి వెళ్ళింది — ''పాతికేళ్ళ క్రితం — ఈ యింట్లోనే — నేను, నా భార్య జెన్నీ రాత్రి భోజనాలు చేస్తున్నాము. బయట వర్షం కురుస్తోంది. తలుపు తట్టిన చప్పుడయింది. నేను వెళ్ళి తలుపు తీశాను. తడిసిన బట్టలతో నడివయస్కుడు ఒకాయన నిలబడి ఉన్నాడు. ఆ చీకట్లో, గాలిలో, అంతటి వానలో పడి ఎందుకు వచ్చాడు ?!

''డాక్టరు బాబూ ! మా అమ్మాయిని మీరే రక్షించాలి !'' అని దండం పెట్టాడు.

నాకు అప్పట్లో తెలుగు అంత బాగా రాదు అయినా ఆయన చెప్పినది అర్థమయింది. కంగారు పడవద్దన్నట్లు భుజం తట్టి, విషయం ఏమిటో చెప్పమన్నాను. అంతలో రంగడు వచ్చాడు. అతను నా వద్దనే ఇంగ్లీష్ కొంత నేర్చుకొని, నేను చెప్పేది ఇతరులకు, వాళ్ళు చెప్పేది నాకు అర్థం కావటానికి సహాయం చేసేవాడు.

ఆయన చెప్పినది విని, నాకు చెప్పాడు 'ఈయన పేరు గోపాలంబాబు. కూతురికి ప్రసవం కష్టమవుతున్నదిట, రమ్మని అడుగుతున్నాడు. నిన్న పొద్దుట్నించి నెప్పులు వస్తున్నాయట. మంత్రసాని, 'ఇదిగో అయిపోతుంది, అదిగో అయిపోతుంది' అన్నదిట ఈ సాయంత్రం వరకు. ఇందాక ఇక చేతులెత్తేసి, 'నా వల్ల కాదు' అనేసిందట. విపరీతంగా బాధపడుతున్న ఆ పిల్లను ప్రక్క ఊరిలో ఆసుపత్రికి తీసుకుపోయే వీలులేదు— ఏం చేయాలో తెలియక ఇటువచ్చాడు.'

వెంటనే బయల్దేరాను వాళ్ళ యింటికి. జెన్నీ కూడా వచ్చింది నాతో. రంగడూ వచ్చాడు. జమిందారుగారి జీపు ఒకటి అప్పట్లో నా దగ్గరే ఉండేది. దానిలో నిమిషాల మీద ఆయన యింటికి చేరాము.




## ఎ. యస్. ఆర్. – వైజాగ్

నేను కట్‌డ్రాయర్లు వాడటం వలన తొడల మధ్య మచ్చలుగా ఏర్పడి గోకితే తెల్లగా పొట్టులాగ వస్తున్నది. డాక్టర్‌కి చూపిస్తే ఫంగస్ ఇన్‌ఫెక్షన్ అని ఆయింట్‌మెంట్ వ్రాసి ఇచ్చారు. అది రాయగానే తగ్గినది. మానేయగానే మరలా వస్తున్నది.

★ ఫంగస్ ఇన్‌ఫెక్షన్ ఉన్నప్పుడు లోనికి ఫల్విన్ – ఎం ; లేక గ్రైసోవిన్ మాత్రలు వాడవలసి ఉంటుంది. వీటిని పూటకి రెండు వంతున రోజుకి మూడు మార్లుగా వరుసగా పది రోజులు వాడవలసి ఉంటుంది. పై పూతగా విట్‌ఫీల్డ్ ఆయింట్‌మెంట్ వాడటం మంచిది. మరలా రాకుండా ఉండటానికి అండర్‌వేర్స్ మొదలయిన వాటిని నీటిలో బాగా మరగబెట్ట వలసి ఉంటుంది.

## ఐ ఎస్ ఆర్. భద్రాచలం

సినిమాలలో నటులు మనసు, మనసు అన్నప్పుడల్లా గుండెలమీద బాదుకుంటారుకదా ! మనసు అక్కడ వుంటుందనా వారి భావం ?

★ మనస్సు అనేదానికి అర్థం ఎవరూ ఇంత వరకూ చెప్పలేదు. ఏదైనా అవాంతరం వచ్చినప్పుడు కడుపులోని యాసిడ్ ఉత్పత్తి అధికంఅయి ఛాతీ భాగంలో మంటగా ఉండటంవల్ల "మనస్సు" బాధగా ఉందని అందరూ అనటం జరుగుతున్నది. బాదుకోవటానికి ఛాతీ చాలా అనువుగా ఉంటుంది !

## కె. జి. కె. - న్యూఢిల్లీ

"డయాగ్నోస్టిక్ లేపరోస్కోపీ" అంటే ఏమిటి ? అది ఎందుకు చేస్తారు ? ఉపయోగమేమిటి? ఇది భారతదేశంలో ఎక్కడెక్కడ వున్నది?

★ "కడుపు" భాగంలోని వివిధ అంగాలలోని అవాంతరాలను కనుగొనేందుకు చేయబడే పరీక్షను డయాగ్నోస్టిక్ లేపరోస్కోపీ అని అంటారు అంటే ఒక ప్రత్యేక సాధనాన్ని ఉపయోగించి వివిధ అంగాలలోని రోగాలను కనుగొనటం అన్నమాట. సాధారణంగా ఈ సాధనాన్ని స్త్రీల రోగాలను నిర్ణయించటానికి వాడటం జరుగుతున్నది. ప్రస్తుతం ఈ సాధనాన్ని విరివిగా స్త్రీల కుటుంబ నియంత్రణ ఆపరేషన్‌కి వాడుతున్నారు. ఈ సాధనం పెద్ద మెడికల్ కాలేజీ ఆస్పత్రులలో ఉపయోగింపబడుతున్నది.

## వై. ఎస్. - పార్వతీపురం

సాధారణంగా రక్తపరీక్ష చేసేటప్పుడు హెచ్ బి–టి.సి–డి.సి–ఇ.ఎస్.ఆర్ అని విభాగిస్తారు కదా ! ఇది మానవ శరీరమునకు ఎంతవరకు అవుసరము ? దీనిలో మాగ్జిమమ్ ఎంత ? మినిమమ్ ఎంత ?

★ నెత్తురు పరీక్ష రోగ నిర్ధారణకిగాను ఉపయోగిపడుతుంది. హీమోగ్లోబిన్ (హెచ్.బి) ప్రమాణం, తెల్లకణాలసంఖ్య (టి.సి.), తెల్లకణాలలోని వివిధాణువుల లెక్కింపు (డి.సి.), ఎర్రకణాలు గాజు గొట్టంలో క్రిందికి దిగే వేగం మొదలయినవి ఈ పరీక్షలలో కొన్ని.

హీమోగ్లోబిన్ పురుషులకి 15 గ్రాములు, స్త్రీకి 14 5 గ్రాములు ఉండాలి. కాని మనదేశంలో 10.5 గ్రాములనుంచి 14 గ్రాములవరకు మామూలని చెప్పవచ్చును. తెల్లకణాలు 6 వేలనుంచి 9 వేలదాకా ఉండవచ్చును. తెల్లకణాలలో పాలీమార్ఫ్‌లు 60–70, లింఫోసైట్‌లు 20–30, ఈస్నోఫిల్స్ 5–6 అనేసంఖ్యలో ఉండటం సహజం ఇ.ఎస్.ఆర్ చేయబడిన పద్ధతిననుసరించి ఉంటుంది.

## పి ఎస్. కె - చీరాల

నాకు 19 సంవత్సరములు. నాకు 1½ సంవత్సరముల క్రితం 'డియోడినో జెజునోస్టమీ' ఆపరేషన్ చేశారు. నా ఎత్తు 5' 3" ఒక సంవత్సరమునుండి నాలో ఎదుగుదల ఆగిపోయినది

★ మీరు చేయించుకున్న డియోడినో జెజునోస్టమీకి పెరుగుదలకీ ఏమాత్రం సంబంధంలేదు ఆపరేషన్ చేసినతర్వాత భయంతో సరిగా అన్నం తినకపోవటం బరువు పెరగకపోవటానికి కారణం అయి ఉండవచ్చును. ★

---

ఆ యిల్లు మధ్యతరగతి కుటుంబీకుని ఇల్లువలె ఉంది. పెంకుటిల్లు; దాని నిండా ఎవంవరో మనుష్యులు. నేను, జెన్నీ జీపుదిగి లోపలకు అడుగు పెట్టగానే, ప్రక్క గదిలోంచి పెద్దగా మూలుగులు వినిపించాయి. అటు వెళ్ళబోతుంటే, చటుక్కున నలుగురయిదుగురు ఆడవాళ్ళు అడ్డం వచ్చారు. ఒకావిడ గట్టిగానే ఏదో అన్నది. నాకేం అర్థం కాలేదు. రంగడు చెప్పాడు– 'ఆడపిల్లకు మగడాక్టరు పురుడు పోయటమేమిటి ? వీల్లేదు ! అమ్మగారిని మాత్రం లోపలికి వెళ్ళమని' వాళ్ళు అంటున్నారని:

జెన్నీ తెల్లబోయింది. 'నేను డాక్టరుని కాదు. మా ఆయనకు ఏదయినా సాయం చేయగలనేమోనని వచ్చాను. అంతేకాని నాకేం తెలీదు !' అంది.

'ఏమయినా సరే, మగవాడు లోపలికివెళ్ళటానికి వీల్లేదు' అన్నారు వాళ్ళు.

'వాళ్ళ మాటలకేం గాని, మీరు రండి' అని పిలిచాడు గోపాలం.

లోపల్నించి 'అమ్మా ! అబ్బా !' అని ఆ అమ్మాయి ఆక్రందన మళ్ళీ వినిపించింది ; ఇంక తాళలేకపోయాను. ఆ స్త్రీల ఆటంకం లెక్క చేయకుండా లోపలికి వెళ్ళాను

మంచం పైన పడుకొని ఉన్న అమ్మాయి చాలా చిన్నపిల్ల. పదహారు, పదిహేడు సంవత్సరాలకంటె ఎక్కువ ఉండవు. మంత్రసాని ప్రక్కనే ఉంది. ఆ అమ్మాయి పాపం బాధతో మెలికలు తిరిగిపోతున్నది. ఒళ్ళంతా చెమటలు పోస్తున్నాయి నాకు విపరీతమైన జాలి కలిగింది. ఇదే ఆసుపత్రిలో అయితే, మత్తు ఇచ్చి బాధలేకుండా చేసేవారు కదా – అనిపించింది. మంత్రసాని, జెన్నీల సహాయంతో ఆ అమ్మాయిని పరీక్ష చేశాను. ఆమె ఆసుపత్రికి ప్రయాణం చేసే పరిస్థితిలో లేదు. నా వద్దనున్న పరికరాలను 'బాయిల్' చేయించి, మత్తు ఇంజెక్షన్ యిచ్చి, 'ఫోర్‌సెప్స్'తో పిల్లవాడిని బయటకు తీశాను. ఆ అమ్మాయి మత్తుగా నిద్రపోయింది.

తిరిగి ఇల్లు చేరేసరికి తెల్లవారు జాము నాలుగు గంటలయింది. విపరీతమైన అలసటగా ఉన్నా, ఒక తల్లిని, పిల్లవాడిని ప్రాణాలతో నిలిపాననే తృప్తితో మనసంతా నిండింది హాయిగా నిద్రపోయాము.

మర్నాడు ఉదయమే టౌనుకి కబురుచేసి నర్స్ ఒకావిడను పిలిపించాను. అనవసరంగా గోపాలంగారి యింటికి వెళ్ళి గొడవలు తేవటం నాకు యిష్టం లేదు ఆ అమ్మాయిని జాగ్రత్తగా చూసుకోమని నర్స్‌కి అప్పగించాను.

తర్వాత వారం, పది రోజులలో జరిగిన సంఘటనలు వింటే విూరు నివ్వెరపోతారు. మగవాడిచేత డెలివరీ చేయించుకున్న కారణంగా ఆ పిల్లను, పసివాడిని భర్త, అత్తగారు, వాళ్ళ తరఫువాళ్ళు వదిలేశారు. ఆ పిల్లకు తల్లిలేదు. ఇప్పుడు వీళ్ళా కోపంతో, తమమాట వినకుండా మగ డాక్టరుని తీసుకువచ్చాడనే నిందవేసి, ఆ యింటిముఖం చూడమని చెప్పి వెళ్ళిపోయారు. గోపాలం, ఆయన కూతురు, పసిపిల్లవాడు – ఒంటరిగా మిగిలారు ఈ సమాజంలో.

ఇంత ట్రాజడీకి నేను కారకుడను, అనుకుంటే చాలా బాధ అనిపించింది. కాని నిజానికి దీనికి కారకుడను నేను కాదు – ఆ మనుష్యులలో కరుడుగట్టిన మూర్ఖత్వం, అహంకారం ! ఆడపిల్ల చనిపోయినా ఫర్వాలేదు, కాని పరపురుషుడు ఆమెను తాకకూడదు ! ఆ అమ్మాయి ప్రాణానికి వాళ్ళు ఇచ్చిన విలువ ఇదా ? కన్నప్రేమ అంటారు – ఆ అమ్మాయి భర్తకు పసివాడిపట్ల ప్రేమ అయినా కలగలేదా ? కనీసం ఆ బంధం అయినా వాళ్ళ వివాహాన్ని నిలబెట్టలేదేం ? అతనికి ఆరునెలలు తిరిగేసరికి మళ్ళీ పెళ్ళి కూడా అయిందని విన్నాను...

(ఇంకా వుంది)

# సజాతి ధృవాలు

రాజ్యలక్ష్మి కొలాస్కర్



"ఓదినా ! నా పింక్ డ్రెస్ ఇస్త్రీ చేయమన్నాను కదా ! ఎందుకు చెయ్యలేదు?" కరుస్తున్నట్లు అడిగింది విజయ.

రెండేళ్ల కూతురికి టిఫిన్ తినిపించడానికి నానా అవస్థలూ పడుతున్న శ్రీనిజ కోపంగా ఆడబడుచు వైపు తిరిగింది.

"నిన్న నేను యూనివర్సిటీ నుంచి ఇల్లు చేరుకునేసరికి ఆరు గంటలయింది. ఎప్పటిలాగా ఇంటెడు పనీ నా కోసం ఎదురు చూస్తోంది. దానికి తోడు ఈ రోజు నాకు ఒంట్లో బాగోలేదు... నీ అల్మైర తీసిచూసాను. ఇస్త్రీ చేసినవి చాలా డ్రెసులు ఉన్నాయి కదాని చెయ్యలేదు."

ఎక్కడ నుంచి విందో వచ్చేసింది శేషమ్మ. విషయమేంటో తెలియకపోయినా కోడలి మీద యుద్ధం ప్రకటించటానికి ఆవిడ ఎప్పుడూ సిద్ధమే. తల్లి వైపు తిరిగి అతిగారంగా ఫిర్యాదు చేసింది విజయ. "చూడమ్మా ! ఈ రోజు మా ఫ్రెండ్సందరం పింక్ డ్రెస్ వేసుకోవాలనుకున్నాం. నా చుడీదార్, చున్నీ ఇస్త్రీ చెయ్యమని ఈవిడగార్కి నిన్న ప్రొద్దున్ననగా చెప్పాను. ఇప్పుడేమో ఏంటో కుంటిసాకులు చెప్తోంది."

"వింటూనే వున్నానమ్మా !" కూతుర్ని చెయ్యి పట్టి వెనక్కిలాగి కోడలి మీద మీద కెళ్లింది శేషమ్మ.

"అలికి అన్నం పెట్టటం ఊరికి ఉపకారం" అన్నాట్ట వెనకటికెవడో. మమ్మల్ని ఉద్ధరించటానికి చదువుతున్నావా నీవు ? తైతక్కలాడుతూ కాలేజీ కెళ్తూ తమాషాగా కాలం గడపటానికి నువ్వు హాస్టల్లో లేవు. అత్తారింట్లో వున్నావు. కాలేజి వంకబెట్టి పని ఎగ్గొట్టడం నీకు బాగా అలవాటైపోయింది. ఆ బట్టలు ఇస్త్రీ చెయ్యకుండా ఇల్లెలా కదుల్తావో చూస్తాను."

శ్రీనిజ రక్తం సల సల 'మరిగింది.' "అత్తయ్యా టైము తొమ్మిదిన్నరవుతోంది. పరీక్ష పదింటికి మొదలవుతుంది. మీ కోరిక ప్రకారం పరీక్ష మానేస్తాను. అనక మీ అబ్బాయి వచ్చాక, "మీ అమ్మగారు విజయ బట్టలు ఇస్త్రీ చెయ్యమన్నారు. అందుకని పరీక్షకి వెళ్ళలేకపోయాను, అని చెప్తాను ఏమంటారు ?"

శేషమ్మ గాలితీసేసిన బెలూన్‌లా తగ్గింది.

"వెళ్ళమ్మా ! వెళ్ళు. నువ్వో శూర్పణఖ వన్న సంగతి తెలియక నిన్ను పనిపాటలు చెయ్యమనటం నాదే తప్పు" తిప్పుకుంటూ వెళ్ళిపోయింది శేషమ్మ.

"నానమ్మా ! వాణిని తియ్యి" కూతుర్ని ఆయా కప్పగించి హడావిడిగా బయలుదేరింది శ్రీనిజ. ఎంత త్వరగా వెళ్ళినా లెస్సు మొదలయిపోయింది. భయం భయంగా ప్రొఫెసరు నుద్దేశించి అంది — "మే ఐ కమిన్ సర్ ?"

క్వశ్చన్ పేపరు సీరియస్‌గా చూసుకుంటున్న విద్యార్థులంతా తలలెత్తి చూశారు. వాళ్ళతోపాటే ప్రొఫెసరుకూడా ! ఆయన ముఖం అప్రసన్నంగా మారింది.

"సో యూ లివ్‌డ్ అప్‌టు యువర్ రెప్యుటేషన్ ఆఫ్ బీయింగ్ లేట్ కమిన్ !"

సిగ్గుతో కుంచించుకుపోతూ తన సీట్లో కూర్చుంది. జోరీగల్లా మనసులో ముసురుతున్న ఆలోచనల్ని తోల్తూ పరీక్ష వ్రాయడాన్కి ప్రయత్నించ సాగింది.

శ్రద్ధగా చదివి పరీక్షలు వ్రాసే విద్యార్థులకి గంటలు క్షణాల్లా గడిచిపోతాయి. "టైమ్ ఈజ్ అప్" అనే ప్రొఫెసర్ కంఠం శ్రీనిజని ఈ లోకంలోకి తీసుకొచ్చింది. వ్రాసిన కాగితాలు బొత్తిగా పెట్టింది. ప్రొఫెసర్ వచ్చి అవి అందుకుంటూ అన్నారు — "మిసెస్ శ్రీనిజా ! లంచ్ బ్రేక్ అవగానే ఒకసారి వచ్చి నన్ను కలవండి."

ప్రొఫెసర్ బయటకి వెళ్ళగానే తరువాత లెక్చరర్ వచ్చారు. ఆయన గోల ఆయనది. శ్రీనిజ బాధ శ్రీనిజది. "ఎందుకు రమ్మన్నారు ప్రొఫెసర్" అనుకుంటూ భయపడిపోతోంది. ఒళ్ళంతా చెమటలు పడుతున్నాయి. "బహుశ ఆయన క్లాసులు తరచు ఎగ్గొడుతున్నాననేమో ! ఎందుకని అడిగితే ఎలా చెప్పుంది ! ఏం చెప్పుంది తన అవస్థ ! చెప్పినా ఆయన కర్థమవుతుందా ? అసలు యమ్మెస్సీలో జాయినవటం తన పొరపాటు. అదీ ఇంట్లో వ్యక్తుల స్వభావాల గురించి తెలిసికూడా !" శ్రీనిజ ఆలోచనలు ఆమె నిమిత్తం లేకుండానే గతంలోంచి వర్తమానం లోకి వర్తమానంలోంచి గతంలోకి పరుగులు పెడుతున్నాయి. నాలుగు సంవత్సరాల క్రిందట :

ఆ రోజు బియ్యస్సీ మార్కుల్స్ షీట్స్ వచ్చాయి. యూనివర్శిటీ ఫస్టుగా రెండు గోల్డ్ మెడల్స్‌తో పాసయిన శ్రీనిజకి సంతోషంగా జేబులోవున్న యాభై రూపాయలు తీసిచ్చి ఏమైనా కొనుక్కో మన్నాడు తండ్రి. అవి తీసుకుని తన కిష్టమయిన బుక్ షాపులోకి అడుగుపెట్టింది. ఆమెని చూస్తూనే సంతోషంగా ఆహ్వానించాడు సుధాకర్. అతను ఆ షాపు ప్రొప్రయిటరు కొడుకు. "రండి రండి ! సరిగ్గా సమయానికి వచ్చారు. చాలా కొత్త టైటిల్స్ వచ్చాయి." శ్రీనిజకి పుస్తకాల పిచ్చి. ప్రతి పైసా పోగుచేసి పుస్తకాలు కొనుక్కుంటుంది. సుధాకర్‌కి శ్రీనిజ పిచ్చి. ఆమె ఎప్పుడొచ్చినా ఆమె వెనకే తిరుగుతూ పుస్తకాలు చూపిస్తూ, కబుర్లు చెప్తూ తన్మయత్వం చెందుతుంటాడు. ఆమె కొన్న ప్రతి పుస్తకానికి సంతోషంగా పదిహేను శాతం డిస్కౌంట్ ఇస్తాడు.

శ్రీనిజ వోడ్ హౌస్ రాక్ వైపు దారితీసింది. ఆమె పుస్తకాలు సెలెక్టు చేసుకున్నాక అన్నాడు.

"ఈ రోజు మీతో కొంచెం మాట్లాడాలండి, ఒక అరగంట స్పేర్ చెయ్యగలరా ?"

"మాట్లాడండి !"

"ఇక్కడ కాదు. ఆ పక్కగా నా ఆఫీస్ రూమ్ వుంది. అక్కడైతే మననెవరూ డిస్టర్బ్ చెయ్యరు ప్లీజ్ ! ఒక్క అరగంట."

అతని కంఠంలో అభ్యర్థన ఆమెచేత అడుగు వేయించింది. ఇద్దరూ కుర్చీల్లో సెటిలయాక అన్నాడు సుధాకర్—

"మీరు ఇన్నిసార్లు ఇక్కడికి వచ్చినా మీ పేరేమిటో నాకు తెలియదు. మీరంటే మాత్రం నాకు చాలా ఇష్టం. మీరు చదివే పుస్తకాలనుబట్టి, మీ మాటలనుబట్టి మీ అభిరుచులు, అభీష్టాలు ఒక్కటేనన్న భావన నాకు కల్గింది. మీ కిష్టమైతే మిమ్మల్ని పెళ్ళి చేసుకోవాలనుంది. నా గురించి వివరాలు చెప్తున్నాను వినండి. నా పేరు సుధాకర్. బియ్యే చదివాను. వయసు ఇరవై ఆరు. మా ఇంట్లో పెద్దవాడ్ని. నా తరువాత తమ్ముడు, ఇద్దరు చెల్లెళ్ళు. మాకు ఈ షాపు, ఒక ఫ్యాన్సీ షాపు, ఒక హోల్‌సేల్ క్లాత్ షాపు, ఒక ఆటోమొబైల్ స్పేర్ పార్ట్స్ షాపు వున్నాయి. మా అందరికీ తలో కోటీ అన్న మాట. ఇవికాక పెద్ద ఇల్లుంది. వాహనాలు వగైరా చిల్లరమల్లర ఆస్తి వుంది. బియ్యేతో చదువుకి గుడ్‌బై చెప్పేసి కుదురుగా బిజినెస్ చేసుకుంటున్నాను."

అతను చెప్పేతీరుకి శ్రీనిజకి నవ్వొచ్చింది. నవ్వుతూనే అంది. "నా గురించి చెప్పే అవసరం లేదు. మనిద్దరి సంబంధం కుదరటం అసంభవం. ఈ బుక్స్‌కి బిల్ రాస్తే వెళ్తాను" లేవబోతున్న శ్రీనిజని చెయ్యిపట్టి ఆపేశాడు.

"ఎందుకు అసంభవమో కారణాలు చెప్పి వెళ్ళండి."

శ్రీనిజ ఇబ్బందిగా అతని చేతిలోని తన చెయ్యి వంక చూసింది.

"సారీ" వదిలేశాడతను. "చెప్పండిప్పుడు".

"వినండయితే ! మీ స్థాయికీ, మా స్థాయికి చాలా చాలా తేడా వుంది. మా నాన్నగారు పైసా కట్నమివ్వలేరు. కట్నం వద్దని మీరన్నా బహుశా మీ తల్లితండ్రులు ఒప్పుకోరు. పోనీ, మీరు మీ తల్లి తండ్రులూ కూడా పొరపాటున ఒప్పుకున్నారను కుందాము. ఇంకో అడ్డంకి వుంది. నేను బియ్యెస్సీ పాసయ్యాను. పెళ్ళి చేసుకోవటాన్కి అభ్యంతరం లేదుగాని చదువు ఆపటం ఏమాత్రం ఇష్టంలేదు. యమ్మెస్సీ చదివితీరాలని నా ప్రస్తుతాభిప్రాయం. తనకంటె ఎక్కువగా భార్య చదువుకోవటానికి ఏ భర్త ఇష్టపడతాడు ?"

"అయిపోయాయా మీ వాదనలు ?" ఆశ్చర్యంగా చూసింది సుధాకర్‌ని శ్రీనిజ.

"మరి నా సమాధానాలు వినండి. నిజంగానే కట్నం తీసుకోవటం నా కిష్టం లేదు. మా అమ్మ నాన్నా కావాలని పట్టుబడితే వాళ్ళకే విధంగా సమాధానం చెప్పాలో నాకు తెలుసు. రెండవది. నాకు రాని చదువు నా భార్యకి రావటం నాకు గర్వకారణం. మీరు పి. హెచ్ డి. చేసినా నాకు అభ్యంతరంలేదు. అఫ్‌కోర్స్ తన భర్త తన కంటె తక్కువ చదివిన వాడనే నామోషీ ఆడవాళ్ళకుండ వచ్చు. నా ఉద్దేశంలో అది చాలా తెలివితక్కువ. మన ఉదాహరణే తీసుకోండి. మీరు డాక్టరేట్ తీసుకున్నా నాకున్న లోకజ్ఞానంతో, వ్యాపారదక్షతలో, లౌక్యంతో వందో వంతు మీకు రాదు. అది ఫార్మల్ డిగ్రీస్‌కి కాంపెన్సేషనన్న మాట. అది గుర్తించే సంస్కారం మీలో వుండాలి !"

శ్రీనిజ కళ్ళల్లో అడ్మిరేషన్ గుర్తించి కంటిన్యూ చేశాడు. "మీ రొప్పుకుంటే ఒక షరతు." కళ్ళతోనే ప్రశ్నించింది. "అందరు యువతులు కోరుకునేట్టు పెళ్ళవగానే మా యింట్లోంచి వచ్చేసి వేరు కాపురం సాధ్యం కాదు. మీరు మా చెల్లెళ్ళు తమ్ములతో అమ్మ నాన్న లందరితో కలిసే వుండాలి."

అప్రయత్నంగా బుర్ర వూపింది శ్రీనిజ. "అంటే ?" చిలిపిగా అడిగాడు సుధాకర్. శ్రీనిజకి తనేం చేసిందో తెలిసి సిగ్గుపడిపోయింది ఇంగారుగా అంది "నాకేం తెలియదు. మా యింటికొచ్చి అడగండి"

శేషమ్మ కొడుకుతో హోరాహోరీ పోట్లాడింది "కట్నంలేని కోడల్ని తెస్తావా" అంటూ. సుధాకర్ ఇంట్లోంచి వెళ్ళిపోతానని బెదిరించేసరికి తగ్గింది సుధాకర్ ఆస్తి తీసుకెళ్ళకపోయినా తన సామర్థ్యంతో ఏవైనా సమకూర్చుకోగలడు. ఎటొచ్చీ దెబ్బ కుటుంబానికే. సుధాకర్ ఎవ్. ఏ ఫస్టియర్‌లో జాయిన వగానే శేషమ్మ భర్తకి పక్షవాతం వచ్చి కాలూ, చెయ్యీ పడిపోయాయి. చదువు మానేసి అతి కొద్దికాలంలో వ్యాపారంలోని ఒడిదుడుకులన్నీ నేర్చుకుని అతి సమర్థవంతంగా నిర్వహించు కొస్తున్నాడు. మహేష్ ఇప్పుడిప్పుడే నేర్చుకుంటున్నాడు.

పెళ్ళి ఏ గొడవా లేకుండా జరిగిపోయింది సుధాకర్ కోరిక మీద ఆ సంవత్సరం మానేసి మళ్ళీ సంవత్సరం జాయినవుదామనే వుద్దేశ్యంతో అప్లై చెయ్యలేదు శ్రీనిజ. హనీమూన్‌కి వెళ్ళిన పదిహేను రోజులు సుఖపడిందేమో ! కాపురానికి రావటంతోటే కోడలికి నరకం అంటే ఎలా వుంటుందో కొంచెం కొంచెం రుచి చూపించసాగింది. తల్లి అండ చూసుకొని పెద్దాడపడుచు విజయ, మరిది మహేష్ కూడా ఒదిన మీద అధికారం చెలాయించే వాళ్ళే. ఎటొచ్చీ చిన్నాడబడుచు లలిత మాత్రం అసూయ ద్వేషాల కతీతమైన పన్నెండేళ్ళ వయసులో వుంది. అందమైన ఒదినంటే అభిమానంగా వుండేది.

శ్రీనిజ కాపురానికి కొచ్చేసరికే ఇంట్లో పని మనిషి లేకుండా జాగ్రత్త పడింది శేషమ్మ వంట, అంట్లు, ఇల్లు క్లీనింగ్ మొత్తం పనంతా క్రమ క్రమంగా పంధొమ్మిదేళ్ళ శ్రీనిజపై పడింది. పనికాక పైన సాధింపులు సూటీపోటీ మాటలు. అర్థంలేని అధికారం! ఒక్కోసారి భర్తకి చెబుదామా అనుకునేది. అంతలోనే జాలి ముంచుకొచ్చేది ప్రొద్దున్న తొమ్మిది గంటలకి ఇంటినుంచి వెళ్ళిపోయి మళ్ళీ రాత్రి తొమ్మిదిన్నర పది ప్రాంతాల వచ్చేవాడు. అప్పుడు కూర్చోబెట్టి తను ఫిర్యాదులు మొదలెడితే అతని మనస్సెలా వుంటుందో, ఇంట్లో ఏం గొడవ లవుతాయో అన్న భయంతో నోరు విప్పేదికాదు. శ్రీనిజలో ఈ బలహీనత కనిపెట్టిన శేషమ్మ రోజు రోజుకి విజృంభించేది. సుధాకర్ ఇంట్లో వున్న సమయంలో మాత్రం అతి మేధావంతంగా నటించేది.

సుధాకర్‌కి కూడా ఇంటి విషయాలంతగా పట్టేవి కావు.

పెళ్ళయిన ఆర్నెల్లకే శ్రీనిజకి నెల తప్పింది. మనసు చికాగ్గా వున్నప్పుడు టాబ్లెట్స్ వేసుకోవటం మర్చిపోయిన మూలంగా! శ్రీనిజకి దిగులు ముంచు కొచ్చింది. ఇంక చదువు సంతకే అనుకుంది. సుధాకర్ ఓదార్చాడు, "అదేమిటి సిరీ! పిల్లలున్నంత మాత్రాన చదువుకోకూడదని రూలు లేదుకదా! మనకి కావలసినంత డబ్బుంది. ఫుల్‌టైము ఆయాని కుదుర్చుకుందాము. అమ్మ ఎలాగూ వుండనేవుంది."

అయిదో నెలలో డాక్టరు మరింత విచారం కల్గించే వార్త చెప్పింది. సుధాకర్ బ్లడ్ ఆర్ హెచ్ నెగెటివ్. శ్రీనిజ ఆర్ హెచ్ పాజిటివ్. ఈ కాంబినేషన్ వున్నవాళ్ళకి సాధారణంగా అబార్షన్ జరుగుతుంది. ఒకవేళ డెలివరీ అయితే స్టిల్ బేబీ పుడుతుంది. అదీకాక బ్రతికివున్న బిడ్డ పుట్టినా పుట్టిన మరుక్షణం బిడ్డకి బ్లడ్ ట్రాన్స్‌ఫ్యూజన్ చెయ్యకపోతే చచ్చిపోతుంది. చేస్తే బ్రతికే ఛాన్సుంది. తరువాత వచ్చిన ప్రెగ్నెన్సీలు ఎట్టి పరిస్థితుల్లోనూ నిలవ్వు. ఇప్పుడైనా శ్రీనిజ చాలా జాగ్రత్తగా వుండాలి.

సుధాకర్ తల్లి స్వభావం తెల్సినవాడవటంతో బాగా ఆలోచించి శ్రీనిజని వాళ్ళమ్మగారింటికి పంపించేశాడు. తల్లికి విషయం తెలియనియ్యలేదు.

అతికష్టంమీద వాణి బ్రతికింది. అప్పుడే శ్రీనిజకి ట్యూబెక్టమీ కూడా చేసేశారు. సుధాకర్ శ్రీనిజ ఈ విషయాలేవీ శేషమ్మకి తెలియకుండా జాగ్రత్తపడ్డారు

వాణికి ఏడాది నిండుతున్నా శ్రీనిజ యమ్మెస్సీ మాటెత్తకపోవటంతో ఒకరోజు సుధాకరే ఆ విషయం ప్రస్తావించాడు. అతడికి ఏ మూలో గిల్టీగా వుండేది. తనమూలంగా శ్రీనిజ బ్రిలియన్స్ అంతా వంటింటికే పరిమితమైపోతుందే అని.

"ఏమిటి సిరీ! ఈ ఏడాదైనా యూనివర్శిటీలో జాయినవ్వవా? అప్లికేషన్ ఫార్మ్స్ తెచ్చాను."

మైలవరం లయన్సుక్లబ్ ఆధ్వర్యంలో ఇటీవల జరిగిన 'సంగీత వినోద హరివిల్లు' కార్యక్రమంలో సినిమాపాటలు పాడిన డా. కోనాడ అశోక్.




# సజాతి ధృవాలు

ఒక్కసారి శ్రీనిజ ముఖంలో మబ్బులు కమ్ముకున్నాయి. "నాకేమో ఇది పెద్ద డైలమా అయిపోయిందండీ! ఓ వైపు అయ్యో చదువుకోలేకపోతున్నానే అని బాధ. మరో వైపు నా దారిన నేను వెళ్తే దీని సంరక్షణ సరిగా జరగదేమో అని బాధ. ఒకవేళ దీనికేదైనా అయితే జీవితాంతం మనసు పీకుతుంది. నేను ఇంట్లోనే వుండి వుంటే ఇలా జరిగేది కాదేమోనని. అందులోనూ మనకి ఇక పిల్లలు ...

శ్రీనిజ గొంతు వణికింది. కళ్ళల్లో నీళ్ళు నిండాయి. ప్రేమగా దగ్గరకు తీసుకున్నాడు సుధాకర్. "నువ్వింత పిచ్చిదానివనుకోలేదు సిరీ! ఇంతేనా చదువంటే నీకున్న పట్టుదల, ఇంట్రెస్టు? వాణికేమీ కాదు. నువు నిశ్చింతగా ఎమ్మెస్సీలో జాయినవ్వు ఎంత డబ్బైనా మంచి ఆయాని కుదుర్చుకుందాము. ఆమె సరిగ్గా చూస్తుందో లేదో? చూడటాన్కి మా అమ్మ ఉండనే వుంది. సిరీ! ఏ విషయం గురించైనా లోతుగా ఆలోచించటం ఇంకెప్పుడు నేర్చుకుంటావు? వాణికి ఏమీ అవకూడదనే ఎప్పుడూ దేవుణ్ణి ప్రార్థిద్దాం. ఒకవేళ ఏదైనా అయిందే అనుకో! నువ్వుండి ఏదైనా చెయ్యగలవా? దాని అదృష్టం మన అదృష్టం బాగాలేకపోతే ఎవళ్ళు ఏం చెయ్యలేరు. నువ్వేమీ బాధపడకుండా జాయినవ్వు."

శ్రీనిజ యూనివర్శిటీలో జాయినయేటప్పుడు ఇంట్లో చిన్నసైజు యుద్ధం జరిగింది.

శేషమ్మకి కోడలు రోజంతా తన చేతిలో వుండకుండా పోతుందనే బాధ, తన కూతుళ్ళకీ, కొడుకులకీ అబ్బని చదువు కోడలుకి వస్తోందే అనే అసూయ, తన కొడుకు కంటె ఎక్కువ చదివి అతని మీద అధికారం సంపాయించుకుని తమనుంచి లాక్కుపోతుందేమోనని భయం వీటన్నిటితో కొడుకుమీద విరుచుకుపడింది.

"ఏరా? ఇంత చవటవయిపోయావు? పసిదాన్ని వదిలేసి టింగురంగా మంటూ వెళ్ళి ఇది కాలేజీ చదువులు వెలగబెట్టకపోతే ఎవరి కొంపలు మునిగిపోతాయి? పడుచు పెళ్ళాంమీద మోజుతో నీకు కళ్ళు మూసుకుపోయాయే? రేపది నీ మాట వింటుందా? నెత్తినెక్కుతుంది. అనుభవించుదువు గాని."

"అమ్మా! ఎక్కేది నా నెత్తే కదా? నీ కెందుకు బాధ? ఆ సంగతి నేను చూసుకుంటాను. ఇక పసిదానిమీద నీ కంత ప్రేముంటే స్వయాన నాయనమ్మవే కదా! జాగ్రత్తగా చూసుకో. రెండేళ్ళంతలో గడుస్తాయి?"

"అనుకుంటూనే వున్నాను. ఈ టక్కులాడి తిప్పుకుంటూ వూరంతా తిరిగి వస్తుంటే ఆ పిల్లదాని చాకిరీ నామీద పడుతుందని. ఇదుగో! ఇప్పుడే చెప్తున్నాను. ఇన్నాళ్లు మీ కందరికీ చేశాను. మీ పిల్లలకి కూడా చాకిరీ చెయ్యటం నా వల్లకాదు. ఒక్క రోజు కూడా ఆ పిల్లదాన్ని నేను చూడను."

"చూడకపోతే పోనీగాని నీవు కాస్త నోరు అదుపులో వుంచుకోమ్మా! ఇన్నేళ్ళొచ్చి అసహ్యంగా, అలగాజనంలాగ, టక్కులాడి వగలాడి అనే మాటలేమిటి? మరోసారెప్పుడు ఇలాంటి మాటలు విన్పించటాన్కి వీల్లేదు. సిరీ! సినిమాకి వెళ్దాంపద వాణిని తయారుచెయ్యి" సుధాకర్ శ్రీనిజ చెయ్యి పట్టుకుని తమ గదిలోకి తీసుకెళ్ళి అన్నాడు

"సిరీ! ఈ రెండేళ్ళు నీకు ముళ్ళ బాటలాగా వుంటుదేమో! నాకు చేతనైనంత సహాయం నేను చేస్తాను. అయినా చాలా కష్టపడాలి నువ్వు. "కృషి వుంటే మనుషులు ఋషులౌవుతారు, మహాపురుషులౌతారు" అదే వాక్యాన్ని పదే పదే గుర్తుచేసుకో అది నీకు నైతిక బలాన్నిస్తుంది."

సుధాకర్ గుండెలపై తలవాల్చుకుని అక్కడ విన్పిస్తున్న అతని హృదయానికి ప్రేమార్ద్రమైన మనసుతో నిశ్శబ్ద వాగ్దానం చేసింది, "సుధా! మీ వంటి ఉన్నతమైన వ్యక్తిని మరొకర్ని చూడబోనేమో! నా ప్రాణం పోయినా మీ మనసు కష్టపెట్టను."

క్లాసులు మొదలయ్యాయి. శ్రీనిజ ప్రతి రోజు ఉక్కిరి బిక్కిరైపోయేది. ప్రొద్దున్నే వాణి అవసరాలు చూడటం, ఇంటిల్లపాదికీ వంట, టిఫిను చెయ్యటం తను తయారయి వెళ్ళటం. శేషమ్మ ఎప్పుడూ పెత్తనాలకి వెళ్ళిపోవటమో! ఏదో నెప్పని మూలగటమో! ఏదీ లేకపోతే సాధించటం ఇంత చేసినా సంతృప్తిలేని కింద పిల్లల సతాయింపు "ఒదినా! ఈ ఉప్మా తగలేశావే? ఇది నువ్వే తిని నాకు ఆమ్లేట్‌వేసి ఇవ్వు." ఆర్డర్లు జారిచేసే విజయలో ఆడ లక్షణాలే కన్పించవు.

"ఒదినా! నీకూతురో మహంకాళి. నా పెన్నుతో ఆడి ఎక్కడో పారేసింది. చూసివ్వు! లేపోతే నీ పెన్నివ్వు." ఇలాటి విషయాలన్నీ మహేష్‌కి సరిగ్గా శ్రీనిజ కాలేజి కెళ్ళబోయే సమయానికి గుర్తొస్తాయి. వాళ్ళనేమైనా అంటె శేషమ్మ శరవేగంతో వచ్చేసి కోడల్ని నానా మాటలూ అనేసేది.

దాదాపు ప్రతి రోజూ శ్రీనిజ లేటే! ప్రాక్టికల్ క్లాసులో కాళ్ళు ఫడిపోయేలా నించుని వస్తే అందరి సేవా మళ్ళీ మొదలు. క్లాసులో విన్నదే, లీజర్ అవర్స్‌లో అక్కడ చదువు కొన్నదే తప్ప ఇంట్లో పుస్తకం ముట్టుకునే ప్రాప్తమూ లేదు శక్తి ఉండదు శ్రీనిజకి,

ఒకరోజు సాయంత్రం శ్రీనిజ ఇంటికి వచ్చి తన గదిలో కూతురుతో ఆడుకుంటోంది. నానమ్మ చేతులు పైటచెంగులో దాచుకొని అటూ ఇటూ చూసుకుంటూ వచ్చింది. గదిలోకి రాగానే తలుపువేసి చెయ్యి చాచింది. అందులో పంచదార లడ్డూలు రెండున్నాయి.

"అదేమిటి నానమ్మా!" ఆశ్చర్యంగా అడిగింది శ్రీనిజ

"వాళ్ళు రోజూ నువ్వెళ్ళాక ఏమేంటో టిఫిన్లు చేసుకుంటారమ్మా! స్టోరు రూములో పెట్టి తాళమేస్తోంది. మీ అత్త ఆ లలితమ్మకి ఒకటి తగిలించి మరీ చెప్తారు, నీకు చెప్పొద్దని. ఈ రోజు నా మనసాగక నీకోసం ఇది తీసి దాచాను. తినమ్మా!"

శ్రీనిజ కళ్ళు తడిశాయి ఏమికాని పనిమనిషి కున్న ఆత్మీయతలో, మానవత్వంలో వందో వంతు లేదు తన అత్త శేషమ్మకి. తను శత్రువు కాదే! స్వయాన కొడుకు భార్య. ఎందుకిలా చేస్తుంది?

చాచిన నానమ్మ చెయ్యి మూసేసింది శ్రీనిజ.

"నానమ్మా! నువ్వెంత మంచిదానివి! కాని ఇలా ఎప్పుడూ చెయ్యకు. ఈ తిండి లేకపోతే నా కండ కరిగిపోదు. వాళ్ళనే తిననియ్యి నానమ్మా! వాళ్ళు రహస్యంగా చేసుకొని దాచుకొన్నది నేను దొంగతనంగా తిని వాళ్ళతో సమానమైపోలేను." నానమ్మ ఏం మాట్లాడకుండా వెళ్ళిపోయింది. ఆ తరువాత నాలుగైదు రోజుల్నించీ రెండు రోజులకోసారి సుధాకర్ స్వీట్స్ పాకెట్ తెచ్చి ఇంట్లోకి రాబోయే ముందు కిటికీనుంచి తమ ట్విన్ బెడ్‌మీదకి విసిరేసి ఇంట్లోకి వచ్చేవాడు. ఎందుకిలా చేస్తున్నారని శ్రీనిజ ఎన్నిసార్లడిగినా సుధాకర్ కారణం చెప్పలేదు.

దిన దిన గండంగా ఫస్టియర్ పూర్తయింది. సెకండియర్‌లో ప్రతిరోజూ మొదటి క్లాసు ప్రొఫెసర్‌ది. ఆయనకి లేటుగా ఎవరైనా వస్తే విపరీతమైన కోపం. ఎంత ప్రయత్నించినా ఒకరోజు శ్రీనిజ ఆయన క్లాసుకి లేటుగా వెళ్ళవేవెళ్ళింది. గుమ్మం దగ్గిర నుంచుని లోపలికి రావటానికి పర్మిషన్ అడిగిన శ్రీనిజని తినేసేలా చూశాడాయన.

"మిసెస్ శ్రీనిజా! నువు లేటుగా రావటం వలన ఎంతమంది డిస్టర్బ్ అవుతున్నారో తెలుసా? నా లెక్చర్ కంటిన్యుటీ పోతుంది. మిగతా స్టూడెంట్సందరి అటెన్షనూ వేవర్ అవుతుంది. ఇన్నేళ్ళుగా చదువుకుంటున్నావు. ఈ చిన్న విషయం నీకెవరూ చెప్పలేదా? కమిన్! మీకందరికీ ఇదే నా రిక్వెస్ట్. లేటుగా వచ్చినవాళ్ళు దయచేసి నా క్లాసుకి రావద్దు.'

శ్రీనిజ ముఖమంతా ఎర్రగా కందిపోయింది. అతి ప్రయత్నంమీద ఏడుపాపుకుంది. అప్పట్నుంచీ దాదాపు రోజు విడిచి రోజు ఆయన క్లాసులు ఎగ్గొట్టటమే.

ఒక్కోసారి శ్రీనిజకి చెప్పలేనంత విరక్తి కలుగుతుంది. ఈ విధంగా చదివి ఏమి ఆనందం? మానిసారేస్తే పీడాపోతుంది అనుకునేది. అంతలోనే భర్త మాటలు గుర్తొచ్చి మనసు దృఢం చేసుకునేది.

ప్రొద్దున్న టిఫెన్ తినకుండా వచ్చేసిందేమో, వలయాలుగా తిరుగుతున్న ఆలోచనలతో సమంగా శ్రీనిజ తలకూడా తిరగసాగింది. నెమ్మదిగా కళ్ళ ముందు చీకటి ముసురుకుంది చిన్నగా చప్పుడు చేస్తూ ఆమె తల ముందున్న డెస్క్‌మీదకి వాలి పోయింది. ఒళ్ళంతా చెమటలు కారిపోతున్నాయి. ఖంగారుగా తలిమ్మా స్టూడెంట్సంతా ఆమె చుట్టూ చేరారు. ఎవరో డాక్టరు కోసం ఫోన్ చేశారు. మరెవరో కొంచెం నీళ్ళు ముఖంమీద చల్లి నీళ్ల గ్లాసు నోటి కందించారు. డాక్టరు వచ్చి హైపో గ్లైసీమియా అని గ్లూకోజ్ ఇంజెక్షనిచ్చారు. ఇద్దరమ్మాయిలు తీసుకెళ్ళి లాబ్‌లో బెంచిమీద పడుకోబెట్టి క్లాసుకి వెళ్ళిపోయారు.

మూసుకున్న కళ్ళనుంచి నీళ్ళు ధారలుగా కారసాగాయి. అలా ఎంతసేపు వుందో? తలమీద ఆత్మీయత నిండిన చెయ్యి పడటంతో కళ్ళు తెరిచింది. తెరవగానే కల్గిన ఆశ్చర్యంతో దాదాపు బెంచీమీద నుంచి కింద పడిపోయింది. ఎదురుగా ప్రొఫెసర్ గారున్నారు. ఆయన వారిస్తున్నా లేచి కూర్చుంది.

"శ్రీనిజా! బహుశా నేను కోప్పడతాననే భయంతో ఫెయింట్ అయివుంటావు. అవునా? ఇంతక్రితమే వసంత వచ్చి నీ గురించి నా కంతా చెప్పింది. నీకున్న ఓర్పు, పట్టుదల ఇంతవరకూ నేను మరే స్టూడెంటులోనూ, చూడలేదు. ఎప్పుడూ ధైర్యాన్ని కోల్పోకు. దేవుడు నీకు మేలుచేస్తాడు. లేటయినా నా క్లాసుకి రావడం మానెయ్యొద్దు. నా పర్మిషన్ అడక్కుండానే సరాసరి నీ సీటులోకి వెళ్ళి కూర్చో. ఇందాక టెస్ట్ బాగాచేశావు. విష్ యూ ఆల్ ది బెస్ట్."

కృతజ్ఞతతో మూగబోయిన శ్రీనిజ కంఠంలోనే ఆగిపోయాయి "థాంక్యూ సర్" అనే మాటలు. కళ్ళతోనే వ్యక్తీకరించింది. ప్రోత్సాహకరంగా చిరునవ్వు నవ్వి, ఇంటికి వెళ్ళి రెస్ట్ తీసుకోమని చెప్పి హుందాగా తన రూమ్‌వైపుకి సాగిపోయాడాయన.

శ్రీనిజ చదువాపేయ్యడానికి శేషమ్మ చేసిన ప్రయత్నాలన్నీ విఫలమయ్యాయి. కాలం నత్తలా నడిచినా ఫైనల్ పరీక్షలు రానే వచ్చాయి. మొదటి పరీక్ష అయింది. రెండవ రోజు పరీక్షకి తయారవు తోంది శ్రీనిజ. ఎనిమిదవుతున్నా నానమ్మ లేవలేదు. విసుక్కుంటూ లేపటానికెళ్ళింది. చేత్తో కుదపబోయి ఉలిక్కిపడింది. నానమ్మ ఒళ్ళు నిప్పులా కాలిపో తోంది. శ్రీనిజ గుండె ఝల్లుమంది. భయపడు తున్నంతా అయింది. రెండురోజుల్నించీ నానమ్మ రొంప, తలనొప్పి అంటూనే వుంది. ఈ రోజు స్పృహలేకుండా జ్వరం మొచ్చేసింది. ఇప్పుడు పరీక్ష కెళ్ళటమెలా? అంతా తన ఖర్మ. రెండురోజుల క్రిందటే సుధాకర్ స్టిక్ తేవటానికి బొంబే వెళ్ళాడు. అతనుంటే వాణిని ఎలాగోలా చూసుకునేవాడు. ఈ రోజు మధ్యాహ్నానికిగాని రాడు. తల్లి దగ్గర వదిలేద్దుమంటే వాణికి శేషమ్మ పుణ్యమా అని అమ్మమ్మ అలవాటవలేదు ఎంత బతిమాలినా రెండు రోజులు కూడా పుట్టింటి కెళ్ళనిచ్చేది కాదు.

భయపడుతూనే అత్తగారి దగ్గర కెళ్ళింది "అత్తయ్యా! నేను ఒంటిగంటకల్లా వచ్చేస్తాను మీరు కాస్త వాణిని.."

శేషమ్మ ముఖంలో విజయగర్వం తొంగి చూసింది. "నేను ముందే చెప్పలా? నీ కూతురి చాకిరీతో నా ప్రాణం తియ్యొద్దని. కుదురయిన పిల్లయితే పోనీలే అని చూసేదాన్ని. ప్రపంచంలో మీకేగాదా కూతురున్నట్లు పిచ్చగారం చేసి దాన్నెందుకూ పనికిరాకుండా చేశారు. నాలుగు గంటలు కాదు నాలుగు నిమిషాలు దాన్ని నేను సముదాయించలేను తల్లీ! నీ పాట్లేవో నువు పడు."

ఆశగా పెద్దాడబడుచు విజయ దగ్గర కెళ్ళింది "విజయా! వాణిని ఈ ఒక్కరోజు.."

"నువు మహారాణీలా కాలేజీ కెళ్ళొస్తుంటే నేను నీకు ఊడిగం చెయ్యాలాండి ఒదినగారూ! మా ఫ్రెండ్సందరం మార్నింగ్ షోకి వెళ్తున్నాం నేనుండను ఇంట్లో" శేషమ్మ కూతురి వైపు ప్రశంసాపూర్వకంగా చూచింది.

చివరి ఆశగా లలిత దగ్గరకెళ్ళింది "లలితా బంగారుతల్లివి కదూ? నేనొచ్చేవరకు వాణిని ఆడిస్తావా? నేన్నీకు మంచి ఫ్రాంకు కొనిపెడ్తాను?"

"ఓ అలాగే ఒదినా?" రెడీగా ఒప్పేసుకుంది లలిత. శేషమ్మకి ఒళ్ళు మండిపోయింది.

లలితకి సవాలక్ష జాగ్రత్తలు చెప్పి, వికాకు ఆందోళన నిండిన మనసుతో పరీక్షకి బయలుదేరింది శ్రీనిజ. పరీక్ష మొదలయింది. ఒక గంటన్నరయింది. మరో గంటన్నర వుంది. ఇంతలో వరండాలో ఏదో గొడవ వినిపించింది. అందరి తలలూ అటు తిరిగాయి. అటెండరు లలితను బయటకి తీసుకెళ్ళటానికి ప్రయత్నిస్తున్నాడు. లలిత వెనుగులాడుతోంది హడావిడిగా శ్రీనిజ లేవబోతుండగానే ఫ్యూను చేతుల్ని బలంకొద్దీ విదిలించేసి బాణంలా పరీక్ష హాల్లోకి దూసుకొచ్చేసింది "ఒదినా ఒదినా" అని అరుస్తూ. శ్రీనిజ గబుక్కున ఆ పిల్ల నోరు నొక్కేసి ఇన్విజిలేటర్‌కి సారీ చెప్పి బయటకి ఓ మూలకి లాక్కెళ్ళింది.






## కార్టూనిస్టులకు సూచనలు!

★ కార్టూన్‌లను మంచి డ్రాయింగు కాగితంమీద ఇండియన్ యింకుతో గీసి పంపాలి

★ ప్రతీ కార్టూన్ వెనుక కార్టూనిస్టు పేరు, చిరునామా ఉండాలి.

★ వ్యంగ్య చిత్రాలు ప్రస్ఫుటంగా సాధ్యమైనంతవరకూ వాటిపై 'వ్యాఖ్య' చదవటానికి ముందే నవ్వించేవిగా అర్థవంతంగా వుండాలి!

★ వ్యాఖ్య చిన్నదిగా క్లుప్తంగావుండాలి అక్షరాలు కుదురుగా మొదటిసారి చదివినప్పుడే అర్థం అవ్వాలి! కార్టూన్ మీద పేరూ వూరు అన్నీ రాస్తే అవి తిరస్కరింపబడే అవకాశాలుంటాయి.

★ సొంత చిరునామా గల తపాలా బిళ్లలు అంటించిన కవరుగల కార్టూన్‌లను త్రిప్పిపంపడంజరుగుతుంది దారిలో పోయేవాటికి మా బాధ్యతలేదు.

★ ఎన్నుకొన్న కార్టూన్‌లలో అన్నీగాక కొన్ని మాత్రమే ఒక్కోసారి వేసుకోడం జరుగుతుంది పరిశీలనకి ఐదారువారాలు పట్టవచ్చు.

★ పండుగల కార్టూన్‌లు – బాగా ముందుగా వాటి కవరు మీద ఆ "ప్రత్యేక" సందర్భాన్ని పేర్కొంటూ పంపడం అవసరం.

★ రంగుల కార్టూన్‌లు, పెన్సిలు బొమ్మలు, తెల్లకాగితంమీద వేసిన బొమ్మలు పంపవదని మనవి.

★ మా కార్యాలయానికి స్వయంగావచ్చి కార్టూన్‌లు అందజేసేవారు కూడా స్వంత చిరునామాగల స్టాంపులతికించిన కవరు జతచేయాలి. కాపీ కార్టూన్‌లు పంపరాదు.

– సం॥

## కేన్సర్ రోగులతో ప్రముఖుల ముచ్చట్లు

పశ్చిమ జర్మనీలో బవేరియా రాష్ట్రంలోని ఒక కేన్సరు ఆసుపత్రిలో కేన్సరు రోగులకు చక్కటి కాలక్షేపాన్ని ఏర్పాటు చేశారు. దేశంలోని ప్రముఖులను పిలిచి వారితో ముచ్చటించే కార్యక్రమాన్ని ఏర్పాటు చేశారు. ఈ కార్యక్రమాన్ని ప్రముఖ వైద్య పత్రికా రచయిత జార్జి ప్రేబర్ నిర్వహిస్తున్నారు. ఈ కార్యక్రమాల్లో పాల్గొన్న ప్రముఖుల్లో పశ్చిమ జర్మనీ ఛాన్సలర్ సతీమణీ శ్రీమతి లోకిస్మిట్, బవేరియా రాష్ట్ర ప్రధాని సతీమణి శ్రీమతి స్ట్రాస్‌కూడా ఉన్నారు. మరో 380 మంది సినిమానటులు, రంగస్థలనటులు, టెలివిజన్ నటులు కూడా ఈ కార్యక్రమాల్లో పాల్గొన్నారు. శ్రీ జార్జి ప్రేబర్ సునిశితమైన రచయిత. అయితే ఆయన ఈ కార్యక్రమంలో వినోదానికే ప్రాముఖ్యతనిస్తున్నారు. జీవితంలో హాస్యం లేకపోవడం కూడా ఒక వ్యాధేనని ఆయన భావిస్తారు. ఈ కార్యక్రమాల ద్వారా సేకరించిన నిధులను కేన్సరు నివారణ నిధికి అందచేస్తారు.

## సజాతి ధ్రువాలు

"ఏమిటి" చెయ్యి తీసి అడిగింది. ఆమె గుండెల సవ్వడి వరండా అంతా మార్మోగుతోందా అన్నంత వేగంగా కొట్టుకుంటోంది.

"ఒదినా వాణి మరి వాణి బాత్‌రూమ్‌లో .." ఏడుపు లంకించుకుంది లలిత.

"వాణికేమయింది చెప్పు లలితా" గట్టిగా కుదిపింది,

వెక్కుతూ చెప్పింది. వాణికి నీళ్ళంటె చాలా ఇష్టం. బాత్‌రూమ్‌లో సిమెంట్‌తో నీళ్ళకోసం కట్టిన తొట్టి వుంది. ఎప్పుడూ అక్కడకెళ్ళి ఆడుతూ వుంటుంది. ఈ రోజు కూడా అలాగే వెళ్ళింది. లలిత వీధిలో తన ఈడు పిల్లలతో ఆడుకుంటూ వాణి సంగతి మరిచిపోయింది. వాణి తీరా బయటకి రావటాన్కి ప్రయత్నించినపుడు బోల్టు తియ్యటం చేతకాలేదు కాబోలు, లోన్నుంచి తలుపులు బాదుతూ గెంతుతూ ఏడవటం ఆరంభించింది. కాలుజారింది కాబోలు వెనక్కి పడిపోయింది. పడిన శబ్దం విన్పించగానే ఏడుపు ఆగిపోయింది. వెంటిలేటర్ నుంచి చూసేసరికి కదలిక లేకుండా పడివుంది. ఇదీ సారాంశం : లలిత ఖంగారుగా శేషమ్మని వెలికి తీసుకొచ్చింది. ఆవిడే ఆటో తెచ్చి అడ్రసు చెప్పి లలితనిక్కడికి పంపించింది.

శ్రీనిజ మళ్ళీ క్లాసులోకి వెళ్ళనే లేదు. లలితని లాక్కెళ్ళి ఆటోలో కూలేసింది. ముందు వాళ్ల ఆటో మొబైల్ స్పేర్‌పార్ట్స్ షాపు దగ్గర కెళ్ళి అక్కడి కుర్రాడ్ని తీసుకొని ఇంటికెళ్ళారు. శేషమ్మ దీర్ఘాలు తీస్తోంది. కుర్రాడు బోల్ట్ మీద పని ప్రారంభించాడు. వెంటిలేటర్ నుంచి చూసింది. వాణి చలనం లేకుండా పడివుంది. ఒక పావు గంటలో షాపు కుర్రాడు బోల్టుకున్న స్క్రూ మేకులన్నీ లూజుచేసి తలుపు తీశాడు. ఒకంగలో వెళ్ళి వాణిని తీసుకుంది. వెనక్కి తిప్పిచూసింది. తల వెనక భాగంలో మెడపైగా తగిలినట్లుంది. అక్కడంతా నల్లగా అయిపోయింది. వాణిని భుజం మీదేసుకొని పిచ్చిదానిలా బయటకి పరిగెత్తి కన్పడిన ఆటోలో ఎక్కేసి ఫామిలీ డాక్టరు అడ్రెసు చెప్పింది.

వాణిని పరీక్షించి డాక్టరు పెదవి విరిచాడు. "తల వెనుక భాగంలో గట్టి దెబ్బతగిలింది. కంకషన్ అనుకుంటున్నాను. ప్రాణంపోయి అరగంటవుతుందేమో"

తను అనుమానించిందే డాక్టర్ కన్‌ఫర్మ్ చేశాడు. అప్పటి వరకూ బలవంతాన కూడ గట్టుకుంటున్న ఆత్మ నిగ్రహం సడలిపోగా వాణి శరీరంమీద వాలిపోయింది.

మినార్ ఎక్స్‌ప్రెస్‌లో దిగిన సుధాకర్ విషయం వింటూనే డాక్టరు దగ్గరకు వచ్చేశాడు. ఎవరికి ఏమొచ్చినా ఆ డాక్టరే! అందుకే అక్కడికిపరిగెత్తాడు. అక్కడ వాణి ఒక బల్లమీద, శ్రీనిజ ఒక బల్లమీద చలనం లేకుండా పడుకుని వున్నారు. సుధాకర్ పిచ్చిగా ఇద్దరి వంకా మార్చిచూశాడు.

డాక్టరు సుధాకర్ భుజంమీద చెయ్యి వేసి చెప్పాడు. "అబౌట్ వాణి, అయామ్ సారీ! శ్రీనిజకి సెడేషన్ ఇచ్చాను. ఈ రోజంతా లేవకుండా రెండు మూడురోజులు ఇలా వుంచటమే మంచిది. ఆవిడ్ని హాస్పటల్లోనే వుంచెయ్యండి. ఇంట్రావీనస్‌గా ఫ్లూయిడ్స్ ఇవ్వాలి."

సుధాకర్ శ్రీనిజ దగ్గరకెళ్ళాడు. తెల్లగా పాలిపోయివున్న ఆమె ముఖాన్ని గుండెలకి హత్తుకున్నాడు. "సిరీ నన్ను క్షమించు. ఇదంతా నా మూలంగానే" అతని గొంతు పూడుకుపోయింది. సరిగా పడుకోబెట్టేసి డాక్టరువైపు తిరిగాడు. "డాక్టర్ ఒక అరగంటలో వాళ్ళ అమ్మగార్ని హాస్పటల్‌కి పంపుతాను. అంతవరకు .."

"డోంట్ వర్రీ గో అహెడ్."

వాణిని భుజాన్నేసుకుని లోనకొస్తున్న కొడుకుని గుమ్మంలోనే ఎదుర్కొంది శేషమ్మ. "ఏమన్నాడురా! డాక్టరు? అదేదీ? వెళ్ళేటప్పుడు ఏ డాక్టరు దగ్గర కెళ్తుందో ఒక ముక్కచెప్పి పోతే దాని సొమ్మేంపోతుంది. ఒళ్ళంతా పొగరే దానికి. అయినా సంసారికి చదువులేమిట్రా అని నేను మొత్తుకుంటూనే వున్నాను."

"అమ్మా! నువ్వు నోరుముయ్యకపోతే నీ పీక నొక్కి చంపేస్తాను. నీలాంటి ఆడది నిజంగా భూదేవికే భారం. అది నీకేం అపకారం చేసింది? దాన్నిలా వెంటాడి వేటాడావు? నానమ్మ నాకు చెప్తూనే వుండేది. కాని ఇంత రాక్షసత్వం నల్లుర పిల్లల్నికన్న నీలో వుంటుందనుకోలేదు."

తన గదిలోకి వెళ్ళిపోయి వాణిని సున్నితంగా పరుపుమీద పడుకోబెట్టాడు. అతని కళ్ళల్లోంచి కారే నీళ్ళు వాణి ముఖాన్ని అభిషేకిస్తున్నాయి. అంత విచారంలోనూ అతనికి తను చిన్నప్పుడు చదువుకున్న సైన్సు పాఠం గుర్తొచ్చింది. "సజాతి ధృవములు వికర్షించుకొనును. విజాతి ధృవములు ఆకర్షించుకొనును."



# న్యూట్రమూల్ శక్తి.

## ఛాంపియన్లు ఎంచుకునేది యిది.

న్యూట్రమూల్. సమృద్ధి అయిన అమూల్ పాలు. ఎంచిన మాల్ట్, ఆరోగ్యాన్నిచ్చే విటమిన్లు, పుష్టినిచ్చే ప్రోటీన్లు. అత్యవసరమైన ఖనిజాలు. ఉల్లాసాన్నిచ్చే చాక్లెట్... యివన్నీ గూడా బోర్న్‌విటా, బూస్ట్, మాల్టోవా కన్నా చాలా తక్కువ ధరలో. మరో విషయం గుర్తుంచుకోండి, కేవలం న్యూట్రమూల్‌కే ఐ ఎస్ ఐ నాణ్యతముద్ర వుంది.







**మరింత పొడుగ్గా, బలంగా, పుష్టిగా అవడం ఎలా?**

కనివిని ఎరుగని శక్తినిచ్చే పుస్తకపు కానుక!

TO Nutramul, P O Box 10148, Bombay 400 001 nn

ప్రియమైన న్యూట్రమూల్,

దయయుంచి నాకు దారాసింగ్ గారి 'హైట్ ఇన్‌క్రీజ్ స్ట్రెంగ్త్ అండ్ ఫిట్‌నెస్' పుస్తకం పంపించండి. నేను రు. 1-50 పోస్టేజీ స్టాంపులూ, న్యూట్రమూల్ 500 గ్రా. డబ్బా కొన్న క్యాష్ మెమోనీ జతపరుస్తున్నాను. సరుకు సరుకు వున్నంతవరకే యీ కానుక అని నాకు తెలుసు.

పేరు __________ (పెద్ద అక్షరాలలో)

అడ్రసు __________

మార్కెట్ చేయువారు:
గుజరాత్ కో-ఆపరేటివ్ మిల్క్ మార్కెటింగ్ ఫెడరేషన్ లి.
ఆనంద్ 388 001.



daCunha/GCM/76/TL/82




# దేముడున్నాడు

గుమ్మా నిత్యకళ్యాణమ్మ

పురుషుల్లో ఉత్తములు, మధ్యములు, అధములు అనే మూడురకాల వారుంటారు. అలాగే విద్యార్థుల లోనూ మూడు రకాల వారుంటారు అంటాడు సుబ్బారావు.

సుబ్బారావు అప్పారావు ఒకే కంచంలో తింటూ ఒకే మంచంలో పడుక్కుంటూ, ఒకే రూంలో వుంటున్నా ఉత్తర దక్షిణ ధృవాల వంటి వారు.

సుబ్బారావు అభిప్రాయంతో అప్పారావు ఏకీభంచలేదు. "కాదు విద్యార్థులలో రెండు తెగలే" అంటాడు అప్పారావు. "ఒకరు పరీక్షలు పాసవ్వాలనే ధ్యేయం కలవారు, తప్పినా ఫరవాలేదు అనుకునే వారు" అని అతని వాదం.

"అక్కడే పొరపాటు పడుతున్నావు. సామదాన బేధోపాయాలలో ఏదో ఒక వుపాయం ద్వారా పాసవ్వాలనే అనుకుంటాడు ప్రతీ విద్యార్థి. సంసత్సరం పొడుగునా క్లాసులకి వెళ్తూ శ్రద్ధగా చదివి అర్థం కాని విషయాలు టీచర్ల ఇళ్లకు వెళ్లి తెలుసుకుని పగలూ రాత్రి బట్టీపట్టీ పాసయ్యే వాళ్లు. వీళ్లకు మరోలోకం చదువు మా లోకం తప్ప. కాబట్టి వీళ్లు అధములు. వీళ్లంత కాకపోయినా ఏవో నాలుగు ఆన్సర్లు కంఠతాపెట్టి పాసయ్యేవాళ్లు మధ్యములు. వీరికి రాంకు రాకపోయినా పాసుకావడం తథ్యం. ఇక ఉత్తములున్నారే వాళ్లు తామరాకు మీద నీటిబొట్టు లాంటి వారు. కాలేజీలకు క్లాసులకు వీలుంటే వెళ్తారు, అంటే మంచి సినిమాలు గ్రటా లేకపోతే. పరీక్ష కోసమని ఎలాంటి ప్రయత్నాలు చెయ్యరు. ఫారిన్ ఎయిడ్ వలనో, కాపీ కొట్టో పాసుకాలేమా అని ధీమాగా వుంటారు. డిగ్రీ రావడమే ముఖ్యం కాబట్టి ఏడాదల్లా చదవడం వృధా అనేది ఈ ఉత్తముల లక్షణం" సుబ్బారావు తన వాదాన్ని బలపరుస్తాడు.

అప్పారావు మూడుమార్లు దండయాత్రలు కొట్టి పట్టు విడవని విక్రమార్కుడిలా నాలుగోసారి బీకాం చదువుతున్నాడు. సుబ్బారావుకి అంత అనుభవం లేదు అయితే అతనూ అదే పరీక్ష యిస్తున్నాడు.

ముందు రాసిన పరీక్ష వలన రిజల్టు ఎటూ తెలిసిపోయింది కాబట్టి ఆఖరి రోజు పరీక్ష రాయక పోయినా నష్టం లేదని అప్పారావు అప్సరాలో ఆంగ్ల పిక్చరు రెండో ఆట చూసొచ్చి లైటార్పి పరవశంగా పవ్వళింపుసేవ చేస్తున్నాడు. భారతదేశ ప్రభుత్వమే పంచవర్ష ప్రణాళికలను అమలు జరుపుతున్నప్పుడు ఆదేశ పౌరుడైన తాను బీ. కాం పంచవర్షాల్లో పూర్తి చేయగలుగుతే నవ్విపోయేది ఎవరు? అథవా నవ్వుతారా వాళ్ళు పుచ్చిపళ్ళే కనుపిస్తాయి, తనవి కావు.

సుబ్బారావు ఆ సమయంలో అటు సినిమా హాలులోనూ లేడు ఇటు రూంలోనూ లేడు.

పక్కవాడి పరోపకారం వలన ఒక పేపరు, ఫారిన్ఎయిడ్ సహాయంతో మరో పేపరు ఒక మోస్తరుగానే రాసాడు. మూడో పేపరే కొంచెం ఇబ్బందిగా వుంది. రోజులన్నీ ఒకే లాగుంటే ఎలాంటి ధోకా వుండదు ఖర్మ కాలిందే అనుకోవాలి. ఇంత కాలం కుంభకర్ణుడిలా నిద్రపోతున్న యూనివర్శిటీ వాళ్ళు అమాంతంగా కళ్ళు తెరచారు. పరీక్షలలో అవినీతి ప్రబలి పోతున్నాది. ప్రతి విద్యార్థి గైడ్లు పక్కన పెట్టుకునో, పక్కవాడి నుంచి కాపీకొట్టో, బయట నుంచి రడీమేడ్ ఆన్సర్లు తెప్పించో పరీక్షలు రాస్తున్నట్లు నిద్ర మేల్కొన్న యూనివర్శిటీ వాళ్ళు గ్రహించారు. స్పెషల్ స్క్వాడ్‌లు పరీక్షా కేంద్రాలకు పంపుతున్నట్లు, పోలీసుల సహాయం తీసుకోబోతున్నట్లు ప్రకటించారు అవినీతికి పాల్పడే విద్యార్థులను మూడు సంవత్సరాల వరకు పరీక్షలకు కూర్చోనివ్వం అని ఎనౌన్సు చేసారు సుబ్బారావు ప్రక్కవాడు బెంబేలు పడిపోయాడు పరుగు పరుగున సుబ్బారావు దగ్గరకొచ్చి "అయ్యో! సుబ్బారావుగారో! ఇవి చేతులు కావు కాళ్ళు" అని అంటూవుండగా "నీకేం మతిలేదా! ఇవి చేతులేనయ్యా కాళ్ళు కావు రేపొక్కరోజు గడిచే వరకు మతిపోగొట్టుకోకు ఆ తర్వాత నీ దారి నీది" అందామనుకుంటూవుండగా "బాబూ! రేపు మీరు నా పక్కకు కాని నా పేపర్ పక్కకు కాని చూడకండి. లేకుంటే నా చదువు నట్టేట మునిగిపోతుంది మా నాన్న నామీద ఎన్నో ఆశలు పెట్టుకున్నాడు" అంటూ ఏడ్చినంత పని చేసి చివరకు ఏడ్చేసాడు.

అన్నీ సవ్యంగా వుండి ఆఖరిరోజు పరీక్ష కూడా ఎవరిదో ఒకరి సహాయంతో ఒక మోస్తరుగారాస్తే ఆ పైన మోడరేషను బోర్డు వారు కనికరించి ఒకింత సహాయం చేయకపోతారా? తను సుబ్బారావు బి.కాం. అనే బోర్డు తగిలించుకొని నిరుద్యోగుల లైనులో చేరిపోయి ఎంప్లాయిమెంటుఎక్చేంజి చుట్టూ రోజూ ప్రదక్షిణాలు చేయవచ్చునని పొంగిపోయిన సుబ్బారావు పరిస్థితులను అర్థం చేసుకొని నీరసించుకుపోయాడు మరి యిప్పుడు గట్టెక్కడం ఎట్లా? ఏడాదిలో ఏదు పిరియడ్లు కూడా ఎటెండుకాలేదు. వెధవ సినిమాలవలన చదవడానికి టైము దొరకలేదు సినిమాలదా అసలు తప్పు— లంచనుగా జీతాలందగానే తనకు డబ్బు పంపే తండ్రిది కాదూ అసలు తప్పు?

మామూలుగా అయితే అతను సాయంత్రాలు ఆడపిల్లల అందాలను వీక్షించడానికి బజారు వెంట తిరిగేవాడు. ఆ రోజు ఆ కార్యక్రమాన్ని కూడా రద్దు చేసుకొని పేపరు లీక్ అయి వుంటుందన్న చివరి ఆశతో ఆ బజారూ ఈ బజారూ కాలిన పిల్లిలా తిరిగాడు. ఫలితం లేకపోయింది. రాత్రంతా శివరాత్రి చేసైనా చదువుదామనుకుంటే 'వన్‌డే సీరీస్ గైడు' ఏ దుకాణంలోనూ దొరకలేదు ఔటాఫ్

స్టాకు. సుబ్బారావు పరిస్థితి అర్థం చేసుకున్న ఒక షాపువాడు కనికరించి "రేపు రండి తెప్పించి వుంచుతాం" అన్నాడు, రేపేం చేసుకుంటాడు ? రేపు దాని విలువ చిత్తు కాగితాలపాటి చెయ్యదు.

'ఈ పేపర్లో జీరో. వెరశి పరీక్షా ఫలితాల పేపర్లో తన నంబరు ఔట్ ! ఏడాది చదువూ వ్యర్థమౌతుంది.' అనుకున్నాడు సుబ్బారావు. అనుకోవడమేనా బాధపడిపోయి ఆ మాటే సాయంత్రం అప్పారావుతో అననూ అన్నాడు.

"ఒరే! అబ్బీ! పరీక్షపాసై మాత్రం ఏం చేస్తావురా ? నిరుద్యోగుల జాబితాలో చేరి ప్రయోజనం ఏంటి ? కిరసనాయిల్ క్యూలోలాగ యిప్పటికే లక్షల మంది వున్నారు. అందువలన ఉద్యోగం దొరికే ఛాన్సులు నిల్లు. పోనీ పై చదువులకు పోవాలనుకుంటున్నావా ? థర్డుక్లాసులో పాసయ్యే నీకు ఏ కాలేజీలో సీటు దొరుకుతుంది. మంత్రులు సామంతులు డోనేషన్లు ఇచ్చే వారు ఇందరుండగా నిన్ను అసలు కాలేజీ కాంపస్‌లోనికి రానిస్తారా ? నా మాట విని ఆ పేపరైనా పాడు చేసి మరో ఏడు స్టూడెంటుగా వుండిపో. 'ఉద్యోగం సద్యోగం లేకుండా మూడు పూటల్లా రోడ్లు సర్వే చేస్తావా ? వెధవా!' అని మీ నాన్న చేత చీవాట్లు తినే యోగం తప్పడమే కాక నెలనెలా నీ భరణం డబ్బులు మరో ఏడాది ముడతాయి. పరీక్షకేముంది మార్చి కాకపోతే సెప్టెంబరు వుండనే వుంది. అందులోనూ తప్పావా తిరిగి మార్చి వస్తుంది. ఇలా మార్చిలోనూ సెప్టెంబరులోనూ దివ్యంగా రాయొచ్చు. అడ్డేవాడెవడు ? ఏదో ఛాన్సులో నీ పుణ్యం పుచ్చిపోవచ్చు మరో సంగతి. సావధానంగా విను. ఇప్పుడే పాసై నిరుద్యోగి అయ్యేకంటే మరికొన్ని ఏళ్ళు తరువాత పాసై నిరుద్యోగుల లైనులో చేరితే నిఖరంగా ఒక లాభం వుంటుంది. మన సీనియర్లు నిరుద్యోగ భత్యం కావాలని ఆందోళన చేస్తున్నారు. నీవు ఇపుడే వాళ్ళతో చేరితే ఇటు పోలీసు కాల్పుల్లో కాలో చెయ్యో విరిగే యోగమో లేదా అటు శ్రీకృష్ణ జన్మస్థాన యోగమో వుంటాయి. ఈ సద్దుమణగనీ! ఎటూ రెండు మూడేళ్ళలో ప్రభుత్వం వాళ్ళ డిమాండు ఫుల్‌ఫిల్ చేస్తుంది. అంచేత ఆ భరణం ఎనౌన్స్ అయ్యేవరకు మార్చిలు సెప్టెంబరులు కానిచ్చేయ్. అలాగైతే అంతవరకు నీ తండ్రి పంపే భరణం ఆ తరువాత ప్రభుత్వం ఇచ్చే భరణం అందుతాయి. లేదా రెండిటికి చెడ్డ రేవడివవౌతావు తెలుసుకోరా శుంఠా!" అన్నాడు అపర శ్రీకృష్ణ పరమాత్ముడి పోజులో

విద్యార్థులలో ఉత్తముడి కుండే లక్షణాలు తనకున్నాయని కాకపోయినా అప్పారావు చెప్పే రెండో తెగకు తాను చెందనని భావించే సుబ్బారావుకి అతని సలహా రోగికి వైద్యుడిచ్చిన మందులా చేదుగా వుంది.

అయ్యా! ఇదంతా కథకు ఉపోద్ఘాతమే! ఉపోద్ఘాతంలో కొంత కథ నడిచినా లేదా మీకు కథ కొంతవరకు అర్థమైనా అసలు కథ ఇది కాదు.

శీర్షికను మీరు గమనించే వుంటారు. పోనీ మరోమారు చూడండి. 'దేముడు ఉన్నాడు!'

దేముడు లేడూ ?

లేకేమండి. మహారాజు లాగున్నాడు. అయితే మీకూ నాకూ కనిపించడు. అయినా దేముడున్నాడు, అతను సర్వాంతర్యామి అంటారు అందరూ అంటారో లేదో కాని ప్రహ్లాదుడనే భక్తుడు తండ్రితో ఆ మాట చెప్పినట్లు భాగవతాన్ని రాసిన బమ్మెర పోతన్నగారు అన్నారట అని మా అమ్మమ్మ చెప్పేది.

దేముడు వున్నాడు అనే సత్యం సుబ్బారావుకి ఆ అర్ధరాత్రి తెలిసింది. తెలిసింది అనే కంటే ఆ సత్యాన్ని ఆలకించాడు అని చెప్తే కరక్టుగా వుంటుంది. అదెలాగంటే గైడ్లకోసం తిరిగి తిరిగి వేసారి యింటికొస్తూవుంటే 'దేముడు భక్తుల పాలిట ఆపద్బాంధవుడు, చెయెత్తి మొక్కితే కోరికలు తీరుస్తాడు, అని హరికథ చెప్తున్న దాసుగారి పలుకులు సుబ్బారావు చెవుల్లో దూరాయి. ఇంకేం రాముడున్నాడు అనుకున్నాడు సుబ్బారావు

అలా అనుకున్న సుబ్బారావు బుర్ర గబ గబా పని చేసింది. అమాంతంగా ఒక బ్రహ్మాండమైన ఆలోచన తట్టింది.

'రామా ! నారాయణా ! వెంకటేశ్వరా ! శివా ! ఆంజనేయా !' అని మనసులోనే మననం చేసుకొని 'నన్ను పరీక్ష గట్టెక్కించే భారం నీదే స్వామీ' అన్నాడు గట్టిగా.

త్వరత్వరగా రూంకి చేరుకున్నాడు.

అప్పారావు గురకలు పెడుతూ నిద్రపోతున్నాడు.

దీపం వేయగానే అతని మనసులా గదంతా వెలిగిపోయింది. ఎప్పుడో చిన్నప్పుడు చదివిన సామెత 'గాలిలో దీపం పెట్టి దేముడా నీదే భారం' అంటే దీపం ఆరిపోకుండా ఆ భగవంతుడు కూడా చేయలేడట' గుర్తు కొచ్చింది. మానవ ప్రయత్నం వుంటేనే భగవంతుడు సహాయం చేసేది. వెంటనే రేపు జరగబోయే పరీక్ష సంబంధించిన పుస్తకం తీసాడు.

పుస్తకం భూతంలాగ, అందులోని అక్షరాలు రాక్షసుల్లాగా కనిపించాయి. ఈ పుస్తకాన్ని ఇన్నాళ్ల వరకు తెరిచిన పాపాన బోలేదు. ఇన్ని పేజీల పుస్తకంలో ఏ ఛాప్టరు చదవడం ? చదివినా అర్థం ఔతుందా ? ?

'సుబ్బారావూ !'

"ఆఁ !" అన్నాడు సుబ్బారావు.

'సుబ్బారావు ! వింటున్నావా ?' తిరిగి అదే కంఠం.

"ఏంరా వెధవా ! ఏదీ చెప్పకుండా వింటున్నావా ? అని ఏమిటా ప్రశ్న?" అంటూ అప్పారావు వంక చూసాడు. ఆశ్చర్యం !! అప్పారావు ఈ లోకంలో లేడు. రావణాసురిడి తమ్ముడులాగ గురక మాత్రం వినిపిస్తున్నాది. వాడు తనని పిలిచాడా ? ఉహూ ! అసంభవం, మరి ఎవరు పిలిచారు ??

'నేనోయ్ నిన్ను పిలుస్తున్నది. అప్పారావు కాదు. ఆశ్చర్యపోతావే ?' అదే కంఠం.

మనిషి లేడు. కంఠం వినిపిస్తున్నాది కల కూడా కాదు, తాను మేలుకొనే వున్నాడు సుబ్బారావుకి భయం వేసింది.

పాఠ్యపుస్తకాలలో రాసింది జ్ఞాపకం రాకపోయినా కనీసం ఆంజనేయ దండకమైనా కంఠతా వచ్చి వుండవలసింది ఛీ ! అదీ తనకు రాదు. మరో గత్యంతరం లేక 'ఆంజనేయా !' అన్నడు గట్టిగా

నేపథ్యంలో అంతకన్నా బిగ్గరగా నవ్వు !

'ఒరేయ్ ! నేను పిలుస్తున్నాను నేను నీ అంతరాత్మను ! దయ్యాన్ని భూతాన్ని కాను'

"అంతరాత్మవా !? చచ్చాను ! ఇంకా ఏ దయ్యమోనని భయపడిపోయాను"

'నిజంగా దడుచుకున్నావా ? అంతరాత్మకే దడుసుకున్నావా ?'

"అంతరాత్మనని ముందుగా చెప్పావా ? చెప్పెట్టకుండా అర్ధరాత్రి అలాపిలుస్తే దడుసుకోనూ ? ఇంతకీ ఏమిటి నీ ఏడుపు ?"

'ఆ పుస్తకం నీకు అర్ధమౌతుందా ? రాత్రి చదివి అర్థం చేసుకొని రాయగలవా ?'

"కాదు . లేను . లేను ఏకంగా అన్ని ప్రశ్నలా ?"

'నేనొక చిన్న చిట్కా చెప్పనా ?'

"బాబ్బాబూ ! చెప్పి పుణ్యం కట్టుకో చచ్చి నీ కడుపున పుడతాను !"

'నా కడుపునా ? నువ్వూ నేనూ వేరా ? నేను నీ అంతరాత్మను'

"అదా ! అలా అనడం రివాజు. పోనీ చచ్చి నీ కడుపున పుట్టనులే !"

'అసలు నీకు చావాలని లేదు. నాకు తెలుసు'

"ఇంతకీ నీ చిట్కా ఏమిటి ?"

'దేముడు వున్నాడని నమ్ముతావా ?'

"ఉండే వుంటాడు. అయితే నాకెప్పుడూ కనుపించలేదు."

'ఎందుకు కనుపిస్తాడు ? కనుపిస్తే మీరు దేముణ్ణి బ్రతకనిస్తారా ?'

"ఇంతకీ నీవు చెప్పేదేమిటి ? విసిగించకు"

'అదే చెప్తున్నాను దేముడు సుఖాల్లో గుర్తు రాకున్నా కష్టాలలో తప్పకుండా గుర్తుకొస్తాడు నీకే కాదులే మానవులందరికీనూ అందుచేత ఈ పరీక్ష గట్టెక్కితే వాడికి ప్రసాదం ఇస్తానని దండం పెట్టుకో. పాపం ! అతను దీనదయాళుడు. భక్తుల కోరిక తప్పక తీరుస్తాడు. ఏం వింటున్నావా ?'

"అంతరాత్మవనిపించుకున్నావు. ఎంత చల్లటి మాట చెప్పావు."

సుబ్బారావు గట్టిగా కళ్ళుమూసుకుని గోడ వంక తిరిగి కళ్ళు విప్పాడు. గోడ మీద హిందీ నటి అర్థ నగ్న ఫొటో కనుపించింది. రామరామ అనుకుని కళ్ళు మూసుకొని ఎదురు గోడ వంక తిరిగి కళ్ళు విప్పాడు. ఆ గోడ మీద నిలువుటద్దంలో అదే ఫొటో నవ్వుతూ పలకరించింది. మళ్ళీ రామరామ అనుకొని కళ్ళు మూసుకున్నాడు. మరో పక్కకు తిరిగి గోడ వంక చూసాడు. ఈసారి తెలుగు తెర వెలుగుల తారామణి కేబరా డాన్సు పోజులో కనిపించింది. హరీ హరీ! అనుకున్నాడు.

'సుబ్బారావ్ ! ఇంక నీ సర్కసు ఆపు. మరే దిక్కూ చూడకు. విద్యార్థుల గదుల్లో సినీతారలు కాక దేముళ్ళుంటారా ? దేముడు గోడ మీద బొమ్మలోనే వుండనక్కరలేదు. ఇందుగలడందు లేడని సందేహం వలదు అన్నారు పెద్దలు. మనస్సులో ధ్యానించుకో చాలు' అంతరాత్మ తిరిగి పలికింది.

జ్ఞానోదయమైంది సుబ్బారావుకి.

''సింహాద్రి అప్పన్నా! ఈ సబ్జెక్టులో నాకు నాలుగంటే నాలుగు ప్రశ్నలకే జవాబులొచ్చు. రేపటి పరీక్షలో ఆ నాలుగు ప్రశ్నలు వస్తే నేను పాసౌతాను. ఈ భక్తుడి మీద దయ వుంచి ఆ నాలుగు ప్రశ్నలు వచ్చేటట్లు చెయ్యి. నా కోరిక నెరవేరుస్తే నీకు అయిదు కేజీల చక్రపొంగలి, పులిహోరా నైవేద్యం పెట్టిస్తాను. నువ్వు భక్తుల పాలిట కల్పవృక్షానివి. వరాల దేముడివి'' అన్నాడు.

''ఒరేయ్! అప్పన్నా అనకపోతే అప్పారావు అనలేవూ? చక్రపొంగలి పులిహోరెడరతావా!? సంతోషం!''

ఆశ్చర్యం! ఈ మాటలు అంతరాత్మవి కావు. మరెవరివి? దేముడు మాట్లాడుతాడా? అసలు కనుపించని వాడికి కంఠం వుంటుందా?? మరి ఈ విచిత్రానికి హేతువు ఏమిటి?

మంచం మీద లేచి బాసింపట్టు వేసుకు కూర్చున్న అప్పారావును సుబ్బారావు గమనించలేదు.

''ఒరే అప్పన్నా అంటే నాకు చెప్పలేనంత కోపం వస్తుందని నీకు తెలుసు. అయినా అలా పిలిచావు. చక్రపొంగలి, పులిహోరా పెడతానన్నావు కాబట్టి ఈ సారికి క్షమిస్తున్నాను'' అన్నాడు అప్పారావు. వాడు భుజం మీద చరిచి వుండకపోతే యింకా బోలెడు ఆశ్చర్యపోతూనే వుండేవాడేమో సుబ్బారావు.

''హరిని! నీకు కాదురా వెర్రిముగమా! నేను చక్రపొంగలి పులిహోరా ఆ సింహాద్రి అప్పన్నకు నైవేద్యం పెడతానని మొక్కుకుంటున్నాను.''

''ఏమిటి నువ్వు దేముడివి నమ్ముతున్నావా? బీ. సీ. లో పుట్టవలసిన వాడివి.''

''ఏం ఎందుకు నమ్మకూడదు? నేను ఆపదలో లేనా? నా పరీక్ష మాటేమిటి?''

''ఒరేయ్! పిచ్చి సన్యాసీ! అక్షరంముక్కరాని నిన్ను పరీక్ష ఎలా పాసు చేస్తాడురా దేముడు.''

''తప్పురా! దేముడ్ని అలా అనకూడదు. నాకు నాలుగు ప్రశ్నలకు జవాబులొచ్చు. ఆ నాలుగు ప్రశ్నలూ రేపు పేపర్లో వస్తే నేను పాసుకాలేనా? అందుకే నా ప్రార్థన'' అన్నాడు సుబ్బారావు.

భారం భగవంతుడి మీద వేసి, చదవవలసిన పుస్తకాన్నే తలగడగా చేసుకొని నిశ్చింతగా నిద్రపోయాడు సుబ్బారావు. అసలే బాదరబందిలేని అప్పారావు రెండో మారు ముసుగులో దూరేడు సినిమా హీరోయిన్ను కలలో కలవడానికి.

* * *

దేముడనేవాడు వున్నాడు. ఆతడు భక్తుల కోరిక తీరుస్తాడు అన్న నిదర్శనంగానో లేదా కాకతాళీయంగానో ఆ రోజు సుబ్బారావు తలపోసుకున్న నాలుగు ప్రశ్నలూ వచ్చాయి. సుబ్బారావు ఆనందం వర్ణనాతీతం.

మరో మారు సింహాద్రి అప్పన్నకు దండం పెట్టి గబ గబా తనకొచ్చిన ఆన్సర్లు రాసాడు. పేపరు మూడు గంటలదైనా రెండు గంటల్లో పూర్తి చేసాడు. ఇంకా గంట సమయం మిగిలింది.

తన కోరిక తీర్చిన దేముడి నైవేద్యం గురించి

## దేవుడు వున్నాడు

ఆలోచించడం మొదలెట్టాడు.

ఇంతకీ ఖర్చు ఎంత అవుతుందో!? కాగితం మీద లెఖ్ఖరాస్తే తెలిసిపోతుందిగా! జేబులు చూసాడు. కాగితాలు లేవు. మరెలాగ?

వాచర్ని సప్లిమెంటు కాపీ అడిగాడు. కావలసిన వస్తువులు గుర్తు తెచ్చుకొని 'పంచదార 25 రూపాయలు, బియ్యం పది రూపాయలు ...' వరుసగా వ్రాసాడు. ఆ తరువాత కూడాడు: నూరు రూపాయల చిల్లర.

'అమ్మో! నూరు రూపాయలే! ఆ డబ్బుతో పది సినిమాలు చూడొచ్చు'

'మరి నైవేద్యం పెట్టకపోవడం పాపం కాదూ? కలలో కూడా తలచుకొని భగవంతుడ్ని ఒక్కమారు అర్థించగానే తన కోరిక తీర్చాడే! మరి అతనికి పంగనామం ఎలా పెట్టడం?'

'భగవంతుడికి పెట్టే నైవేద్యం హోటల్లో చేసినట్లు కిస్మిస్‌లూ ఏలకులూ ఎందుకు?'

వాటిని కొట్టేసాడు. ఆరు రూపాయలు తగ్గాయి. ఇంకా ఎక్కువే!

'నెయ్యికి బదులు డాల్డా చాలు.'

మరో పది అదా అయింది.

> **ఆంధ్రపత్రిక**
> దినపత్రికలో
> * మన సినిమాలు
> * వింత యదార్థం
> శీర్షికలు
> చూస్తున్నారా?

'ఎనభై నాలుగు రూపాయలు మాత్రం ఎక్కువ కాదేమిటి?'

ఇంకా ఏమేమి తగ్గించవచ్చునో ఆలోచిస్తూ ఒక్కొక్కటికి కొట్టి వేయసాగాడు. ముప్పై అయిదు రూపాయలకు తగ్గింది. 'ఇది కొంత నయం. ముందు రాసినవన్నీ వుంచలేదు. ఎంతదండుగ!'

సుబ్బారావుకో అనుమానం వచ్చింది.

'దేముడు అంత తినగలడా? అసలు దేముడి పేరు చెప్పి తినేది పూజారి. పూజారికా తాను నైవేద్యం పెట్టేది? తినని దేముడికి అంతంత ఎందుకు? ఒక్కొక్క కేజీ చాలు. ప్రసాదానికి యింత అని కొలతా నియమంలేదు. భక్తితో ఎంత ఇచ్చినా సంతోషిస్తాడు. శ్రీకృష్ణుడికి కుచేలుడే మిచ్చాడు? గుప్పెడు అటుకులు. అందుకే ఫలం పుష్పం తోయం అంటారు.'

సుబ్బారావుకి ఒక దివ్యమైన అయిడియా వచ్చింది. 'రెండు అరటి పళ్ళు' నాలుగు పువ్వులు చాలు. రూపాయితో సరిపోతుంది.'

'ఇంతకంటే తగ్గించడం తప్పు' అనుకున్నాడు.

గంట కొట్టారు. వాచరు ఆన్సరు కాపీలు తీసుకుందికి వచ్చాడు. ఆన్సరు పేపరు వాచరు కందించి ప్రశ్నపత్రం, లిస్టు జేబులో పెట్టుకొని ఈల వేసుకుంటూ బయటకొచ్చాడు సుబ్బారావు బి.కాం.

అప్పారావసలు పరీక్షకే వెళ్ళలేదు. ఎలాగూ పోతుందన్న పరీక్షకు వెళ్ళడం అనవసరం అని.

''వండర్ ఫుల్! దేముడున్నాడురా!'' అన్నాడు రూములో అడుగుపెట్టి.

''ఏమిటీ! నీకు కనిపించాడా?'' అప్పారావు ఆశ్చర్యంగా అడిగాడు.

''కనుపిస్తే మనం బ్రతకనివ్వడుట! అందుకే కనుపించడు'' సుబ్బారావు అన్నాడు.

''మరి ఎలా తెలుసుకున్నావురా కనుపించని భగవంతుడున్నట్లు?''

''నీకు తెలుసుగా నిన్న అప్పన్నకు దండం పెట్టాను''

''నాకా? నిజంగా? ఎప్పుడురా పెట్టావు దండం?''

''జోక్ కాదురా! నిన్నరాత్రి సింహాద్రి అప్పన్నకు దండం పెట్టి నా కొచ్చిన నాలుగు ప్రశ్నలు పేపర్లో వస్తే, నైవేద్యంగా చక్రపొంగలి పులిహోరా పెడతానని అన్నాను. ఆ నాలుగు ప్రశ్నలూ వచ్చాయిరా! నేను యమగా రాసాను.''

''నిజం!''

''నిజంరా'' నువ్వూ దండంపెట్టి పరీక్షకు రావలసింది. నీది బేడ్ లక్కురా!'

''అయితే నీ దేముడు నిన్ను కరుణించే డంటావు. అయితే చక్రపొంగలి ప్రసాదంలో నాకూ వంతుందా?''

''అబ్బే! ఇప్పుడు ఆ ప్రోగ్రాం కేన్సిలురా! అసలు కనిపించని దేవుడు తింటాడా? దేముడి పేరు చెప్పి తినేది పూజారి. అందుకే ఒక్క రూపాయితో దేముడి ముడుపు చెల్లిస్తాను.''

''ఏడిసావ్‌లే! ఇంతకీ ఆ ప్రశ్నలొచ్చాయా? లేక కోతలు కోస్తున్నావా?''

''నిజంరా! నీ మీద ఒట్టు!''

''నన్ను చూడనీ పేపరు''

''ఇంద'' అంటూ జేబులోంచి పేపరు తీసి అప్పారావు కిచ్చాడు సుబ్బారావు.

''నిజమేరా! నేను నమ్మలేదు'' అని అప్పారావు ఆ రెండో కాగితం చూసాడు. ''ఒరేయ్! ఇదేమిరా!? నీ ఆన్సరు పేపరులాగుంది?''

''అదా! ఆన్సరు పేపరు కాదురా! ముందుగా ప్రసాదానికేం సరుకులు కావాలి? ఖర్చు ఎంత అవుతుందని లెఖ్ఖ రాయడానికి కాగితం లేక సప్లిమెంటరీ కాపీ వాచర్నడిగి తీసుకున్నాను. తీరా లెఖ్ఖ రాస్తే నూరు రూపాయల ఏభై పైసలు లెఖ్ఖ తేలింది. తినని దేముడి కింద అంత ఖర్చు ఎందుకని తరువాత ఆ ప్రయత్నం మానుకున్నాను'' అన్నాడు గర్వంగా.

''సుబ్బారావు! నువ్వు పొరపాటు పడుతున్నావురా! ఇది లిస్టు కాదు. నీ ఆన్సరు పేపరే!''

''నిజమా? పొరపాటున తొందరలో లిస్టు వాచరు కిచ్చి ఆన్సరు పేపరు తెచ్చానా? ఒరేయ్ అప్పారావూ ఇప్పుడు నా గతేం కానురా? పొరపాటు జరిగిపోయింది దేముడోయ్!'' అంటూ ఆన్సరు పేపరు పట్టుకుని కూలబడిపోయాడు సుబ్బారావు.






## కట్నపిశాచికి బలి!

కట్నంకోసమో, మరో లాంఛనాల కోసమో ఇంటి కొచ్చిన కోడలు పిల్లనునానాహింసలూ పెట్టి చంపే యడము యిప్పుడు సామాన్య మయినదిగామారి పోయింది. కలకత్తా శానూరులో ఒక యింట్లో ఆయింటి కోడలు పెడరెక్కలు విరిచికట్టి ఆమె అత్త, మామలు,భర్త,మరదులూకలిసి ఆమె మీద కిరోసిన్‌పోసి నిప్పంటించారట. అదే వూరిలో మరో హేమనామె మామ, భర్త, మరదలు కలిసి నగ్నంగా చేసి వొళ్ళంతా కుళ్ళపొడిచి, మీద ద్రావకం పోసి కాస్సేపు విలవిలాడాక మీద కిరసనాయిలు పోసి, నిప్పంటించి ఆనందించారట. కేంద్రగావ్ అనే చోట ఒకాయన తనభార్యనుచితకబాది చంపడానికి మనుషులను అద్దెకు తెచ్చుకున్నాడట. ఆ మహాను భావుడు మరింతకట్నంతో ఇంకో అమ్మాయితో పెళ్ళి సిద్ధం చేసుకుని, యీ భార్యను ఆవిధంగా హత మార్చాడట. దీపావళి బహుమతులు నీ బాబు ఎందుకు పంపలేదూ అని వో అమాయకురాలిని ఆమె ప్రియభర్త (కలకత్తాలో) పీకనొక్కి చంపే శాడట.

### భార్యపై శంక - పసికందు హత్య!

నెల్లూరుతాలూకా గరికపాడు గ్రామానికి చెందిన పబ్బా రమణయ్య అనేఆయన తన భార్య చిరంజీవి శీలాన్ని శంకించి, ఆమెకు పుట్టిన రెండోబిడ్డ తన మూలంగా పుట్టినవాడు కాదని నిర్ణయించుకుని, ఆ నాల్నెల పసిబిడ్డకు ఎండ్రినుు విషమిచ్చి చంపే డట. పిల్లవాడు చనిపోయాక ఆతన్ని స్మశానానికి తీసుకు పోతుండగా ఆతని మామగారు పోలీసులకు యిచ్చిన రిపోర్టుతో వాళ్లొచ్చిశవాన్ని తీసుకుని శవ పరీక్షకు పంపారట.

### తండ్రి ప్రాణం తీసిన కొడుకు తప్పు!

పరమత్తి అనే గ్రామానికిచెందిన 55 ఏళ్ళపళని యప్ప కొడుకు అన్బళగన్ ఆదేవూరుకు చెందిన కందసామి అనే అతని ఆవును దొంగిలించి అమ్మేసు కుని జల్సా చేసుకున్నాడట. ఈ విషయం చెప్పి తనకు డబ్బు తిరిగివ్వమని కందసామిపళయనిప్పను అడిగితే నా కొడకు చేస్తే నన్నడుగుతావేం అనిగయ్యి మన్నాడట. ఆ రగడలో కందసామి వో కత్తితో పళని యప్ప పొట్టలో పొడిచాడట. ఆనక హత్యకారణంగా జైల్లో వెళ్ళి కూర్చున్నాడట.

### పగ!

ఈస్టరన్ రైల్వేసెక్టారుకు చెందిన అంబికాలా స్టేషను లెవెల్‌క్రాసింగు గేట్‌మేన్ హేమ్‌బ్రమ్ అనే అతను పట్టాఫిష్‌ప్లేట్లు వగైరాలు దొంగతనం చేసుకు పోతున్న వో ముఠానుపసిగట్టి వెళ్ళి స్టేషను మాస్టరుకు నేరుగా చెప్పి తిరిగి తన స్థానానికి వస్తూండగా ఆ దొంగలతన్ని పట్టి చంపి, శవాన్ని ఈడ్చుకుంటూ వో గ్రామానికి తీసుకుపోయి, అక్కడో యింటి వరాండాలోని దూలానికి వేలాడదీసి చక్కాపోయారటామంటూవారు.

### రాగింగ్‌పై నిషేధం!

త్రివేండ్రం ఇంజనీయరింగ్ కాలేజిలోనూ చాలా కాలేజీలలో లాగ "రాగింగ్" జరుగుతూనే వుందట ప్రతియేడూ. కానీ యీసారది శృతిమించి రాగాన్న పడ్డదట. కొంతమంది విద్యార్థులు వో విద్యార్థినిని పట్టుకుని వోగదిలోపెట్టిఆమెబట్టలన్నీ సంపూర్ణంగా వూడదీసి, నగ్నంగా తయారుచేసి, ఆనందించారట. ఈ దారుణం తెలిసిన ప్రభుత్వం యీ "జూనియర్ విద్యార్థులనువేడిపించే ఆట"ను చట్టపూర్వకంగా నిషేధించాలని నిర్ణయించిందట. అక్కడేకాక దేశం మొత్తం అంతా కూడా చేసి తీరాలి.

### నీళ్ళ కోసం!

కావేరీనీళ్ళు మా రాష్ట్రానికి కావాలి. "తన్నివేణుం" అని నినాదాలు చేసుకుంటూ తమిళనాడు సేలం నుంచి బెంగుళూరుకు నూటపాతిక మైళ్ళు నడిచి వెళ్ళడానికి, కర్నాటక ముఖ్యమంత్రి గుండూరావు గారిన్నిల్వెడానికే యాభైమంది ఆడామగా మొన్న 20వ తేదీన బయలు దేరారట.

### నగలతో పారిపోయిన పనిమనిషి!

ధర్మపురిలో రత్నవేలు చెట్టియార్ అనే వో అరవైయ్యేళ్ళ లక్షాధికారి యింట్లో పనిచేసే 35 ఏళ్ళ చన్నమ్మ అనే వో విధవరాలు యింట్లో ఎవరూ లేకుండా చూసి ఆతనికి బ్రాందీ అధికంగా యిచ్చి తాగించేసి అరవై కాసులబంగారు నగలు తీసుకు ఉడాయించబోతూంటే ఆ చెట్టియారంతమైకం లోనూ ఆమె చీర దొరకబుచ్చుకున్నాడట. దాంతో మార్గాంతరం లేని ఆమె అతన్ని కనకున్న కత్తితో పొడిచి నగలతోపారిపోయి ఫలితం దక్కక పోలీసులకు చిక్కి చక్కా కూర్చుందట జైల్లో!

### భార్యని కొట్టిచంపిన భర్త!

తంజావూరకు చెందిన జోసఫ్ అనే అతను తన భార్య ఫెలోమినాను ప్రతి చిన్న విషయానికి చావ కొట్టేవాడట. వో రోజు మోతాదెక్కువయ్యేసరికి ఆమె విల విల్లాడిపోయిందట. ఏంచెయ్యాలో తెలీని ఆ జోసెఫ్‌కు వో భూతవైద్యుడు భస్మాన్నిచ్చి ఆమె వొంటికి రాయమన్నాడట. ఈ పనిలో ఆమెకు వైద్యసహాయం అందనందువల్ల చనిపోయిందట. ఈతనికి యావజ్జీవ శిక్ష వేసి, ఆనక దానిని అంతేళ్ళు కటిన శిక్షగా మార్చారట. ★



# హైదరాబాద్ నోట్‌బుక్

తిరుమల రామచంద్ర

## వసునందన్‌కు కృష్ణశాస్త్రి బహుమతి :

మహాకవి దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి స్మారకార్థం 1980లో ఆంధ్ర మహిళాసభ ట్రస్టు బోర్డు ఏర్పాటు చేసిన500 రూపాయల బహుమతి ఈసారి 1982కు శ్రీవసునందన్‌కావ్యం 'భారతం'కు లభించింది. ఈ బహుమతిని ఏటా నవ కవుల కవితలకు ఇస్తున్నారు. శ్రీ వసునందన్ ఎం.ఎ.ఎం.ఫిల్.లోఉత్తీర్ణులై ప్రస్తుతం పి.హెచ్.డి.చేస్తున్న యువ, నవ కవి. 33 సంవత్సరాలవారు. ఉస్మానియా విశ్వవిద్యాలయంకరస్పాండెన్స్‌కోర్సెస్‌సంస్థలో కోర్ ఫాకల్టీ మెంబర్‌గా పనిచేస్తున్నారు. వివిధ తెలుగు పత్రికలలో పెక్కు వ్యాసాలు వ్రాశారు. ఎనిమిది గద్య పద్య విమర్శ గ్రంధాలు ప్రచురించారు. ఈబహుమతి ప్రదానం శ్రీ కృష్ణ శాస్త్రి జయంతి సందర్భంగా ఆంధ్ర మహిళాసభ ఆర్ట్స్, సైన్స్ కళాశాలలో జరిగింది. రాష్ట్ర ప్రభుత్వ ఆస్థానకవి డాక్టర్ దాశరధి అధ్యక్షత వహించారు. శ్రీ వసునందన్ కావ్యగానం చేశారు

## ఆనంద బాలానంద సంఘం వేడుకలు :

ఆనందనగర్ కాలనీ ఆనంద బాలానంద సంఘం సాంస్కృతిక కార్యక్రమం శ్రీమతి ఇందిరాగాంధి జన్మదినోత్సవం నవంబర్ 19న మహోత్సాహంగా ఖైరతాబాద్‌లోని జిల్లాపరిషత్తు హాలులోజరిగాయి. శ్రీ తిరుమల రామచంద్ర అధ్యక్షత వహించారు. ప్రారంభంలో సంఘ కార్యదర్శిని శ్రీమతి ఎం. భారతీ రాజారావు స్వాగతం చెప్పారు. ముఖ్య అతిథులు శ్రీయుతులు న్యాయపతిరాఘవరావు, బాల చంద్రిక సంపాదకులు శ్రీ ఏడిద కామేశ్వరరావు, ఆనందనగర్ కాలనీ సంక్షేమ సంఘ ప్రముఖులు శ్రీ ఆకెళ్ల సత్యనారాయణమూర్తి, వెంకట రమణా బాలానంద సంఘం కార్యదర్శిని మున్నగు వారు ప్రసంగించారు.తర్వాత ఆనంద బాలానంద సంఘం, వెంకట రమణా బాలానందం సంఘం, నవీన్‌నగర్ బాలానంద సంఘం, ప్రకాశ్ విద్యానికేతన్ బాలలు నృత్య, నాటిక, సంగీత, వాద్యాది ప్రదర్శనలు జరిపారు. తర్వాత పోటీలలో గెలుపొందిన బాలబాలికలకు శ్రీ తిరుమల రామచంద్ర బహుమతులు పంచిపెట్టారు. సంఘ సంయుక్త కార్యదర్శిని శ్రీమతి డి. నాగవేణి వందన సమర్పణ చేశారు.

శ్రీనివాస సాహితీ సమితి, హైదరాబాదు వారి 12 వ వార్షికోత్సవ సందర్భంగా ఇటీవల జరిగిన సభలో నన్నయ్య కవితావైభవంపై ప్రసంగిస్తున్న డాక్టర్ వాసా ప్రభావతి. ముఖ్య అతిధి శ్రీ కె. వి. భాస్కరరావు, సభాధ్యక్షులు డా. దివాకర్ల వెంకటావధాని, డా. ఇరివెంటి కృష్ణమూర్తి, డా. ఎల్లూరి శివారెడ్డి, ఆచార్య తిరుమల గార్లని చిత్రంలో చూడవచ్చు.



## జనవరి 5 న ఎన్నికలు :

ఆంధ్రప్రదేశ్‌లోనూ, దానితోపాటు కర్నాటక త్రిపురాలలోను విధానసభలకు జనవరి 5న ఎన్నికలు జరుగుతాయి. ఈ మేరకు ప్రధానఎన్నికల కమిషన్ నవంబర్ 26న అధికార ప్రకటన చేసింది. పోలింగ్ ఒకేరోజున— జనవరి 5న పూర్తవుతుంది. నిర్ణీత వ్యవధికన్నా నెల ముందే ఎన్నికలు జరుగుతాయన్న ప్రకటన పాలక వర్గంలో కొందరికి, ప్రతిపక్షాలలో అందరికీ ఆశ్చర్యం కలిగించింది. 1978 ఎన్నికలకన్నా ఈ ఎన్నికలలో 35లక్షల మంది కొత్త వోటర్లు పాల్గొంటారు. ఈ సంవత్సరం మార్చిలో ప్రకటించిన ఎన్నికల జాబితా ప్రకారం 314 లక్షల మందివోటర్లున్నారు. నియోజిక వర్గాలలో మార్పేమీలేదు. ఒకనామినేటెడ్ ఆంగ్లో ఇండియన్ సభ్యునితో సహా 294 విధాన సభ సభ్యులతో కొత్త విధాన సభ ఏర్పడుతుంది. ఎన్నికలు నెల ముందు జరుపడాన్ని ప్రతిపక్షాల వారు ఎంతగా విమర్శించినా,ఎన్నికలు నెల ముందుగా జరుపడానికి కారణం పరిపాలన సౌకర్యమే తప్ప మరొకటి కాదని ముఖ్య మంత్రి శ్రీ విజయభాస్కరరెడ్డి నవంబర్ 26న గాంధిభవన్‌లో జరిగిన ఇందిరా కాంగ్రెస్ కార్యకర్తల సమావేశంలో తెలిపారు.

## బి. జె. పి. ప్రదర్శన :

మండిపోతున్న ధరలకు, అవినీతికి, అసమర్థ పాలనకు నిరసనగాను, రానున్న విధాన సభఎన్నికలలో ప్రతిపక్షాల విజయం కోరుతూను భారతీయ జనతా పార్టీ నవంబర్ 27న నగరంలో బ్రహ్మాండమైన ప్రదర్శనం జరిపింది. ఈ ప్రదర్శనం రాష్ట్ర బి.జె.పి. నాయకత్వంలో ఎగ్జిబిషన్ మైదానం నుంచి మధ్యాహ్నం ఒకటిన్నరకు బయలుదేరి అఫ్జల్‌గంజ్, నయాపూల్, సుల్తాన్ బజారు, ఆర్. టి సి. క్రాస్ రోడ్, బషీర్‌బాగ్‌ల మీదుగా పదిహేను కిలోమీటర్లు నడిచి నిజాం కళాశాల మైదానం చేరుకుంది.మూడు కిలోమీటర్ల పొడవున్న ఈ ప్రదర్శనంలో లక్ష మందికిపైగా జిల్లాలనుంచి వచ్చినకార్యకర్తలు, అభిమానులు పాల్గొన్నారు. ప్రదర్శనానంతరంజరిగిన బహిరంగ సభలో భారతీయ జనతా పార్టీ అధ్యక్షుడు శ్రీ అటల్‌బిహారీ వాజిపేయిప్రసంగిస్తూ'రాష్ట్రంలోరాజకీయంగా మార్పు తేవడానికి తగిన అవకాశం మీ ఇంటి తలుపులు తడుతూంది. దానిని సద్వినియోగం చేసుకొని, వచ్చే విధాన సభ ఎన్నికలలో ఇందిరా కాంగ్రెస్‌ను, గద్దె దింపి, రాష్ట్ర రాజకీయాలలోనేగాక, దేశ రాజకీయాలలోనే నూతనాధ్యాయంప్రారంభించాలని ఆంధ్ర ప్రజలను కోరారు.బహిరంగ సభకు రాష్ట్ర శాఖాధ్యక్షుడు శ్రీచలపతిరావు అధ్యక్షతవహించారు. శ్రీ వెంకయ్యనాయుడు తమసహజ చలోక్తులతో ప్రసంగించారు. ఈ ప్రదర్శనలో వికలాంగులు కూడా పాల్గొన్నారు.

### ధన్వంతరి జయంతి :

గోపాలాచార్లు, లక్ష్మీపతి స్మారక ఆయుర్వేద శాస్త్ర పరిశోధక మండలి నవంబర్ 13వ తేదీన చిక్కడపల్లిలోని కేంద్ర గ్రంథాలయంలో ధన్వంతరి జయంతి జరిపింది. మండలి అధ్యక్షుడు డాక్టర్ డి. వి. సుబ్బారెడ్డి ప్రసంగిస్తూ, ధన్వంతరి జయంతిని 1927లో ప్రారంభించామని, తమ మండలి లక్ష్యం అపూర్వ ఆయుర్వేద పుస్తక ప్రచురణ మని అన్నారు. మండలి ఉపాధ్యక్షులు లెఫ్టినెంట్ కర్నల్ టి. ఎస్. ఎన్. మూర్తి స్వాగతం చెబుతూ, ధన్వంతరి అవతార దినం పర్వదినమన్నారు. డాక్టర్ బి. రామారావు ప్రసంగిస్తూ, ధన్వంతరి జయంతి ప్రాశస్త్యం వివరించారు. ఆశ్వయుజ కృష్ణ త్రయోదశి హస్తా నక్షత్రం నాడు ధన్వంతరి అవతరించారన్నారు. శ్రీరంగం దేవాలయం ప్రాంగణంలో ధన్వంతరి దేవాలయం వుందని డాక్టర్ రామారావు అన్నారు. ప్రధానాతిథి హైకోర్టు మాజీ ప్రధాన న్యాయమూర్తి శ్రీ అల్లాడి కుప్పుస్వామి ప్రసంగిస్తూ, ఆయుర్వేద ప్రాశస్త్యాన్ని తెలుపుతూ కేంద్ర ప్రభుత్వం ఆసియా క్రీడలకు ఖర్చు పెట్టే దానిలో సగమిచ్చినా ఆయుర్వేదానికి ఎంతో మేలు కలుగగలదన్నారు. పిదప ఆయుర్వేద దీపిక అనే గ్రంథాన్ని ఆవిష్కరించారు. ప్రభుత్వ ఆయుర్వేద కళాశాల ప్రిన్సిపాల్ డాక్టర్ ముదిగొండ శంకర శాస్త్రి బసవరాజు యమనే సుప్రసిద్ధ వైద్య గ్రంథమైన బసవరాజు చిత్రపటాన్ని ఆవిష్కరించి, బసవరాజు ప్రస్తుతం కర్నాటకలో చేరిన బళ్లారి జిల్లా కొట్టూరు అనే వీరశైవ క్షేత్ర వాస్తవ్యుడని అన్నారు. మండలి మరొక ఉపాధ్యక్షుడు డాక్టర్ వేటూరి సుందర శాస్త్రి మండలి ఇదివరకు కల్యాణ కారకం (కరీంనగర్‌లోని రామగిరి వాస్తవ్యుడయిన ఉగ్రాదిత్యాచార్యుడు రచించినది), వైద్య శారీరం (ప్రముఖ ఆంధ్ర వైయాకరణుడు బాలసరస్వతి రచించినది), భిషక్ సుధార్ణవం, ఆంధ్ర వైద్య చింతామణి అనే వైద్య గ్రంథాలు రచించిందని, ప్రాకృతంలో వున్న హరమేఖల మొదలయిన అపూర్వ గ్రంథాలు ప్రచురించనున్నామని అన్నారు. భారతీయ వైద్య, హోమియోపతి శాఖ డైరెక్టరు శ్రీ జి. హనుమంతరావు, డిప్యూటీ డైరెక్టర్ డాక్టర్ ఆర్.ఎన్. శర్మ ఆయుర్వేద విశిష్టతను గురించి, ప్రసంగించిన పిదప, మండలి కార్యదర్శి శ్రీ వేటూరి యోగానంద ధన్యవాదాలు సమర్పించారు.

### ఉపశ్రుతి :

మీ పని బాగుంది పంతులు గారూ! చేతినిండా రాబడి, లెక్కా లేదు, పత్రం లేదు. ఇన్‌కంటాక్స్ అంతకన్నా లేదు. సామెత చెప్పినట్టు పురోహితుని భార్య పట్టపురాణి—అన్నారు ఒకరు పురోహితులు శ్రీపద్మనాభశర్మతో. పద్మనాభశర్మ నవ్వి గడసరి, అన్నాడుగదా— ''అయ్యా మాది వానాకాలం రాబడి. ఒక రోజు ఉంటుంది, ఒక రోజు ఉండదు. మీరు ఏదో కొంత ఇన్‌కంటాక్స్ చెల్లిస్తారు. నాకు రాబడి లేని రోజును ఇన్‌కం టాక్స్‌గా భావిస్తాను'' అని.

# వంటలు



## అమృత ఫలం

కార్తీక, మార్గశిర మాసాల్లో అతి విస్తారంగాను, మిక్కిలి చౌకగాను దొరికే ఉసిరిగకాయ మానవులకు లభిస్తున్న ఒక అమృత ఫలం అని చెప్పొచ్చు సంస్కృతంలో 'ఆమలకం' అని పిలువబడే ఉసిరగ కాయకు ఆయుర్వేదంలో విశిష్టమైన స్థానం ఉంది. దీనిలో దొరికేటంత 'సి' విటమిన్ మరి దేనిలోను దొరకదు. ఉసిరగ కాయ వైశిష్ట్యాన్ని గ్రహించిన మన పూర్వులు 'ధాత్రి' అనే పేరుతో ఉత్థాన ద్వాదశి నాడు దానికి విశేష పూజ నేర్పాటు చేశారు. ఉసిరిగకాయ గుణాన్ని తెలుసుకొని ఎప్పుడు, ఎలా వాడాలో అలా వాడితే దేహం లోని సర్వాంగాలు ఆరోగ్యకరంగా ఉండి ముసలితనం దూరమవుతుంది.

ఉసిరగకాయను ఆవకాయగాను, మొరబ్బాగాను, పొడి రూపంగాను ఉపయోగించవచ్చు. ఉసిరగకాయలోని విత్తనాలను తీసివేసి, తురుంబట్టి, ఎండబెట్టి, పొడిగా నిల్వచేసి కొని సంవత్సరం పొడవునా వుపయోగించుకో వచ్చును. వుసిరిగపొడి వలన చాల లాభాలు ఉన్నాయి ఆ పొడికి తేనెను కలిపి తిన్నట్లయితే దగ్గు తగ్గుతుంది స్త్రీలకు ముట్టు సమయంలో అధిక రక్తస్రావం అవుతుంటే అదీ తగ్గుతుంది. వుసిరిగపొడితో కషాయం చేసుకొని త్రాగితే మూత్ర దోషాలు పరిహారమవుతాయి. నోటిలోని కురుపులు, పుళ్లు, తేన్పులు, గుండెలో మంట మొదలైన అజీర్ణ దోషాలు నయమవుతాయి. పిత్త దోషాలకు వుసిరిగకాయ దివ్యమైన ఔషధం.

ఎండిన వుసిరిగపొడి, మొలకెత్తిన మెంతులు, నిమ్మకాయి తొక్కు, కొబ్బరి నూనెలో కలిపి, కాచి వుసిరిగ నూనెను తయారు చేయవచ్చు. ఈ నూనెను రోజూ తలకు పూసుకున్నట్లయితే, వెంట్రుకలు ఊడటం తగ్గి, సొగసుగా పెరుగుతాయి. వెంట్రుకలు నెరవటం సైతం తగ్గి నల్లగా మెరుస్తుంటాయి ఇదే వుసిరిగ నూనెను మళ్ళీ నువ్వులనూనెలో కలిపి. కాచి వారాని కొకసారి తలంటు స్నానం చేయటం కురుల ఆరోగ్యానికి మంచిది తద్వారానే కాళ్లు చేతుల మంటలు, వళ్ళునొప్పులు తగ్గి హుషారుగా వుంటుంది దృష్టిశక్తి, బుద్ధి శక్తులకు కూడ అది దోహదం చేస్తుంది

ఉసిరిగకాయ తింటే పిల్లలకు జలుబు చేస్తుందని, నిల్వచేయటం కష్టమని దీన్ని చాలమంది గృహిణులు అలక్ష్యం చేస్తారు. కాని, ప్రకృతి మనకు ప్రసాదించిన ఈ అమృత ఫలాన్ని ఆదను, పదను తెలిసికొని వుపయోగించటం చాల మంచిది.

— అనసూర్యమ్మ

## రెండు రంగుల కదంబ కేకు

కావలసిన వస్తువులు :— మైదాపిండి 1 కప్పు, శెనగపిండి 1 కప్పు, కొబ్బరికోరు 1 కప్పు, డాల్డా అరకప్పు, చక్కెర 3కప్పులు, ఏలక్కాయలు 4, నీళ్లు ఒకటిన్నర కప్పులు, రంగు చిటికెడు.

చేయు విధానము :— మైదాపిండిని, శెనగపిండిని వేర్వేరుగా బాగా జల్లించవలెను. వేర్వేరుగా సన్నని సెగమీద వేయించవలెను. పచ్చికొబ్బరి కోరును దోరగా వేయించవలెను. ఇవన్నీ బాగా చల్లారిన తర్వాత ఈ మూడిం

టని బాగా కలియబెట్టి ఒక ప్రక్కన పెట్టుకొనవలెను ఒక వెడల్పాటి మూతి గల పాత్రలో ఒకటిన్నర కప్పుల నీరుపోసి మూడు కప్పుల చక్కెర పోసి పొయ్యి మీద పెట్టి బాగా తీగ పాకం వచ్చేవరకూ కలియబెట్టవలెను తీగపాకం వచ్చిన తర్వాత ఈ మైదాపిండి, శెనగపిండి, కొబ్బరి కోరుల మిశ్రమాన్ని కొద్ది కొద్దిగా పోస్తూ, మధ్య మధ్యలో కరగబెట్టిన డాల్డా పోస్తూ కలియబెట్టాలి. తర్వాత పొయ్యి మీద నుండి దింపవలెను. డాల్డా తడిమి వుంచిన తట్టలో సగం పాకం పోయవలెను. మీకు నచ్చిన రంగు పొడి ఒక చిటికెడు ఒక స్పూను నీళ్లలో పోసి కలిపి మిగిలిన సగం పాకంలో పోసి బాగా కలియబెట్టవలెను. ఈ రంగు హల్వాను యిదివరకే తట్టలో పోసిన హల్వా మీద పోసి బాగా చల్లారిన తర్వాత మీకునచ్చినసైజుల్లో, నచ్చిన ఆకారంలో ముక్కలుగా కోసుకొనవలెను ఈ రెండు రంగుల (డబుల్ కలర్) కదంబ కేకు చాలా చవుకగా, తేలికగా తయారు చేయవచ్చును. రుచిగా వుంటుంది. ఒక వారం నిల్వ వుంటుంది.

— యం. కె. బేగ్

## ఎగ్ పకోడా

కావలసిన వస్తువులు :— ఒక గ్లాసు శనగపిండి, రెండు కోడిగుడ్లు, కారం, వుప్పు తగినంత.

చేయు విధానము :— శనగపిండి జల్లించి పెట్టుకోవాలి. కోడిగుడ్లను ఉడికించి నాలుగు భాగాలుగా చేసిపెట్టుకోవాలి. పొయ్యి మీద బాణలి పెట్టి అందులో నూనె పోయాలి. శనగపిండిని కారం, వుప్పు, కొద్దిగా తినేసోడా వేసి చిక్కగా కలిపి పెట్టుకోవాలి నూనె బాగా వేడి అయ్యాక కోడిగుడ్లు ఒక్కొక్క ముక్కను అంటే కోడిగుడ్డు లోని పసుపు సొనతోసహా పిండిలో ముంచి నూనెలో వేయించాలి. అలాగే అన్నియు వేయించి దింపుకోవాలి. ఇది వేడి వేడిగా తింటే ఎంతో బాగుంటుంది. చాలా సులభము ఇది చేయుటము. పిల్లలు కూడా బాగా ఇష్టపడతారు.

— యం. రేష్మ




## ముఖచిత్రం

జయప్రద ముఖచిత్రం "హలో" అని మమ్మల్ని పలకరిస్తున్నట్లుగా ఆమె కళ్ళు చెబుతున్నాయి.

పరిగి నిర్మల (అనంతపురం)

## ఆహ్లాదకరం!

జయప్రద ముఖచిత్రం అత్యంత ఆకర్షణీయంగా, అందంగా ఆహ్లాదకరంగా ఉంది. మా అభిమాన నటి ముఖచిత్రం ఇంత సుందరంగా ప్రచురించినందుకు థాంక్స్.

ఎన్. శివానంద్ (బెల్లంపల్లి.)

## అందం — ఆకర్షణీయం!

3.12.82వ తేది సంచిక జయప్రద ముఖచిత్రం చాలా అందంగా, ఆకర్షణీయంగా ఉంది.

బి. లక్ష్మణశాస్త్రి (భీమవరం)

## విశేషం

చిరునవ్వులు చిందించే చిన్నారి వలపులు దోచుకునే వయ్యారి నటీమణి రాజ్యలక్ష్మి ముఖచిత్రం మమ్మల్నినవ్వులతోముంచేసింది. ఆసక్తిదాయకమైన రెండు సీరియల్స్ ఈ సంచికతో ముగించడం ఒక విశేషం.

బి. మహమ్మద్‌సలీమ్ (గుత్తి)

## దీపావళి సంచిక

శంకు "కార్టూన్" ముఖ చిత్రాంనందంలో వెలువడిన 26 11.82 దీపావళి సంచిక విశేషంగా ఆకర్షించింది జీవన్మృతులు చాలా బావుంటూంది. బ్రామ్‌స్టోకర్ ఆంగ్ల మూలానికి దుర్గాప్రసాద్ అనువాదం చక్కగా సాగుతోంది. ఉదా: 54వ పేజీలోని "అక్కడక్కడా అడవి మధ్య పారే నదులు వెండి తీగల్లా కనిపిస్తున్నాయి" అన్న వర్ణన అద్భుతం. సీరియల్ ఉత్కంటత కల్గిస్తోంది.

పెన్మెత్స సూరిబాబు (హైదరాబాద్)

## హృదయాన్ని ఆకట్టుకుంది

జయప్రద ముఖచిత్రంతో వచ్చిన పత్రిక చాల ఆకర్షణీయంగా ఉండి, నా హృదయాన్ని ఆకట్టుకుంది.

బిరుదరాజా సతీష్‌కుమార్ బట్ (కాజీపేట)

## నటుల ముఖచిత్రాలు

నటి మాధవి ముఖచిత్రంతో వెలువడిన ఈ వారం పత్రిక అత్యంతాకర్షణీయంగా ఉంది. ఎప్పుడూ నటీమణులనే కాకుండాఅప్పుడప్పుడూ నటులనుకూడా ముఖచిత్రాలుగా వేస్తుంటే బాగా ఉంటుంది.

ఇకపోతే కొద్దికాలం క్రితం పరిశ్రమ నుంచి తప్పుకున్న సూపర్ హిరోయిన్ వాణిశ్రీ ముఖచిత్రం వెయ్యమని చాలాసార్లు రాయడం జరిగింది. మా అభిమాన పత్రికపై అభిమాన నటిని చూడాలని ఎంతో ఆశగా ఉంది. వాణిశ్రీ ముఖచిత్రం ప్రచురిస్తారని ఆశిస్తున్నాను.

వేమూరి శ్రీవాణి, చంద్రశేఖర్ (కరీంనగర్)

## వరద

పజ్జల కాళిదాసు గారి కథానిక 'వరద' చాలా బాగుంది. రచయిత కులమతాలను సృష్టించిన ఈ సమాజం రీతిని నదీ ప్రవాహంగా బాగా తెలియజెప్పారు. ఆ నదీప్రవాహాన్ని ఎదిరించి వెంకటశాస్త్రిలాగా ఎదురు నిలిస్తే ఆ ప్రవాహం ఏమీ చేయలేదు. నిజంగా 'వరద'న్నది సమాజంలోఉండే ఈ జనంలో ఎపుడో ఉనట్లుండి రావలసిన సామాజిక విప్లవాన్ని సూచిస్తుంది. రచయిత ఎంతయినా అభినందనీయులు.

శేషు, ప్రసూన (గుంటూరు)

## అతి వివేకం

శ్రీవల్లి కార్టూనిస్ట్ — అమలాపురం గారి 'అవివేకం' లేఖ చదివి వ్రాస్తున్నాను (వారపత్రిక 12..11.82).

"హిందూ మతం లోని దేవుళ్ళ సంఖ్య చెప్పలేం" అని వ్రాశారు. హిందూ మతం హృదయాత్మికమై దుష్ట శిక్షణ శిష్ట రక్షణకు కృషి సల్పిన ప్రతిమానవత్వంలోనూ దైవత్వాన్ని ఆపాదించుకొంటుంది. తల్లి దండ్రులు, గురువు, అతిధి అందరూ దేవుళ్ళే. గోమాత దేవత, పాడిపంటలకు సహాయకారిగా అన్నం కూడా పరబ్రహ్మ స్వరూపమే. వాన, గాలి, పృధివి, అగ్ని ఇలానే దేవుళ్ళయ్యారు. నేటికి బుద్ధుడ్ని, మహాత్మ గాంధిని కూడా దేవుళ్ళుగా పరిగణిస్తున్నాం.

"ఏకోం కారం — నిరాకారం" అని హిందూ మతమే అంటుంది. హిందువులకే గాదు, యావజ్జీవ రాసులకూ దేవుడొక్కడే. అలా అయితే "యేసు క్రీస్తు" దేవుడు గాదు, దైవ దూత మత ప్రవక్త మాత్రమే. "అల్లా" అంటే దేవుడు అనటానికి మహమ్మదీయులు వాడు పదము మాత్రమే.

కార్టూన్లు ఏ దేవుళ్ళపైన వేసినా సంస్కార వంతంగా నవ్వించ గలగాలి గాని ఒకరి ధార్మికపు విలువల్ని దెబ్బ తీయకూడదు.

దగ్గుపాటి పార్ధసారధినాయుడు, (ఎయిర్ ఫోర్స్ (కేరాఫ్ 99 ఎ.పి. ఒ)



'ఉత్తరాలు' శీర్షికకి రాసేవారు తమపేరు, పూర్తి చిరునామా తెలుగు లిపిలో రాయాలని మనవి చేస్తున్నాము.

— సంపాదకుడు

న్యూఢిల్లీ లేఖ

క్టర్ జయ్‌దుబాషి గారి న్యూఢిల్లీ లేఖ 11.82) చదివిన తరువాత కమ్యూనిస్టు మీద అతనికి ఉన్న కసి ఎంతో అర్థమవు . మనదేశ ఆర్థిక, రాజకీయ, సామాజిక ములను సోవియెట్‌తో పోల్చటం హాస్యాస్పదం. కంటే వారి ప్రభుత్వ విధానానికి మన త్వ విధానానికి పొంతన ఎక్కడా లేదు. రష్యా క కార్యకలాపాలన్ని ప్రభుత్వమే నిర్వహిస్తుంది. ులకు కావలసిన అవసరాలను ప్రభుత్వమే ుతుంది.

కమ్యూనిస్టుల 60 సం. ల పరిపాలనలో యెట్ నిరుపేద దేశంగా మారిందని జయ షిగారి అభిప్రాయం. అంటే వారు జారు చక్రవర్తుల పరిపాలనలో సుసంపన్నంగా ఉన్న బోల్షివిక్‌ల చేతిలో ఆర్థికంగా అధ్వాన్న ందని ఇతని నమ్మకం. 1917 అక్టోబరు ు తరువాత (ప్లానింగు) ప్రణాళికల ద్వారా నిస్టు ప్రభుత్వం ఎంత అభివృద్ధి సాధిం సోవియెట్ ఆర్థికాభివృద్ధిని పరిశీలిస్తే అవ ుతుంది. 1926 నుండి 1939 వరకు జాతీయాదాయాన్ని385శాతానికి పెంచిన ట్టి చూస్తే అభివృద్ధి దశ ఏ విధంగా ర్థమవుతుంది.

టర్లాండ్ పెట్టుబడిదారి ఆర్థిక వ్యవ ాస వస్తువుల గురించి రచయిత మెచ్చు ప్రదర్శించాడు. కాని పై వ్యవస్థలలో విలాస ఎంత శాతం జనాభాకు లభిస్తాయి అనేవి ు. ప్రకృతిసిద్ధంగా లభించిన వనరుల ో మనం ఈనాడు ఎన్నో రకాల వస్తు ఉత్పత్తి చేస్తున్నాము. ఆ వస్తువులు ఒక్కరికి లభించేటట్లు చూడవలసిన ప్రభుత్వానిది. కాని పెట్టుబడిదారి ముఖ్య మైన ఆస్తి హక్కు మూలాన ఆర్థిక రణ జరిగి కొనుగోలు శక్తిలోమార్పులు రికులు మాత్రమే వస్తువులను కొనగలిగే ఉంటారు. మరి పేద ప్రజల మాటేమిటి?

దేశంలో అన్ని ఉత్పత్తి కార్యక్రమాలు రంగమే నిర్వహిస్తున్నట్లు డాక్టర్‌గారి యం. కాని పరిశ్రమల తీర్మానాలను ఉత్పత్తి—తీరును చూసినట్లయితే దాదాపు వినియోగ వస్తూత్పత్తి ప్రైవేటురంగం ుందని విశదమవుతుంది. ఇప్పటికే ో ఆర్థిక స్వామిత కేంద్రీకరణ తారా ఉంది. ఉత్పత్తికార్యకలాపాలను పూర్తిగ ్యాపారానికి విడిచిపెట్టినట్లయితే ఆర్థిక ులకు అంతంటూ ఉండదు.

బారుల కుటుంబాలు వెలిబుచ్చిన అభి లేఖలో పొందుపరచి సోవియెట్‌తో యోగ స్థాయి మనదేశంలోకన్నా తక్కు ునడం ప్రపంచ దేశాల వినియోగ స్థాయి జ్ఞానం లోపంగానే భావించడం అవు

ఎ. మీనయ్య (బన్స్‌వాడ)

# ఎన్నికల రంగంలో దిగిన శ్రీమతి మేనకా గాంధీ!



సంజయ్ విచార్ మంచ్ నాయకురాలు శ్రీమతి మేనకాగాంధి ఎన్నికల రంగంలోకి దిగారు. తెలుగుదేశం నాయకుడు శ్రీ ఎన్. టి. రామారావుతో ఆమె ఎన్నికల ఒప్పందం కుదుర్చుకున్నారు. తెలంగాణాలో 'మంచ్' కి ఆయిదు స్థానాలు వదిలిపెట్టడానికి 'తెలుగుదేశం' అంగీకరించింది. అందుకు బదులుగా శ్రీమతి మేనక ఆంధ్రప్రదేశ్‌లో 'తెలుగుదేశం' పోటీ చేసే నియోజక వర్గాలలో శ్రీ రామారావుతో కలిసి ప్రచారం చెయ్యడానికి ఒప్పుకున్నారు

ప్రస్తుతం ఎన్నికల ప్రచారం అన్న దానికి అర్థం మారిపోయినట్లు కనిపిస్తున్నది. ప్రతి పార్టీవారూ తాము ఏరకంగా ప్రజాసేవ చేస్తారో, దేశానికి ఏవిధంగా మేలు చేకూరుస్తారో చెప్పటం బాగా తగ్గించివేశారు. ఎదుటి పార్టీమీద దుమ్మెత్తిపొయ్యడం ఇప్పటి ప్రచారంలో ప్రధాన విషయం అయి పోయింది. కొన్ని పార్టీలకి యిది 'ఎన్నికల ప్రణాళిక' అన్నా అతిశయోక్తి కాదు.

ఇటువంటి పరిస్థితిలో శ్రీమతి మేనకాగాంధీ ఎన్నికలరంగంలో దిగటం చాలామందికి ఆసక్తిని కలిగిస్తుందనటంలో సందేహం లేదు. శ్రీమతి గాంధీ 'ఇంటికోడలు' ఆసక్తికరమైన అంశాలతో 'ఇంటిగుట్టు' రచ్చకెక్కిస్తారని చాలామంది ఎదురుచూస్తూ రనటంలో ఎంతమాత్రం అతిశయోక్తి లేదు. పొరుగింటి గొడవలు వినవేడుక అన్న సామెత ఉండనే ఉందికదా !

ఇది ఇలా ఉండగా ఇందిరాకాంగ్రెసు తరపున ఇటీవలే పునర్జన్మ ఎత్తిన సూపర్‌స్టార్ అమితాబ్ బచ్చన్ శ్రీ రాజీవ్‌గాంధీకి ప్రత్యేక సలహాదారుగా రాజకీయ రంగప్రవేశం చేస్తున్నారు. డిసెంబరు నెలాఖరులో ఆయన ఆంధ్ర ప్రదేశ్‌లో ఎన్నికల ప్రచారానికి బయలు దేరి వస్తారట

ఈసారి ఎన్నికలరంగంలో రాజకీయాలతోపాటు సినిమాగ్లామరు కూడా చోటు చేసుకుని ప్రజల ముందుకు చేతులు కట్టుకుని దిగిరావటం ఒక ప్రత్యేకత !

—ఎం ఆర్.

మీ (మా) ఆంధ్రపత్రికలో ప్రచురిస్తున్న "న్యూఢిల్లీ లేఖ" డాక్టర్ జయ్‌దుబాషిగారు బాగా వ్రాస్తున్నారు. పత్రిక చూడగానే మొదట చదివేది అదే. "పరివర్తన" రాజ్యలక్ష్మి కొలాస్కర్‌గారి కథ చాలా నచ్చింది. ఇంత మంచి కథను ప్రచురించినందుకు మీకు, రచయిత్రిగార్కి మా అభినందనలు.

వెంకటేశ్వరరావు. వి. (జగ్గయ్యపేట)

విద్యార్థిలోకం ఆశయాలు

విద్యార్థిలోకం వ్యాసాలు నాకు నచ్చాయి. అపర్ణ 13, 14 సం. వయస్సులో ఇంతచక్కని వ్యాసము వ్రాసినందుకు చాల అభినందిస్తున్నాను. కథలు "ఒక రోజు గడిచింది" 'బేతాళుడు చెప్పిన రాజకీయం' నాకు నచ్చినవి

ఎం. మహిపాల్ రెడ్డి (సౌదీ అరేబియా)

# ఉత్తరాలు

## తెలుగు పూవు 'కుందుర్తి'

వచన కవితా
భువన వావస్తు బావుటా ఎగరేసి
సాహిత్య జగతిలో
విరిసిన తెలుగు పూవు.

గంట తిరుపతి (రావివల

## ప్రకృ్యా ప్రటికు

తే. 19—11—82 దీ గల కమల్‌హా ముఖచిత్రంతో వెలువడిన పత్రికలో "ప్రకృ ప్రటిక్యా" కద మొదటినుండి చివరి వరకు హాస్యరసపూరితమై వుంది.

మరువాడ సూర్యప్రకాశం (కాశీబు

## చిట్కాలు

నటి "వనిత" ముఖచిత్రంతో వచ్చిన లోని 18 వ పేజిలో సత్యమూర్తి సేకరి చిట్కాలు బాగున్నాయి. ముఖ్యంగా గృహిణిలు గమనించి ఆచరిస్తే మరీ బాగుంటుంది.

బి. మహమ్మద్ సలీమ్ (గు

## చేరవలసినచోటు

రాజ్యలక్ష్మి ముఖచిత్రంతో వెలువడి 22.10.82 ఆంధ్రపత్రికలోని చేరవలసిన కథ చాలా బాగుంది.

దేవఉమాదేవి, ఉదయలక్ష్మి, సుధ
(భోగాపు

## అమ్మ

22.10.82 తేదీ నాటి ఆంధ్ర సచిత్ర పత్రిక ముఖచిత్రం బాగాలేదు. ఈ వారం చాలా బాగున్నాయి. ముఖ్యంగా 'అమ్మ' కథవ ఎంతో ఆకట్టుకొంది.

కె. గంగాధరరెడ్డి, కృష్ణకుమారి (పాతమ

## నచ్చలేదు

22.10.82 నాటి ఆంధ్రసచిత్ర వార కలో ప్రచురించిన రాజ్యలక్ష్మి ముఖచిత్రము నచ్చలేదు. 'ఏది స్వార్థము' "అమ్మ" బాగున్నవి.

ఎస్. కె. వేణుగోపాల్, ఎన్. రాజేంద్ర
(ఆళ్లగ

## ముగింపు బాగుంది

'రాజ్యలక్ష్మి" ముఖచిత్రంలో వెలువ 22.10.82 మీ (మా) వారపత్రిక ఆకర్ష ఈ సంచికతో ముగింపు అయిన సీరియల్స్ కూడా (ధర్మోరక్షతి రక్షితః, కాలంకరిచాక) చాలా బాగున్నాయి.

ఎం. నాగేశ్వరరావు, బాబూరావు (బ్రైపల్లి

Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press, Mallikarjuna Rao &
Gandhinagar, Vijayawada-3. Editor : S. Radhakrishna.